మూలమున నేకమగువదార్థము బహిర్గతమై, సృష్టిరూపముదాల్చెను. స్వచ్ఛము, నేకము స్వయం సంపూర్ణమునగు నిర్గుణబ్రహ్మ సర్వవస్తువులను దనకు బంధించుకొని, వానికిఁ బరస్పరానుబంధమును గలుగఁజేసిన యీశ్వర రూపమునుదాల్చెను. బ్రహ్మము విషయావిషయములకు రెంటికి నతీతము. ఒక విషయ సంబంధముగల విషయిగా బ్రహ్మము మారినపు డీశ్వరుఁ డగును; ఈశ్వరుఁ డనేకత్వములో నేకత్వరూపము. ఈశ్వరుని శక్తి వలనఁ బ్రకృతి, ప్రపంచము సంతనుబరిణమింపఁజేయును. ప్రకృతి లేక విషయమునకు స్వతంత్రస్థితిగాని, యర్థముకాని లేదు. అది యచేతన మగుటచే సచేతనమగు శక్తి సాయము లేనిదే దేని నుత్పాదింపఁజాలదు. అది కేవల విషయి కితరమైనది; ప్రపంచ మీశ్వరుని కన్యమైనది; ఈశ్వరుఁడు బ్రహ్మయొక్కయుఁ బ్రకృతియొక్కయు మిశ్రమరూపము. ఈశ్వరుఁడు శుద్ధచైతన్యముకాడు; స్వీయజ్ఞానముగల వ్యక్తిత్వము. "అతఁడు సంకల్పించెను; నే ననేక మగుదును, నేను సృజింతును."[1] జ్ఞానము, స్వీయజ్ఞానము, వ్యక్తిత్వము విషయము లున్ననే సాధ్యములగును. సర్వజ్ఞత యీశ్వరలక్షణము; అది యెట్లు సాధ్యమో భిన్నవిధముల జెప్పఁబడెను.[2] జ్ఞానము బ్రహ్మ స్వభావము. అది యొక తెలియువలయు విషయసంబంధమైనపు డొక కార్యరూపము నొందును. అట్టి విషయమునకు సంబంధించిన బ్రహ్మ, విజ్ఞాత యగును. అనఁగా జ్ఞాన

1) ఛాం।ఉ। 6,2,3: బృహ, ఉ, 1,1,1: ప్రశ్న. ఉ।2,3,4: ముండక 1,1,9.

2) సర్వజీవమానసనిత సూక్ష్మవాసనలతో నిండియుండు మాయయే యీశ్వరోపాధియని భారతీతీర్థుఁడు వాదించెను. ప్రకటార్థ గ్రంథకర్త యీ భావము నంగీకరించి, కాలత్రయమునందుఁ బ్రపంచముతో నుండునది మాయయనియు, దానిసాయమున నీశ్వరునకు సర్వజ్ఞత్వ మున్నదనియు వచించెను. తత్త్వశుద్ధికర్త, యీశ్వరుని కెల్లపుడు ప్రత్యక్షజ్ఞాన మవసరము లేదనియు, వర్తమాన ప్రపంచ మాతనికిఁ బ్రత్యక్షజ్ఞానవిషయమైనను, పూర్వప్రపంచ స్మృతి, భవిష్యత్ ప్రపంచ స్వరూపజ్ఞానము పరోక్షముగ నుండవచ్చు ననియుఁ జెప్పెను. కౌముది గ్రంథకర్త, యీశ్వరుఁడు బ్రహ్మలక్షణములను గలిగి, సర్వవిషయములను బ్రకాశింపఁజేయు ననెను

చూ: శం। భా। 1,.49 సిద్ధాంతలేశము 1

స్వరూపియగు బ్రహ్మ జ్ఞేయవిషయ మెదురైనచో జ్ఞాత యగును.[1] అనాత్మవ్యక్తిత్వముతో నవినాభావసంబంధము గల లక్షణమని తలంచిన రామానుజునితోడను హెగెల్‌తోడను శంకరుఁ డేకీభవించును. కాని వ్యక్తిత్వ ముత్తమరూప మని వారు నిశ్చయింపఁగా, ననాత్మసంబంధ మున్నంతవఱకు మనము వ్యావహారిక జగత్తులో నుంటిమని శంకరుఁడు ఘోషించినాఁడు. ఈ భేదము నతిక్రమించినఁగాని పరమార్థసిద్ధి లేదు. శుద్ధసత్తారూపము సంబంధసత్తా యైనపుడు, మొదటి సంబంధ మసద్వస్తువుతోడనే యుండును. సత్తునకు భిన్నమైన దసత్తే[2]. ఈశ్వరుఁ డనఁగాఁ దమస్సులోనుండి ప్రకాశించు నవిచ్ఛిన్న జ్యోతిస్స్వరూపమైన బ్రహ్మకు భిన్నుఁడే. అతఁడు ప్రళయభావావరణములోఁ గ్రమము ననుస్థాపించు సత్యస్వరూపి. జలోపరిభాగమున నాసీనుఁడై ధ్యానగతుఁడైన స్వరూపమును.[3] అంధకారము కాంతిని గప్పివేసి, సర్వము నాక్రమింపఁజూచుటయు, దానిని దిగమ్రింగివేయుటకై ఈశ్వరజ్యోతి సదా యత్నించుచుండుటయు జరుగుచున్నది. బ్రహ్మమునకు నంధకారమునకును, నీశ్వరునకు నంధకారమునకు సహజవైరమున్నను, చివర కీశ్వరజ్యోతియే జయించును. బ్రహ్మకును జగత్తునకు మధ్యవర్తియై, రెంటి స్వభావములను గలిగియుండువాఁడే యీశ్వరుఁడు. అతఁడు బ్రహ్మతో నొకఁడయ్యు, విషయజగత్సంబంధముగలవాఁడు. సృష్టికిఁ బూర్వమేకూడ సగుణబ్రహ్మయగు నీశ్వరునకు విషయమున్నది. ఆ విషయము "నామరూపములు, అవి యాత్మరూపములును గా ననాత్మ రూపములునుగావు, అవి పరిణతినందలేదు కాని పొంద యత్నించుచున్న" వని శంకరుఁడు చెప్పినాఁడు[4] ఇచట మనకుఁ బరమాత్మ "అహం" రూపమై యహంభావ విరోధమైన దానిని విషయ

1) ఇది వాచస్పతి భావమునై యున్నది.

2) పోల్చు: "ఈశ్వరజ్యోతి తమస్సులోఁ బ్రకాశించుచున్నది. (సెయింట్‌జాన్ 1,5) దీనిపై వ్యాఖ్య నిట్లు బిషప్ వెస్టుకాట్ వ్రాసెను. "తేజస్సులోఁ బాటాళస్మికముగా నంధకారమును గోచరించును." (డి గా స్పెల్ ఎక్కార్డింగు టు సెయింట్ జాన్ పు. 5)

3) చూ. ఉపోద్ఘాతము శం. గీ. భా.

4) శం. భా. 1, 1, 5 అనిర్వచనీయే, నామరూపే, అవ్యాకృతే. వ్యాచికీర్షితే

ముగాఁ దలఁచుచున్నది, మార్పును, ప్రవృత్తియు లేకుండు టీశ్వర లక్షణము లెన్నఁడును గాఁజాలవు. వ్యావహారికముగా సత్యస్వరూపియై యాతఁడు నిత్యప్రవృత్తి పరుఁడై తన స్వరూపనష్టమును పునర్లాభమును బొందుచుఁ బ్రపంచమునఁ బ్రవేశించి తిరిగి స్వస్థితిఁ గాంచుచు నుండకతప్పదు. ఏమియుఁ జేయక, ప్రపంచమునకు దూరస్థుఁడై, తటస్థుఁడై నవాఁ డీశ్వరుఁడు గాఁజాలఁడు. ప్రేమనిలయుఁ డనలే కాఁజాలఁడు. ప్రేమ, దాని విషయజీవితమందే జీవించుచుఁ, దత్కృత పాపాచరణములను విడిచి, సుఖదుఃఖభాగ స్వామియగుటే లక్షణము. శంకరుని దృష్టిలోను, పెక్కురితర తత్త్వజ్ఞుల దృష్టియందును, స్వీయ వ్యతిరేకరూపమై, విషయ విరహితమై, దానితోఁ దన యేకత్వమును బ్రకటింపని స్వీయజ్ఞానముగల వ్యక్తిత్వ మసంభవము. స్వీయజ్ఞానము గలవ్యక్తి తన విషయముల మూలముననే జీవించుట, సంచరించుట, స్థితిగలిగి యుండుటయు జరుగును కాని, తన విషయ వైషమ్యము లంటనిదై యున్నదని నిరూపించు టవసరమే కాని సమర్థింపశక్యము కాదు. ప్రకృతిలోని సంఘటనములు, జీవులలోని మార్పులు నీశ్వరునిలోఁ గూడ మార్పులు కలిగింపక మానవు. ఈశ్వరోపాధి లేక శరీరమగు ప్రకృతియందు జీవవ్యాపారము లనేక వికారములను గలిగించునని వేదాంతపరిభాష నిస్సంశయముగా నంగీకరించుచున్నది.[1] జగదుత్పత్తిలయము లీశ్వరునకు మార్పు గలదనియు, వృద్ధిక్షయము లున్నవనియు సూచించుచున్నవి. సృష్టి లయము లీశ్వర జీవితములో యథార్థసంచలనము లై నంతవఱకు నీశ్వరుఁడు కాలాతీతుఁడుగాక కాలవశంవదుఁడేయనియు, సృష్టిలయములు వ్యావహారిక జగత్తునకుఁ జెందిన వైనట్లే, యీశ్వరుఁడును జెందుననియుఁ జెప్పవలెను. మనమొక పరివర్తననియతి నుపయోగించి, దానికొక పరివర్తనశూన్యమగు నిర్వికారమైన యాధారము కావలసిరాఁగా, నీశ్వరతత్త్వమట్టిదే

1) సృజ్యమానప్రాణి కర్మవశేన పరమేశ్వరోపాధి భూత మాయాయాం వృత్తివిశేషాఇదం ఇదానీం స్రష్టవ్యం, ఇదమిదానీం పాలయితవ్యం, ఇద మిదానీం సంహర్తవ్యం. ఇత్యాద్యాకారా జాయంతే తాసాంచ వృత్తీనాంసాదిత్వాత్ తత్ప్రతి బింబిత చైతన్య మపిసా దీత్యుచ్యతే. 1

యనుచున్నాము; పరివర్తనమంతయు నీశ్వరుని దేహమున నున్నది యని వాదింతుము[1]. ఈశ్వరుఁ డవ్యక్తమగునాక సూక్ష్మదేహమును ధరించెను; తదంతర్గతమగు నామరూప బీజక్షేత్ర మీశ్వర కర్మభూమి యైనది. కాని యిది యాతని సంకల్పము ననుసరించి కల్పించు కొనిన సంకుచితరూపమే[2]. ఈశ్వరునితో సమాన నిత్యతగల రూపము లేనిపదార్థము నంగీకరించుటచే నీశ్వరు నవిచ్ఛిన్నతకు లోపము నాపాదించును. ఈ లోపము స్వగతమైనదే కాని బాహ్యవధిపరికల్పితమనుట వలన నెట్టి ప్రయోజనమును లేదు.

సగుణ బ్రహ్మము పరివర్తనశీలము గలదైనను, దాని యంతర్గతమై ప్రధానాంశముల కేకత్వమునిలిచియుండుననియుఁ బరివర్తనములు తటస్థ లక్షణము లనియుఁ జెప్పఁబడెను. నానారూపములుగా నాత్మావిష్కృతి నొందుటచే నీశ్వరుని యేకత్వము భంగపడదు.[3] "ఐంద్రజాలికునకుఁ దాను సృజించిన మాయవలన దోషమంటనట్లే, సంసారమాయ దానిని గల్పించిన యీశ్వరు నంటదు."[4] శంకరుఁ డీరీతిగాఁ బరిచ్ఛిన్నవస్తు తదభావముల నీశ్వరునిలో సమన్వయించి నాఁడు. సత్పదార్థమును నిర్గుణాత్మపదార్థముగా నిర్ణయించి, దాని రూపమే స్వయం పరికల్పితమగు సగుణతత్త్వమని హేతువిరుద్ధముగా నిశ్చయించిన స్పైనోజాకుఁగలయాక్షేపణ శంకరున కనువర్తింపదు.

---

1) శం॥ భా॥ 2. 1, 4. దక్షిణామూర్తిస్తోత్రమం దిట్లు చెప్పఁబడెను. "చరాచర జగత్తులోని దంతయు, భూ జలాగ్ని వాయురాకాశ సూర్యచంద్రులును, జీవుడును గలిసి యీశ్వరు నష్టాంగరూపము. యీశ్వరేతరమైనది మఱేదియును లేదు."

2) అవ్యాకృతం నామరూప బీజశక్తి రూపమ్ భూతసూక్ష్మమ్, ఈశ్వరాశ్రయం, తస్యైవోపాధి భూతం। (శం॥ భా॥ 1,2.22,

3) ఛాం॥ ఉ॥ 8,14,1, 6,4,2. తై. అరణ్యకం॥ 3,12,7. . శ్వే॥ ఉ 6 12.

4) శం॥ భా॥ 2,1,9 యథాస్వయంప్రసారితయా, మాయయా మాయావీ త్రిష్వపి కాలేషు నసంస్పృశ్యతేఽవస్తుత్వాత్, ఏవం పరమాత్మాపి సంసార మాయయా న సంస్పృశ్యత ఇతి.

పరిచ్ఛిన్నోపాధిలక్షణముల నన్నిటిని దిరస్కరించినచో నేకసద్రూప భావాస్తిత్వమే మనకు లభించునని యాతనికి బాగుగాఁదెలియును. మనము తర్కపద్ధతుల నుపయోగించినంతకాలము పరమ సత్యము మనకు నిర్గుణబ్రహ్మముకాక, సగుణబ్రహ్మరూపియగు నీశ్వరుఁడే యనియు, ననంతపరిణామ పరివర్తనముల కతఁడే యాధారమనియుఁ దెలియఁగలదు. కాని, శంకరుని తత్త్వ మంతటిలోను తర్కసిద్ధమగు జ్ఞానము పరిపూర్ణసత్యప్రకటన సమర్థముకాదను నిశ్చయము విస్తరించి యున్నది. అందుచే నీ సగుణబ్రహ్మ భావము, పరస్పరవిరుద్ధభావములతో నిండియుండుటచే నది పరమసత్యము కానేరదని స్పష్టము.

పరిచ్ఛిన్న ప్రపంచమున కీశ్వరుఁడు మూలకారణము నుపాదాన కారణము ననునదొక బుద్ధిపరికల్పితభావము. సర్వసామాన్యమగు సగుణస్వరూపమునందు సామాన్యవిశేషవిషయము లన్నియు నేకమై యున్నవనిచెప్పుట సులభమేకాని నిరూపించు టసాధ్యము. భిన్నత్వములో నేకత్వము, పరివర్తనములో నిత్యతయు, మనవ్యావహారిక జగత్తులోనే సహేతుకములుగా నిరూపించుట కసాధ్యమైనచో నీశ్వరుని విషయములోను నట్టిదే. శంకరుని సిద్ధాంతము యథార్థాస్తిత్వములేని భావమాత్రైకత్వమేయను నాక్షేపణకుఁదావిచ్చునని యాతఁడెఱిఁగి యుండియు, నేకత్వ భిన్నత్వములకుఁ దార్కికముగా సమన్వయ మసాధ్యమని యాతని నిశ్చయము. రెండు నెట్లేకకాలమున నుండఁ గలవో తనకుఁదెలియదని శంకరుని నిశ్చయము.[1] పరిపూర్ణసగుణ మూర్తియగు నీశ్వరభావము మన యనుభవజగత్కారణ నిరూపణము కాదు; జగత్కారణసమస్యయొక్క పునరుక్తిమాత్రమే మనయనుభవ

1) విశేషములతోఁ గూడిన సామాన్యముల యథార్థతా సిద్ధాంతము శంకరున కంగీకృతముకాలేదు; ఏలన నీ యథార్థతావాదుల సామాన్యముల కనంతత్వములేదు. అవి విశేషభిన్నములైన పరిచ్ఛిన్నవిషయవర్గములకుఁ జెందినవి; ఈశ్వరుఁడు కూడ నట్టి సామాన్యస్వరూపియైయైనచో, నాతఁడును పరిచ్ఛిన్నుఁడే కావున ననేకరీతుల నాతఁ డాత్మ జ్ఞాని కావచ్చును. అతఁడపరిచ్ఛిన్నుఁడైనచో నతనికొక్కటే మార్గమున్నది; లేక శంకరుని మాటలలో నాతనికిఁ బ్రవృత్తియేయుండదు. ఆతని కస్తిత్వమేకాని పరిణామము లేదు; అందుచేఁ బ్రవృత్తియు లేదు.

ములో నేకత్వము భిన్నత్వము ననఁగా నిత్యతయుఁ, బరివర్తనము నను రెండంశము లున్నవి. జీవులతోడను వస్తువులతోడనుగూడి, పరివర్తనము నిత్యతయుఁగల సముచ్చయరూపమగు మన యనుభవకారణ మెట్టిదని ప్రశ్నించి, యీశ్వరుఁడే దానికిఁ గారణమనియు నేలన నీశ్వరునకే జీవవస్తు ప్రపంచ మంగాంగి సంబంధములో సమబద్ధమైయున్నదని బదులుచెప్పుచున్నాము. అది యీశ్వరునికి దేహమగుననుట హేతు నిరూపణము కాఁజాలదు. వ్యావహారిక జగత్తుయొక్క సర్వసామాన్యలక్షణమున కాకృతిఁ గల్పించి యీశ్వరుఁ డనుచున్నాము. రామానుజుఁడును, హెగెల్ తత్త్వజ్ఞుఁడును పరమసత్యము భిన్నతాసహితమగు నేకత్వస్వరూపమనిరి. వారిదృష్టిలో హేతుబద్ధమైనదే యథార్థమైనది; ఈశ్వర జగత్తులు రెండును నిజమే. నిర్వికల్పకమగు ననుభవజ్ఞానము వస్తుజడత్వాద్వర్థము వారి నాకర్షింపవు. సత్యస్వరూపముగాదు వారు కోరునది; బుద్ధికి స్ఫురించు సత్యస్వరూపమునే వారు కోరుదురు; ఇందభావాంశ మిమిడియున్నది. బుద్ధివ్యాపారమంతయుఁ దనకు వ్యతిరేకాంశము లన్నిటిని లోఁగొని, వాని నధిగమించుటే. ఆత్మవ్యాపారమంతయు వ్యతిరేకవిషయములతో నెడతెగని సంఘర్షణమే. నిత్యప్రవృత్తియే దైవజీవితము. తార్కికముగాఁ బ్రపంచ మొక యేకసూత్రబద్ధమని తలఁచుట పరిపూర్ణ నిర్గుణతత్త్వము యొక్క అనంతభిన్నరూపములుగల ప్రదర్శనమేయని భావించుటే. దీనియందలి భావలోపములను మాత్రము మఱువరాదు.

శ్రుతులు సృష్టిక్రమమును వర్ణించుటకుఁ గారణము బ్రహ్మ జగదీకస్వరూపమును నిరూపించుటకే,[1] ప్రపంచము దేవునిస్వరూపము గాక, వేఱుపదార్థముగా దాని నీశ్వరుఁడు కల్పించినచో, నీశ్వరునకుఁ బ్రయోజనమేదియో యున్నదను దోషము నారోపింపవచ్చును. అనఁగా నాఁత డీశ్వరుఁడు కాఁజాలఁడు. కర్మసూత్రము ననుసరించి యాతఁడు సృజించెనందుమా, యాతని స్వాతంత్ర్యమున కాసూత్రమాటంకమే

1) ఏవముత్పత్త్యాదిశ్రుతీనాం ఐకాత్మ్యావగమపరత్వాత్ శం॥భా॥ (4,3,14; 2,1,34

యగును. ఫిక్టేత త్త్వజ్ఞుఁడు చెప్పిన ఆత్మస్వభావమునుగూర్చి మనము ప్రసంగించియుంటిమి; తాను విచ్ఛిన్నమై, యొక యవరోధము నెదుర్కొని, ఆత్మస్వీయజ్ఞానమును బొందుచున్నది. అట్టి యాత్మ తాను కారణము నాధారము నగు నన్యపదార్థముపై నాధారపడినదగును. అట్టి యాత్మ సృష్టికిఁ బూర్వమందును, పరమందు నుండఁజాలదు. అవాత్మను మనము నిర్మూలింపఁగలిగినచో దానితో నాత్మనిర్మూలనము కూడ నగును. ఈ సందర్భము లబ్ధముగా ఫిక్టే దృష్టి కానుటవలననే, "విషయివిషయములుగాక రెంటికి మూలాధారమగు'' సత్యమును గూర్చిన భావ మాతనికి స్ఫురించినది. ఫిక్టేదృష్టి కస్పష్టమైన యీవిషయము శంకరుని దృష్టిలో సువిస్పష్టమై, విషయివిషయభేదములు తర్కవిషయములనియుఁ, బరమార్థము తర్కమున కతీతమైనదనియు విశదమయ్యెను. పరమాత్మ జ్ఞానాధిపతియుఁ గాదు, జ్ఞానవిషయమును గాదు; పరమాత్మయే జ్ఞానము. ఈశ్వరభావమునకు బాహ్యవ్యక్తికరణమే ప్రపంచమై, యది యీశ్వరుని కెల్లప్పుడు నాత్మజ్ఞానముండుట కనుకూలముగా దానివిషయమై యుండెనన్నచో నట్టి యీశ్వరుఁడు సగుణుఁడేకాని నిర్గుణుఁడు కాఁజాలఁడు, ఏలన, "పరమాత్మ, ముకురములోఁ దన ముఖమును జూచుకొనుటకుఁగాని, పంజరములోని యుడుతవలె పరిభ్రమించుటకుఁగాని యాత్మ పరిపూర్ణతాసిద్ధికై పూనుకొనలేదు."[1] ఒక్కమాటలోఁ బ్రపంచకారణములలో వ్యక్తిత్వ ముత్తమప్రమాణము కాదు. ప్లాటినస్ చెప్పినాఁడు; "స్వీయజ్ఞానము, స్వీయపై చక్షణ్యము గలదేదియైనను మూలరూపము గాదు."[2] కావున నిర్గుణబ్రహ్మ యీశ్వరాతీతమై, స్వగతభేదరహితమై, విషయివిషయముల నవిచ్ఛిన్నమగు తన శుద్ధపరిపూర్ణచైతన్యమున బంధించియున్నదని చెప్పవలెను.

అనుభవజ్ఞానలభ్యమగు నిర్గుణబ్రహ్మకును, బుద్ధిగమ్యమగు సగుణబ్రహ్మకును భేదమున్నది. నిర్గుణబ్రహ్మ తర్కరీతుల కతీతుఁడు;

---

1) పంచదశి: చిదాభాసము, పు, 1, 7,2

2) ఎన్నీడ్సు: 3, 9, 3, మెక్ కెన్నాన్ ఇ టి వాల్యూము 2, పు 141.

సగుణబ్రహ్మ రూపములో భిన్నతయుఁ దదతిక్రమణమును మేళవించి యున్నవి. తార్కికబుద్ధికి నిర్గుణబ్రహ్మ స్వరూపములో, సన్నిరంగుల నేకవర్ణమైన చీఁకటివలె గోచరించును. పరిచ్ఛిన్న జగత్తున కర్థము నిర్గుణ బ్రహ్మసంబంధములోఁ జెప్పవలెనన్నచోఁ బరిచ్ఛిన్నతయందుఁ బ్రవేశ పెట్టవలసియుండును. శుద్ధసత్తు మనము బుద్ధిచే భావింతుము, అసత్తును భావించినవార మగుదుము, రెంటిసంపర్కమువలనఁ బరిణామజగత్తు జనించును. సరిగాఁజెప్పుచో నీశ్వరుఁడును బరిణామవశుఁ డగును. సద సద్వైరుధ్య మాతనియం దంతర్నిహిత మగును. ఈశ్వరుఁడే పుట్టుక కలవాఁడు కాకపోవచ్చునుగాని, తన స్వరూపము నాతఁ డనంతపరిణామ క్రమముచే వ్యక్తీకరించును. సదసత్తు లౌకికపరమార్థ భిన్నరూపములు వస్తువు తచ్ఛాయారూపములు, అనిర్వాచ్యమైన నిర్గుణబ్రహ్మకును, సర్వవ్యావహారికానుభవ విషయములలో నంతర్వర్తియై, యేకీకరణ మొనర్చు సగుణబ్రహ్మమునకును, మధ్యమం దొకయవిలంఘ్యమగు ఛిద్ర ముంచినాఁడని శంకరుని విమర్శించువారలకు, రెంటియొక్క దృక్పథములను గూర్చిన సంశయజ్ఞానమే కారణము. బుద్ధి పరికల్పిత జ్ఞానము విషయివిషయభేదము నెన్నఁ డతిక్రమింపఁజాలదు అందుచే సగుణ బ్రహ్మమే యిట్టి జ్ఞానమున కుపలబ్ధరూపము. దీని కతీతమై నిర్గుణ బ్రహ్మ యున్నది.

## 29 జగన్మిథ్యాత్వము

బ్రహ్మయు జగత్తును, సమఁగా నేకత్వము ననేకత్వమును రెండును సత్యములు గాఁజాలవు. "ఏకత్వ బహుత్వములు రెండును సత్యమైనచో లౌకికప్రవృత్తిపరుఁడైనవాఁ డసత్యగతుఁడయ్యెనని మనము చెప్పుటకు వీలులేదు. జ్ఞానమువలన మోక్షము చేకూరునని చెప్పరాదు, మఱియు నేకత్వజ్ఞానముచే ననేకత్వజ్ఞానము నతిక్రమింపలేము."[1] శాస్త్రికతా ప్రమాణములఁ బట్టి పరిశీలింపఁగా వ్యావహారిక జగత్తు

1) శాం భా 2,1,14.

మిథ్యాలక్షణ యుక్తమని తెలియఁగలదు. విశేషాంశములు, సంఘటనలు విషయములై యొక తెలిపికొను విషయికి సంబంధించియున్నవి. జ్ఞాన విషయమేదైన నను నశ్వరమైనది.[1] అర్థము దాని మిథ్యారూపమునకుఁ గల భేదమే విషయికి విషయముతోఁ గల భేదమునకును వరిపోవునని శంకరుని వాదము. దృష్టవిషయములన్నియు ననత్యములు, ద్రష్టయు నదృష్టము నగుటాత్మ సత్యమైనది.[2] జాగ్రద్విషయములను స్వప్న విషయములతోఁ బోల్చుచో, విజ్ఞానమునకు విషయములుగా రెండు ననత్యములే[3] సత్యమవిరోధమైనది, ప్రపంచము విరోధసముద్రము. దేశకాలనిమిత్త కల్పితమగు ప్రపంచము స్వయంసంపూర్ణము కాదు. పరిచ్ఛిన్న జగత్ప్రమన్యలను బరిష్కరించుటకు సమర్థమైన సూత్ర మా జగత్తులో వేధియును లేదు. సర్వవ్యవహారజగదనుభవరూపములగు దేశకాల నిమిత్తములు పరమప్రమాణములు గావు. సత్యము వీనిచే నాచ్ఛాదితమైనది. మనము దేశకాలనిమిత్త విషయముల నతిక్రమించి నచో నానాత్వభూయిష్ఠమగు ప్రపంచ మేకరూపమను బొందునని చెప్పఁ బడెను.[4] దేశకాలనిమిత్తము లను 'మాయల'లోఁ బోపిన మన యనుభవము సత్యముకాదు. సత్యము సార్వకాలికము.[5] అది పూర్వమున్నది, వర్తమానములో నున్నది, ముందుండును.[6] యథార్థ వస్తు వీనాఁ డుండి రే పదృశ్య మగునది కాదు. వ్యావహారిక జగత్తిల్లప్పుడు నుండదు

1) యద్దృశ్యం తన్నశ్యమ్ ॥

2) పోల్చు : "శవవదువస్తువు లనిత్యములు శవవదు వ ఋంశ్యములు"

3) దృశ్యత్వ మసత్యం చ అవిశిష్టముభయత్ర ।
(శం॥ భా॥ గౌడపాదకారిక, 2.4)

4) పోల్చు " అ స్తిభాతిప్రియం రూపం నామ చే దంశపంచకం। ఆద్యంత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతోద్వయమ్ " దూ॥ అవ్యయదీక్షిత పఞ్చాంతరేశమూ॥ 2

5) త్రైకాలికావద్య బాధిత్వం ॥

6) కాలత్రయసత్తావత్ ॥ పోల్చు : విష్ణుపురాణము॥ "యత్తు కాలాంతరేణా నాప్య సంజ్ఞామపైతిపై పరిణామాది సంభూతం తద్వస్తు" (2,13,95) పోల్చు క్రిష్టియన్ లిటర్జీ : మొదట నెట్లుండెనో, యిప్పుడు నట్లే యున్నది నట్లేయుండఁగలద జగత్తున కంతములేదు"

కావున యథార్థముకాదు యథార్థదృష్టికయథార్థమైన జగత్తుగోచరింపదు అందుచే యథార్థజ్ఞానము వలనఁ బరిహార్యమగు జగము నిజము కాదని చెప్పఁబడెను.[1] పరమైనసత్య మపరమైనదాని నసత్యమొనర్చును. లోకములోని విషయములకు మార్పుగలదు. అవి స్థిరవస్తువులుగాక, నిత్యముమారుచున్నవి. ఏది మారునో యదెన్నఁడు మారని నిత్యవస్తువు కాఁజాలదు, శంకరుఁడు చెప్పినాఁడు: "నిత్యమగు సిద్ధానికి వాది యుండదు; అది గల దేదియు నిత్యము గాదు."[2] మారుచుండు వస్తువు లెవ్వియు మనకు సంతృప్తి నీయఁజాలవు, ఎన్నఁడు మార్పు లేనిది సత్యమైనది.[3] నిజమైన దెన్నఁడును లేకుండనుండదు. సంసారములోని దేదియైన నిజమైనదైనచో మోక్షస్థితిలోను నిజమైనదికావలెను. ఈ భావమునను సరించి, పరివర్తనాత్మకజగత్తు నిజముకాదు. ప్రపంచము శుద్ధసత్తుగాని శుద్ధాసత్తుగానికాదు. శుద్ధసత్తు జగత్పరిణామములోనిది కాదు. శుద్ధాసత్తు హేతుబద్ధమైనభావమేకాదు, ఏలన సదియున్నదైనచో శుద్ధాభావమొక వస్తువనవలసివచ్చును, సర్వసత్త్వభావమొక భావ మనుట వైరుద్ధ్యమగును. అభావమొక వస్తువు కాదు, మారుచున్నదే యున్నది; అది కార్యముల నుత్పత్తిచేయుచున్నది. కావున సత్తును గాదసత్తునుగాదు.[4] ఏ దశయందును జగత్తుసత్తై, పరిణామహీనము కాఁజాలదు. పరిపూర్ణత నందుటకై నిత్యమును కృషిచేయు ప్రవృత్తి గలదే ప్రపంచము, కాని పరిపూర్ణత దానికెన్నఁడును సిద్ధింపదు. సృష్టి

---

1) జ్ఞానైక నివర్త్యత్వం "అద్వైతసిద్ధి కలిగినంతనే, జీవాత్మయొక్క సంసారిత్వరూపమును, యీశ్వరుని సృజనశక్తియు నదృశ్యము లగును; అవిద్యాకల్పితమగు ద్వైతప్రపంచ రూపమంతయుఁ బూర్ణజ్ఞానముచే నివృత్తమగును" (శంకరా 3,2,9 అర్కగీత 6,7॰)

2) సహేతుకత్వం లేని విచారకత్వకే, రోగే యదారబ్ధం తదనిత్యం (శం॥భా॥తై॥ఉ ఉపోద్ఘాతము)

3) యద్విషయా బుద్ధి ర్న వ్యభిచరతి తత్సత్; యద్విషయా బుద్ధిర్వ్యభిచరతి తదసత్ భా॥ శం॥ భా॥ 1,1,4; తై॥ ఉ॥ 2,1

4) అర్థక్రియాకారి సోల్పు: సురేశ్వరుఁడు: "కేవలాసత్తునకు సాత్మ్యములేద వస్తుతో వేరుగాగాని, కలిసికాని యుండఁజాలదు, అందుచే నసత్ క్రియాకారి "(వార్తి మా వ 927.

కందరానిదై యేదోయున్నదని యెల్లప్పుడు స్ఫురించును.[1] ఆత్మ సిద్ధియే ప్రపంచప్రవృత్తి కవసానదశ.[2] కాని ప్రపంచము ప్రపంచ ముగా నుండఁగా నది సాధ్యముకాదు. ఈశ్వరజగత్సంబంధము నిత్య మైనది. సదసత్సంబంధ మన్యోన్యవిరుద్ధమైనది; సత్తు అసత్తును స్వాధీనమొనర్చుకొని సత్తుగా మార్చుకొనయత్నించును. పరిణామ జగదధ్యక్షుఁడైన యీశ్వరునిలక్ష్యమిదియే, అసత్పదార్థముకాఁడు జయించి, సత్పదార్థముగా నెల్లప్పుడును గావించఁజూచును, కాని తర్క బుద్ధి కీప్రయత్నము దుస్సాధ్యమై పరిణమించును. అంతులేని యీ సద సత్సంఘర్షణమే యీప్రపంచపరిణామక్రమము. సృష్ట్యాదినుండియు సంతమువఱకు వెలుతురు చీఁకటిపై దండయాత్రచేయుచుండుటే సదను చున్నది. చీఁకటిని మనము దూరముగాఁ దరుమవచ్చును, చీఁకటి తప్పుకొనునేకాని తొలఁగిపోదు. పరిచ్ఛిన్నజగత్తులో సదసత్సంబంధ మొకదానికొకటి కలియుకుండునది కాదు. అది పరస్పరసంఘర్షణమే; వానిసంబంధ మన్యోన్యశత్రుత్వమే. ఇం దేయొకటియు రెండవదిలేనిదే యుండదు. ఒకదానిలోనింకొకటి యెంతగాఁ బ్రవేశించినను, వాని భేదతారతమ్యము లవినాశములై యుండుటచే, జగత్తులోని సర్వసృష్టి రమై, గోచరించును. పరిణామజగదీశ్వరుఁడైన దేవునియందుఁగూడ నీ యసద్రూపమున్నది. అసద్రూపములైన లోపములను విడిచినచో సర్వవస్తు స్వస్వరూపమును దనలో నిమిడ్చికొనియున్న బ్రహ్మమే నిజ మైన సద్రూపము. తద్భిన్నమైనదంతయు నసత్యమే.[3] కాను కాని దగుటకును, తన్నతి క్రమించి పోవుటకును యత్నించునదే సంసార ప్రవృత్తి. ప్రపంచమున కస్తిత్వమును లేదు, లేకపోవుటలేదు, అందుచే స్వరూప మనిర్వచనీయము,"[4] అది సదసద్భిన్నమైనదయ్యు, రెంటి లక్షణములను గలిగియున్నది.[5] ప్లేటో వచించునట్లు, పరిచ్ఛిన్నవస్తువ

1) శాం భా 4, 3, 14
2) శం గీ భా 18-50
3) బ్రహ్మభిన్నం సర్వం మిథ్యా బ్రహ్మభిన్నత్వాత్ (వేదాంత పరిభాష.)
4) తత్త్వాన్యత్వాభ్యాం అనిర్వచనీయా రొద్స్ ప్లేటోస్ ఎస్సేస్ 3,6,3 మెక్‌మస్టర్ ఆ టి, వాల్యూము 2 పు. 39
5) సదసద్విలక్షణ

అన్నియు సదసన్మిశ్రితములు.[1] దృశ్యమానప్రపంచ వస్తువైవిధ్యమునకు శక్తి మూలకారణము కావలెను, ఏలన మనబుద్ధియును లేద కాని ప్రపంచము మాత్రము యథార్థముకాదు. అందుచే సది సత్యమ యొక్క వికల్పమని చెప్పఁబడెను.[2] పరిచ్ఛిన్న జగత్తంతయు లోకాం మాటలలో, "నిత్యానిత్య వస్తుస్వభావ మహత్తరవైరుధ్యము" భూమ్యా కాశములు మసియైపోవగును; మనశరీరము శిథిలమగును; మ యింద్రియములు మార్పుపొంది మన వ్యావహారికములైన జీవాత్మ చెదరిపోవచ్చును. ఇందేదియుఁ బారమార్థికముగా సత్యముకాద. ప్రపంచస్వభావమును గూర్చి చెప్పఁబడినయీలక్షణమునకే మాయ యని పేరు.

## 30. మాయాసిద్ధాంతము

అద్వైతతత్త్వమందు ప్రధానలక్షణమైన మాయాసిద్ధాంతమ యొక్క తాత్పర్యమును మనము సరిగా గ్రహింపవలసియున్నది.

1) సదసదాత్మక.

2) సత్యాన్యృతే మిథునీకృత్య (శం భా ఉపోద్ఘాతము)

3) మాయ యనగా ఋగ్వేదమునందు దేవతలయొక్క, అందు ముఖ్యము వరుణేంద్రమిత్రుల అతిమానుషశక్తిగా వర్ణింపఁబడినది ప్రాచీనమంత్రములలో మాయ జగత్తునంతను నిలుపు శక్తియని చెప్పఁబడెను (ఋ. వే. 3,38,7; 9,53,3; 1,159 4; 5,85,5) [illegible] దేవ శిల్పులు వైరములుగల్గియుండిరనియుఁ దెలియుచున్నది సుప్రసిద్ధమైన యొక ఋక్కు (2,47,19) ఇంద్రుఁడు తన మాయాశక్తిచే ననేకరూపముల దాల్చెనని వర్ణిం పఁబడినది।

రూపం రూపం ప్రతిరూపో బభూవ
తదస్య రూపం ప్రతిచక్షణాయ
ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే
యుక్తా హ్యస్య హరయః శతా దశ

* "అతఁడెల్లియా రూపములలో చూపింపఁబడెను; ఇవన్నియు నాతని రూప యని భావింపవలెను. అనేక రూపములలో నింద్రుఁడు మాయాశక్తిచే సంచరించును. వేయిగుఱ్ఱము లుపయోగింపఁబడెను" ఇచట మాయయనగా ననేక విచిత్రరూపముల

పూర్వాధ్యాయమున మనము జూచిన కారణములనుబట్టి ప్రపంచము యథార్థమైనదని యంగీకరించుటకు వీలులేని కారణముచే మాయయని చెప్పఁబడెను. సత్యమగు బ్రహ్మమునకు నసత్యమగు జగత్తునకుఁగల సంబంధమెట్టిది? శంకరుని దృష్టి కీప్రశ్నయే అయుక్తమైనదగుటచేఁ బరిష్కారశూన్యమైనది. నిర్గుణబ్రహ్మసాక్షాత్కారసిద్ధితో బ్రహ్మ జగత్సంబంధప్రశ్నయే బయల్వెడలదు; ఏలన, వివాదములు కవకాశములేని సత్యము దర్శింపఁబడినది. తార్కికముగాఁ జూచినచో, జగత్తునకు సంబంధముగల శుద్ధబ్రహ్మములేదు, వాదాంతరమందు మనము దృశ్యపథమును మార్చుచుండుటచే నీ సమస్య బయలు దేరును. ఊహాకల్పితమగు సమస్యకు యథార్థమగు పరిష్కారముండఁజాలదు. సంబంధము రెండు భిన్న వస్తువులకే యుండును, బ్రహ్మకును జగత్తునకును సంబంధము చెప్పవలసినచో నవి భిన్నములని చెప్పవలెను; కాని ప్రపంచము బ్రహ్మేతరముకాదని యద్వైతము చెప్పుచున్నది. శంకరుఁడు కార్యకారణత్వమునకును అనన్యత్వమునకును భేదమును వివరించినాఁడు.[1] బ్రహ్మయు జగత్తు ననన్యములు; అందుచే వానికిఁగల సంబంధసమస్య కవకాశములేదు. బ్రహ్మాధారముగలదే జగము.[2] కాని బ్రహ్మయే జగత్తనియుఁ గాదనియుఁ గూడఁజెప్పవలెను. జగత్తు బ్రహ్మయే; ఏలన బ్రహ్మేతరమేమియునులేదు; జగత్తు బ్రహ్మ కాదు; ఏలన జగత్తునకుఁగల జనన లయాదికములు బ్రహ్మకు లేవు. బ్రహ్మ జగద్వస్తు

---

తాల్పర్ శ్రీ, ఋగ్వే 6,54,2, యిట్లున్నది: "నీవు బిందు దేహరూపములాల్చినవుడు నీ బలమును ప్రకటించుచు మానవులలో సంచరించినావు; ఓ ఇంద్రా! మనుజులుచెప్పు నీవు చేసిన యుద్ధములన్నియు నీమాయాకల్పితములు పూర్వముకాని, యిప్పుడుకాని నీ శత్రువును శత్రువులులేరు." ఇంద్రుని చర్యలు విలాసక్రీడలు ప్రశ్న ఉ. 1 16లో మాయ యనగా మిథ్యయను నర్థముతో వాడఁబడెను శ్వే. ఉ. 4,10 భ. గీ 4,6,7; 18-61 లో ఈశ్వరునకు మాయాశక్తి కలదని వచింపఁబడెను

1) అనన్య కృత్స్నప్రసక్త జగతో బ్రహ్మకార్యత్వాత్ తదనన్యత్వాత్, (శాం।భా। 2,1,20)

2 తేనతో స్వైతోకారణసిద్ధాంతమునకు ల్పు: సర్వపరిచ్ఛిన్న వస్తువులయొద్ద యాంతర్వర్తియగు కారణ మీశ్వరుఁడన్నచో నది ద్రవ్యగుణసంబంధమగును

సముచ్చయముకాదు. బ్రహ్మ జగత్తులను వేఱుపఱచినచో, బాహ్యము నుండి మనము వానికిఁగలుపు సంబంధబంధము బలహీనముఁ గృత్రిమమునగును. బ్రహ్మ జగత్తు లొకటే, అవి సత్యము, తచ్ఛాయయునని యున్నవి. కొన్ని యుపరోధములచే నాచ్ఛాదితమైన యపరిచ్ఛిన్నవస్తువే పరిచ్ఛిన్నవస్తువు. ప్రపంచము బ్రహ్మమే; ఏలన, బ్రహ్మము తెలిఁగి నచో, జగత్సమస్యలన్నియు సమసిపోఁగలవు జగత్తు స్వయముగా యథార్థస్వరూపమని మన పరిచ్ఛిన్నమనస్సు భావించుటచే నీ సమస్య లన్నియు జనించినవి. నిర్గుణబ్రహ్మము తెలిఁగినంతనే, పరిచ్ఛిన్న రూపములు నవరోధములు నదృశ్యము లగును. సత్యస్వరూపమగు బ్రహ్మ పదార్థముకాని హేతువుచే జగత్తు మాయారూప మనఁదగును.

తర్కప్రమాణములవలన బ్రహ్మ జగత్సంబంధమును చెప్పుట దుస్సాధ్యమని శంకరుఁడు వక్కాణించినాఁడు. "సత్తున కసత్తుతో నెన్నఁడు సంబంధముండదు."[1] అవిజ్ఞాతకారణముచే నెట్లో ప్రపంచ మున్నది; దానికి బ్రహ్మతోఁగల సంబంధ మనిర్వచనీయము. అట్టి సంబంధమునుగూర్చి చేసిన నిర్వచనముల నన్నిటిని దీపికాని, వాని లోపములను శంకరుఁడు ప్రదర్శించినాఁడు. అపరిచ్ఛిన్నమగుబ్రహ్మము పరిచ్ఛిన్నజగత్తును సృజించెనన్నచోఁ బరిచ్ఛిన్నతాదోషము బ్రహ్మకును వర్తించును. బ్రహ్మ జగత్సంబంధము కార్యకారణసంబంధము కాఁజాలదు. ఏలనఁ, గాలగతమగు భిన్నదశారూపములకే కారణ కార్యసంబంధ మన్వయించును. బ్రహ్మ కారణమనియు జగత్తు కార్యమనియుఁ జెప్పరాదు, ఏలన బ్రహ్మకు జగత్తునకును భేదముచెప్పి, బ్రహ్మ నొకవస్తువుగాఁ జేసి యింకొకవస్తువుతో సంబంధముగల దానినిగా నిర్ణయించుటగును. మఱియు జగత్తు పరిచ్ఛిన్నము; అపరిచ్ఛిన్నము ననంతమునగు బ్రహ్మ మెట్లు దానికిఁగారణము కాఁగలదు? పరిచ్ఛిన్నమైన జగత్తు పరిమితము ననిత్యమునై నచో నపరిచ్ఛిన్నమైన బ్రహ్మము పరిచ్ఛిన్నజగత్తున కవధియైనయెడల నదియుఁ బరిచ్ఛిన్నమైనదే యగును. అపరిచ్ఛిన్నమగు బ్రహ్మ మెట్లుపరిచ్ఛిన్నమైనదగునో దురూహ్యము. అవ్యక్త

1) నహిసదసతో స్సంబంధః (శంకరభా. ఛాం. ౬ 2,7)

బ్రహ్మ మొక ముహూర్తమున వ్యక్తముగావలెనని నిశ్చయించునా? శంకరుఁడు గౌడపాదుని యజాతివాదమును సమర్థించినాఁడు. ప్రపంచ మదయించనేలేదు; ఉదయించినట్లు మన దృష్టిదోషముచే గోచరించును. ప్రపంచము బ్రహ్మ కనన్యము నవ్యతిరిక్తమునై యున్నది. "ఆకాశముతో కారంభమైన వ్యక్తప్రపంచము కార్యము; పరబ్రహ్మము కారణము. పరమ సత్యస్వరూపమైన యీ కారణముతోఁ గార్య మేకము, యలనఁ గార్యమునకు భిన్నమగు నస్తిత్వములేదు." [1] అది యేకత్వ భావము; లేక వ్యావహారికభాషలో నిత్యసాహచర్యము, అంతే కాని కాలాంతర సన్నివేశముకాదు, కాలాంతర్గతమైన విషయములకే క్రమమును గూర్చునది కారణశక్తి. ప్రపంచముయొక్క మూలాత్మస్వరూపమే బ్రహ్మము. ప్రపంచము బ్రహ్మమునకు వేఱై గోచరించినచో, మనకు గోచరించునది నిజస్వరూపముకాదని చెప్పవలెను. [2] పరబ్రహ్మమునకుఁ బ్రవృత్తియు నుండదు. ఏలనఁ బ్రవృత్తి పొందవలసిన లక్ష్యమో, సిద్ధియో లేకుండ నుండదు. పరమాత్మ పరిచ్ఛిన్న జగన్మూలమున వ్యక్తమగుచున్న దన్నచో, పరిచ్ఛిన్నమైన దపరిచ్ఛిన్నమైన దానిని వ్యక్తీకరింపఁజాలదని శంకరుఁడు సమాధానఁ మిచ్చును. ప్రపంచమున్నను, లేకున్నను, బ్రహ్మ మెల్లప్పుడు సూర్యునివలెఁ బ్రకాశించుచునే యున్నది. కొన్నివేళల మనము రవికిరణములను దర్శింపకున్నచో నా దోషము రవికిఁజెందదు. బ్రహ్మము స్వస్వరూపస్థితమై యెల్లప్పుడు నుండును. బ్రహ్మమునకు, బ్రహ్మయొక్క వ్యక్తరూపమునకును భేదమును జెప్పఁజాలము. రెండునొకటే. బీజవృక్షన్యాయ మిచట సరిపడదు; ఏలన నవి కాలదశలకుఁజెందిన పరిణామరీతులు. కాలప్రమాణములను కాలాతీతమగు బ్రహ్మ కారోపించుటచే మనము నిత్యమగు బ్రహ్మనొక పరిచ్ఛిన్న వస్తువుగాఁ జూచిన ట్లగును. ఈశ్వరున కాత్మవ్యక్తీకరణమునిమిత్తము సృష్టి యవసరమని యన్నచో నట్టియీశ్వరుఁ డంతర్వర్తిమాత్రుఁడే యగును. శంకరుఁడు పరిణామవాదము నంగీకరింపఁడు. ప్రపంచ

1) కార్యమాకాశాదికం బహుప్రపంచం జగత్, కారణం పరం బ్రహ్మ తస్మాత్కారణాత్పరమార్థతోఽనన్యత్వమ్ వ్యతిరేకేణాభావః కార్యస్యావగమ్యతే। (శం॥భా 2,1,14 )

2) చూ: శం॥భా 2,1,14; 2,3,30; 2,3,6.

మాఱునది బ్రహ్మయా? బ్రహ్మలో నొకభాగమా? బ్రహ్మరే
చోఁ బ్రపంచరూపమున మనయెదుటనే యుండుటచేఁ దదతిత
నత్య మెద్దియును లేదు. బ్రహ్మభాగమే లోకమైనచో బ్రహ్మ
ణ్యఁ డగును. ఏది విభాజ్యమో అది నిత్యము కాదు.[1] బ్రహ్మ
యు స్వరూపియని శ్రుతులు చెప్పుచున్నవి.[2] అందుచే బ్రహ్మ
గాఁ గాని, కొంతగాని ప్రపంచముగా మారినచో బ్రహ్మ స్వత
గోల్పోయినవాఁ డగును జగత్పరిణామమునకుఁ బూర్వము బ్రహ్మకుఁ
మునున్నచో, మన ప్రవృత్తులచే బ్రహ్మవికాసమున కభివృద్ధి
న్నచో నప్పుడు బ్రహ్మ గుణసహితుఁ డగును. కాని, బ్రహ్మయొక్క
మై పరిణామజగద్భేదము లన్నియు నందులో విలీనములై నచో
చో, జగత్తులోని ద్రవ్యగుణాదికము జీవితమున కర్థశూన్యమగును.
జగత్సంబంధమునకు, వృక్ష శాఖాసంబంధము గాని, సాగరతరంగ
ంధముగాని మృత్కుంభసంబంధము గాని, యుపమానములుగాఁ
వలనుపడదు; ఏలన నవి యన్నియు బుద్ధిపరికల్పిత ద్రవ్యగుణ
ంధములుమాత్రమే. పరమాత్మయు జీవాత్మలు, నిరవయవములే
టచే, వానిసంబంధము బాహ్యముగుసంయోగముగాని, యాంత
కమైన సమవాయముగాని కాఁజాలదు. జీవాత్మలు బ్రహ్మమందుఁ
బ్రహ్మ జీవాత్మలందుఁగాని సమవాయసంబంధమున నుండెనా? పరి
జగత్తుతో బ్రహ్మమునకు సంబంధమునుగూర్చు ప్రతియత్నమును
మును గాక తప్పదు. పరిచ్ఛిన్న జగత్తున కపరిచ్ఛిన్న బ్రహ్మముతోఁగల
ంధము మానవబుద్ధికి గ్రాహ్యముకాని పరమరహస్యమై తోఁచును.
తున కాధార మవ్యయమగు పరమాత్మయే యనియు, రెంటిసంబంధ
లో నెట్టి ఛిద్రమును లేదనియుఁ బ్రతిమతమును చెప్పును గాని నేటి
కు నా రెంటికిఁగల సంబంధమును సహేతుకముగా నెవ్వఁడు చెప్పఁ
గియుండ లేదు.[3] మనకుఁగలిగిన విజ్ఞానాభివృద్ధి సాహాయ్యమున

---

1) శంభా 2, 1, 26

2) శ్వే ఉ 6, 19; ముం ఉ 2; 1-2; బ్ర సూ భా 2, 1, 12; 3, 8, 8

3) 2, 1, 24-26 "ప్రపంచ మెట్లెందుకున్నదో, దానిపరిచ్ఛిన్నతకుఁ గారణ మేమో చూపుట దుస్తరము. అంశమాత్రమైన మానవబుద్ధికి సంపూర్ణమగుటిన యదియు

బాహ్యజగద్వ్యక్తుల స్వరూప స్వభావముల నెక్కువవివరముగాను, సూక్ష్మముగాను వర్ణింపవచ్చునుగాని, జగత్తు పరమాత్మనుండి యెట్లుద్భవించినదో మన మూహింపఁజాలము. మన హేతువాద శృంఖల మెంత దీర్ఘమైనదైనను గావచ్చును, దానిలోని లింకులసంఖ్యయుఁ బెరుఁగ వచ్చును, గాని, మన మొక ఘట్టము చేరునప్పటి కాగిపోయి, యింక ముందుకుఁ బోఁజాలనిస్థితి సంభవించును. మాయాశబ్దము మన పరిచ్ఛిన్నతను, మన జ్ఞానములో నొక ఛిద్రమును వ్యక్తీకరించును. మాయావి తన యింద్రజాలశక్తిచే నొకవృక్షమును శూన్యమునుండి సృజించును. వృక్ష మెట్టయెదుటనున్నమాట నిజము, అదియెట్లు కలిగినదో మనకుఁ దెలియదు గావున దానిని మాయ యందుము. ఈ జగత్సమస్య కుదాహరణముగా నిటీవల వటీకాపార్థములకు గుఱియైన రజ్జు సర్పభ్రాంతిని శంకరుఁడు ప్రకటించినాఁడు. రజ్జుసమస్యయే జగత్సమస్య. రజ్జువేల సర్పముగా గోచరించునను ప్రశ్న బాలురడుగ వచ్చునుగాని దానికిఁ దత్త్వవేత్తలును సమాధానము చెప్పఁజాలరు. బ్రహ్మ జగద్రూపమున గోచరింపు సమస్య యింతను కఠినతరమైనది. రజ్జువు సర్పముగా గోచరించునట్లే, బ్రహ్మముజగత్తుగా గోచరించునని మాత్రమే మనము చెప్పఁగలము.[1] ఈశ్వర పరబ్రహ్మ సంబంధసమస్య, జగద్బ్రహ్మ సంబంధసమస్యయొక్క విశిష్టమైనరూపమే.

---

విదితమైనదగును," "పరిచ్ఛిన్నజీవకేంద్రములలోఁ బరిచ్ఛిన్నరూపములఁగూర్చి యిది యది యను సమభవమున్నది" "జగత్త్వెట్లు మేలయున్నదో మన మెఱుఁగఁజాలము," (అప్పియరన్సు అండ్ రియాలిటి పుట 204, 226, 413 ) గ్రీన్ వంటివారునునరించి, కాలాతీతము పరిపూర్ణమునగు నిత్యమైన తత్త్వమొకటి యున్నదనియు, మిగిలిన చేతన రూపము లన్నియుఁ గాలవశములు, నసంపూర్ణములు, ననియుఁ జెప్పవచ్చును రెంటికిఁ గల సంబంధము దురూహ్యమని గ్రీన్ అంగీకరించెను, ఒక పరిపూర్ణమై తత్త్వమేల నానా చేతనాత్మకులను సృష్టించవలెనను ప్రశ్న పరిపూర్ణమై తత్త్వమెట్లుండవలెనని ప్రశ్నించుచేయుగును బోలును. స్కల్లర్: జగదుత్పత్తిసమస్య పూర్తిగా నయుక్తమైనది. ఏలన నిందడుగరాని ప్రశ్నయె మడుగఁబడినది, సత్యమేల యట్లున్నదని దీని తాత్పర్యమై యున్నది. ఇది భౌతికతత్త్వశాస్త్రమును బరిష్కరింపఁగలదనియుఁ గాదు. పరిష్కరింప నవసరమును లేదు " (స్టడీస్ ఇన్ హ్యూమనిజం)

1) మాయామాత్రం హ్యేతద్ యత్పరమాత్మనో௨వస్థాత్రయాత్మనావభాసనం రజ్జ్వా ఇవ సర్పాదిభావేన (శాం॥భా॥ 2,1,9)

జగత్తు బ్రహ్మపై నాధారపడినను, బ్రహ్మకీ సంబంధముచే దోషమువట్టదని చూపుటకై శంకరుఁడు కారణమునకుఁ బరిణామోపాదానత్వమును గాక వివర్తోపాదానత్వమును గల్పించెను వివర్తమనఁగా దలక్రిందగుట. దేశకాలాద్యవచ్ఛిన్నమగు జగత్తు బ్రహ్మయొక్క వివర్తరూపము. మూలద్రవ్యము పరబ్రహ్మము, దేశకాలస్థమగు రూపములో బ్రహ్మయొక్క రూపాంతరమే జగత్తు, రూపాంతరము మనకొఱకై కల్పితము గావున బ్రహ్మకు దానిపై నాధారపడవలసిన యవసరములేదు. అనేకత్వరూపమగు ప్రపంచముయొక్క దృశ్యమును పరమాత్మ మనకుఁ బ్రదర్శించునదేకాని యది పరమాత్మ స్వస్వరూపము గాదు. పాలు పెరుఁగుగా మాఱినపుడు పరిణామము; త్రాడు పాముగా గోచరించుట వివర్తమగును.[1] రజ్జుసర్పము, శుక్తిరజతము, మరుమరీచిక, మున్నగు శంకరుఁడుపయోగించిన యుపమానములన్నియుఁ గార్యము కారణముపై నాధారపడునేకాని, కారణమగు బ్రహ్మ కార్యమగు జగత్తుపై నాధారపడదని సూచించు నిమిత్తమే. పరిణామమందుఁ గార్యకారణములు లౌకికవాస్తవిక క్రమమునకుఁ జెందినవి, వివర్తములోఁ గార్యము కారణభిన్నమైన క్రమమునకుఁ జెందినదై, సర్పము రజ్జువందువలె బ్రహ్మమందు నివసించును.[2]

మాయాసిద్ధాంతమును అద్వైతగ్రంథములం దర్థాంతరమునఁ లొసఁగఁబడినవి.[3] బ్రహ్మ మేకమేగావున మాయ బ్రహ్మభిన్నము కాఁజాలదు, బ్రహ్మ మదివఱకే పరిపూర్ణతగలదికావున, దానికి మాతనముగా నేదియుఁ జేర్పనవసరములేనందున, జగము బ్రహ్మేతరమైన యేకారణమువలనను గలిగియుండలేదు. అందుచే జగమసత్యము కానోపును. జగత్పరిణామము బ్రహ్మములోని పరమార్థ క్రమక్షీణతవలన

1) శాం॥భా॥ 2,1,28

2) పరిణామోనామ ఉపాదానసమసత్తాక కార్యాపత్తిః వివర్తోనామ ఉపాదానవిషమసత్తాక కార్యాపత్తిః॥ (వేదాంతపరిభాష 1,)

3) శాం॥భా॥ తై॥ఉ॥ 2,6 " నాసద్రూపా నసద్రూపామాయా నైవోభయాత్మికా సదసద్భ్యాం అనిర్వాచ్యామిథ్యాభూతా సనాతనీ॥ (సూర్యపురాణం 1,3,19,) "

వేయని చెప్పఁ బడెను. మాయ యనఁగా నొక విభాగించుశక్తి. పరిచ్ఛిన్నత నుద్భవింపఁజేయు నియతి, దురూహ్యమగు దానినూహించి, రూపరహితమగుదానికి రూపకల్పనముచేయుమాత్రమని నిర్వచింపఁ బడెను.[1] మాయ పరమాత్మయొక్కలక్షణమేకాని పరమాత్మయుఁగాదు. తద్ధర్మముముగాదు. మాయ కొకప్రత్యేకస్థాన మిచ్చుట, ద్వైతము నంగీకరించుటే యగును. మన కింద్రియగోచర ప్రపంచములోని ఛిద్రము నింద్రియాతీతవస్తువు కారోపించుట యుక్తముకానేరదు. మాయకు బ్రహ్మసంబంధమును గల్పించినచో నీశ్వరుఁ డగును. మాయ యీశ్వర శక్తియగును. కాని యీశ్వరుఁడు స్వీయమాయాపహతుఁడు కాఁడు. మాయ కస్తిత్వమున్నచో నది బ్రహ్మకుఁ బరిచ్ఛిన్నత నేర్పఱచును, మాయ లేకున్నచో, జగద్దృశ్యము కారణహీన మగును. జగత్తు సద యింపఁజేసినంతవఱకు మాయ నిజమైనదే, బ్రహ్మకుఁ బరిచ్ఛిన్నతఁ గల్పించుటలోమాత్రమది యథార్థముకాదు. 'బ్రహ్మవలె నది నిజముకు గాదు, గగనకుసుమమువలె నసత్యముముగాదు.[2] దాని మన మెట్లు పేర్కొన్నను, జగత్కారణత్వమున కది యవసరము. అది యీశ్వరుని నిత్యశక్తి. మాయాసాహాయ్యమున, బ్రహ్మ జగత్తున కుపాదానకారణ మనియు, మాయ యనగాఁ బ్రవృత్తిహేతువనియు సంక్షేపశారీరిక గ్రంథ కర్త చెప్పినాఁడు కాని, యది బ్రహ్మయొక్క లక్షణముగా నొక ప్రవృత్తి రూపముగా స్వీకరింపఁబడెను. అది ప్రపంచానుగతమైన కార్యశక్తా నియామకశక్తియని చెప్పఁబడెను. మాయయొక ద్రవ్యముగాదు, అందుచే నది జగదుపాదానకారణము కాఁజాలదు, అది బ్రహ్మయొక్క ప్రవృత్తిరూపమై, ప్రపంచహేతు వగుచున్నది.[3] ఈ గ్రంథకర్త ననుస రించి, సత్యమును గప్పిపుచ్చు నావరణశక్తియు దాని కసార్థమును గల్పించు విక్షేపశక్తినిగలిగిన బ్రహ్మయొక్క పరిచ్ఛిన్నతను గల్పించు

1) ఏకఏవ పరమేశ్వరః కూటస్థో నిత్యోవిజ్ఞాన ధాతురవిద్యయా, మ యయా, మాయావివశ్ అనేకధా విభావ్యతే నాऽన్యోవిజ్ఞాన ధాతురస్తి (శంకరా। ప్రవచనభాష్యము 1, 3,19)

2) శంకరా। 1,3,3

3) అజ్ఞానమత్వేనసతి, అజ్ఞానజనకోవ్యాపారః।

శక్తియని చెప్పఁబడెను.[1] మొదటిది జ్ఞానలోపమాత్రమగుచుండఁగా, రెండవది విపర్యయ హేతువగుచున్నది. మనము సత్యమును దర్శింపక పోవుటేకాక, దాని స్థానమున వేఱొకటి చూతుము. మాయ నామరూప నానాత్వ కారణము, నామరూపసముచ్చయరూపమే జగత్తు. నామరూప సముచ్చయముచే నీమాయ బ్రహ్మము నాచ్ఛాదించును.

సత్యము కప్పిపుచ్చి, యసత్యమును బ్రదర్శించు నీ రెండును మాయాలక్షణములు. అనేకత్వముతోఁ గూడిన, ప్రపంచము సత్యము నాచ్ఛాదించుచున్నది.

"దేవునిఁజూపుటకొఱకే సృష్టియున్నదని కొందరు చెప్పెదురు. తనశక్తి కొలఁది నీశ్వరుని మఱుగుపఱచుటకు సృష్టి యని నేను నిర్ణయింతును."[2]

ఈరీతిగా మాయ మోహగించు లక్షణము[3] గలది కావున నవిద్య యని చెప్పఁబడెను. ఇది కేవల మజ్ఞానమేకాదు, దుర్జ్ఞానము. ఈ లక్షణమును బ్రహ్మ కారోపించినచో నీశ్వరుఁ డగును, "అచలము శుద్ధము నగు నేకబ్రహ్మము, తన మాయాశక్తిచే సృష్టికర్త యయ్యెను."[4]

అవ్యక్తరూపమునను్న ప్రపంచమును వ్యక్తమొనర్చు స్వగత మైన యీశ్వరునిశక్తియే మాయ. దురూహ్యమైన మాయ కామసంకల్ప రూపద్వయమును దాల్చును. అది నిత్యుఁడగునీశ్వరుని సృజనాత్మక శక్తి గావున నిత్యమైనది. దీని సాహాయ్యమున నీశ్వరుఁడు జగత్తును సృజించును. మాయకు వేఱుగా నివాసస్థానము లేదు. అగ్నియం దుష్ణతవలె నది యీశ్వరునం దున్నది. దాని కార్యమువలన దాని

---

1) చూ: వేదాంతసారము 4.

2) బ్రౌనింగ్, బిషప్ బ్లోగ్రామ్స్ ఎపాలజి

3) మాయకు పంచవార్తికములోఁగూడు మిలంద 4,8,1,3

4) అప్రాణం శుద్ధమేకం సమభవదథసవ్యక్తయయాశక్త్యా సంజ్ఞం (శతశ్లోకి 24) రోతు; సంతది, 10, 1।

స్థిత్వ మనుమితము [1] మాయ యనఁగా నామస్వరూపనముచ్చ
ని. నామరూపము లవ్యక్తరూపమున నీశ్వరునిలోనుండివ్యక్త
_ ప్రపంచనిర్మాణ హేతువు లగుచున్నవి. ఈ యర్థములో మాయ
(గాఁ ప్రకృతి [2] నిర్గుణబ్రహ్మకంటె నీశ్వరునికి సత్తా తక్కువ,
విషయము లన్నియు నింతకు దక్కువ సత్తాగలవి. క్రమముగా
పోవ క్రమములో కట్టయడుగున నున్న వస్తువునకు సత్తాశూన్యమై,
! శూన్యకుడ్యమువలె గోచరించును. సృష్టికాలమునందుఁ బర
రుఁడు గుణరూపహీనము అగువానికిఁ దనలో నవ్యక్తములుగా
, గుణరూపముల ననుసంధించును. "ఈ యవ్యక్త ప్రకృతియే
వేశల నాకాశమనియు, [3] నక్షరమనియు, [4] మాయ, [5] యనియుఁ
నఁబడెను. మాయ శక్తిశాధారము. [6] అది యనేక వికారములను
) ప్రకృతిక్రమము నుదయింపఁజేయును. అది యీశ్వరుని
శరీరము, సాంఖ్యుల ప్రధానము వలెఁగాక, యిది దేవుని పై
రపడును. [7] అది యీశ్వరుఁడు తనపైఁ గల్పించుకొనిన పరిచ్ఛిన్న
పము. బీజమునందు శాని వృక్షరూప మిమిడియున్న రీతిగానే,
తియందు జగద్రూపమంతయు నిమిడియున్నది. ఈ త్రిగుణాత్మక
ప్రకృతి [8] యీశ్వరాత్మయనిగాని, తద్భిన్నమనికాని చెప్పఁ

---

1) నిస్తత్త్వాకార్యగమ్యాస్య శక్తిర్మాయాగ్ని శక్తివత్ ॥(పంచదశి)

2) చూడు : ఈశ్వరస్య మాయాశక్తిః ప్రకృతిః (శాం।భా 2,1, 14) చూ।
ఉ।4-10 శాం।గీ।భా। ఉపోద్ఘాతము 3,8, సాంఖ్య ప్రవచనభాష్యము, 1,26.

3) బృ।ఆ।ఉ। 78,11,

4) ముండ ఉ। 2,1,2

5) శ్వే।ఉ। 4,1. చూ। శాం।భా।1,4,3. "అవిద్యాత్మికాహి సా బీజశక్తి రవ్యక్త
శ్య, తదేత దవ్యక్తం క్వచి దాకాశశబ్ద నిర్దిష్టం క్వచిదక్షర శబ్దోదితం క్వచి న్మా
యోదితం "అవ్యక్తనామ్నీ పరమేశశక్తి రనాద్యవిద్యాత్రిగుణాత్మికా పరాకార్యా
నుమేయైవ మాయామయా జగత్సర్వమిదం ప్రసూయతే।

6) చూడు : పెటీరియాస్పైరిమా, శామిష్ట ఫిలాసఫి (వివేకచూడామణి శ్లో 108)

7) న వస్తుతంత్రం తత్త్వం। (శాం।భా, 1, 2, 22)

8) పంచభూతములు

ఛా. 6—6

జాలను. అది ప్రళయవేళఁగూడ బీజశక్తి రూపమున నీశ్వరు దుండును. మాయ లేక ప్రకృతి, పురాణములలో, నీశ్వరునిప్రేఁ రాలై సృష్టిక్రియలోఁ బ్రధానసాధన మగును. [1]మాయాప్రపంచః జగదీశ్వరి యనంతరూపములఁ బొందుటకై పల్కులిల. [2] అంద నీశ్వరుఁడు లేక విషయిక విషయముతో నిత్య సంపర్కముండుట ప్రపంచ మనివార్యావసరము. ఈశ్వరునికిఁ బ్రపంచ మవసర ముయున్నది, ఏలన హెగెల్‌మాటలలో లోకము పరమేశ్వరు నాత్మ కవసరము.

అద్వైతతత్త్వమున మాయాశబ్దమున కీయఁబడిన భిన్నార్థవ నిచటఁ బొందుపఱచవచ్చును. (1) ప్రపంచము సహేతుక స్థిత్వము లే గావున, నది మిథ్యాస్వరూపమగుటచే మాయయని చెప్పఁబడెను. తార్కికదృక్పథమునుండి పరికించు మనకు జగద్బ్రహ్మసంబంధ ః పంతమైనది, ఏలన మనము శుద్ధ బ్రహ్మస్వరూపము ననుభవదృక ములో నంగీకరింతుము. కాని పరస్పరవిరుద్ధములైన పరబ్రహ్మఁ ననేకత్వరూపమైన ప్రపంచము నెట్లుసంబంధించియున్నవో ః చెప్పఁడు తెలియుట కవకాశములేదు. ఇట్టి మన జ్ఞానదౌర్భాగ్యము మాయ యని పేరు. (3) బ్రహ్మయే జగత్కారణమన్నచో దానిఁ మేమఱఁగా జగత్తుబ్రహ్మపై నాధారపడియున్నదనియు నట్టి యాధ ముచే బ్రహ్మ కెట్టిలోపము సంభవింపదనియు నిట్టి బ్రహ్మాధారము జగద్రూపమే మాయ యనియుఁ జెప్పఁబడెను. (4) బ్రహ్మయే ద్రూపమున గోచరించునని చూపుటకుఁ జెప్పిన హేతువే మాయ య బడెను. (5) మనము వ్యావహారికదృక్పథము ననుసరించి, తర్క తుల నుపయోగించినచో నాత్మవ్యక్తీకరణ సమర్థుఁడు పరిపూర్ణుఁడ న

---

1) చూడుము: శ్వేతాశ్వ 1, 4, 3

2) చూడుము: తమసి పరబ్రహ్మ మహిషి (ఆనందలహరి) తమస్సంగాను చెప్పఁబడెను సత్త్వమునుండి పంచజ్ఞానేంద్రియములు, అంతఃకరణము నుదయించె రజస్సునుండి పంచకర్మేంద్రియములు, వీని మిశ్రమమువలనఁ బంచప్రాణమ ముద్భవించెను. ఇవి కలిసి సూక్ష్మశరీర మగును

వ్వరుని వ్యక్తిత్వము లభించును. ఇట్టి యీశ్వరు నాత్మవ్యక్తీకరణ శ్రియే మాయ యనఁబడెను. (8) ఇట్టి యీశ్వరునిశక్తి ఉపాధిగామారి వ్యకృతప్రకృతియై ప్రపంచకారణ మగును. ఇదియే యీశ్వరుని యము, దీనినుండి జగత్తు నీశ్వరుఁడు కల్పించును.[1]

## 51 అవిద్య

మాయాభావ మవిద్యాభావముతో సన్నిహితసంబంధమును గలిగి యున్నది. బాహ్యప్రపంచ మవిద్యాకల్పితమను నర్థమిచ్చు వాక్య ము శంకరుని రచనలలోఁ గలవు. జగద్దృశ్యమునకుఁగారణము నవ బుద్ధిస్వభావములో నున్నదికాని బ్రహ్మయందు లేదు. అల్పతర వ్వపువందుఁగూడ, నఖిలక్త బ్రహ్మము సంపూర్ణముగానున్నది; తత్వదర్శనమునకుఁ గారణము దేశకాలనిమిత్త ధర్మముల నను ది పనిచేయుబుద్ధియే. తన బ్రహ్మసూత్ర భాష్యమున కుపోద్ఘాత లో నవిద్యాశక్తియే మనల సంసారప్రవాహమునఁ ద్రోయుచున్న శంకరుఁడు రచించినాఁడు. వ్యావహారిక పారమార్థిక దృక్పథము నొకదాని నింకొకటిగాఁ బొరపడుట, అనగా నధ్యాస, యెంతదోష తమైనను మానవ మానసమునకు సహజమైనది. అది మన జ్ఞానేం ము నిర్మాణములోనిలోపమే.[2] నిజముగాఁ గొన్ని తేజస్స్పందన లే మన యింద్రియములకు శబ్దములుగాను ధ్వనులుగాను గోచరించు , నిజముగా బ్రహ్మమేయైనను, దాని కార్యరూపమైన నానావస్తు పంచముగాఁ జూచి యంగీకరించుచున్నాము. మన మెంతకాల ద్యావశులమై, తర్కప్రమాణములను విశ్వసింతుమో యంతకాలము ము మన యనుభవములో విషయిలక్షణ పరిశీలనముచేఁ బరమార్థ మును బొందఁజాలము. అనుభవజ్ఞాన సిద్ధినుండి వచనమే అవిద్య;

---

1) చోద్యః ఈశ్వర స్యాత్మభూతే ఇవావిద్యా,కల్పితే నామరూపే తత్త్వాన్యత్వా ం, అనిర్వచనీయే సంసారప్రపంచ బీజభూతే ..ఈశ్వరస్య మాయాశక్తిః ప్రకృతిరిత శ్రుతిస్మృత్యోరభి లప్యేతే (శం,భా 2,1,14) శం,భా 1,4,3,2,2,2

2) శంభాష్య ఉపోద్ఘాతము

ఏకము నద్వితీయమునగు బ్రహ్మపదార్థము ననేకముగా విచ్ఛేదిం
పరిచ్ఛిన్నాత్మయొక్క మానసికలోప మవిద్య. చీఁకటి వెలుతురుయొక
కృతావస్థయే. డ్యూసెన్ చెప్పినరీతిగా నవిద్య "మన జ్ఞానముయొక
జన్మసిద్ధమైన కాంతివిహీనతయే" [1] దేశకాలనిమిత్త నిర్మాణమునఁగ
వస్తువులను యథాస్థితిలోఁ జూడఁజాలని మనస్సుయొక్క వక్రతయేఅవిద
అది యెఱింగిన వక్రదృష్టికాదు, వ్యావహారిక ప్రపంచముయొక్క ఆ
మగ్రప్రమాణముల ననుసరించు పరిచ్ఛిన్న మానవముయొక్క నైజసం
స్కారము. అది మన దైనజీవితమును మఱుగుపఱచు నొక యథాభావాత్మ
మగు శక్తిస్వరూపము మన యింద్రియ దోషముచే రజ్జువు సర్పముగా
నెట్లుగోచరించునో, యట్లే మన యవిద్యచే బ్రహ్మమే జగద్రూపము
గనపట్టుచున్నది. రజ్జువును రజ్జువుగాఁ జూచినవెంటనే, సర్పదృ
మంతరించిపోవును. బ్రహ్మస్వరూపదర్శనముతో జగద్రూప మంతరిం
చిపోవును. ఏది తదతీతమైన యనుభవమువలన సత్యమని నిరూపిం
పబడునో, యది, మన యవివేకమువలనఁ గాకున్నదో, సత్యము
సంబంధమును బొందఁజాలదు. పరబ్రహ్మమందు రూపకల్పము
మనము చేయుచున్నాము. సర్పదృశ్యమును, రజ్జువాస్తవికతను స
వ్యయి పనున్నచో, లేనిదానికున్నదానితో సంబంధము సాధ్యముకాఁ
మనము చెప్పుదుము. సర్పము గోచరించుటకు నేత్రమే దూష్యవ
త్రాడును త్రాడుగాఁ జూచినచో సమస్య సమసిపోవును; అప్పు
త్రాడే పాముగాఁ గనపట్టినదని చెప్పుదుము. బాహ్యప్రపంచదృశ్య
నకు దృష్టిదోషముతప్ప వేఱుకారణము లేదు. చైతన్యము సత్య
యుండఁగా, దాని దానిస్థానమున వస్తువులను దర్శింపఁజేయుట
యీ దృష్టిదోషము చేయఁగలదని, అవిద్యయనఁగా జ్ఞానలోపముగా
సంశయజ్ఞానముకాని, దోషపూరితజ్ఞానముగాని కానవచ్చును. అది కే
వలభావాత్మకమేకాక, భావాత్మకముగూడ నైయున్నది. అవిద్యాస్తి
త్వం దరిజేఁగినదేయని శంకరుఁడు చెప్పినదాని కర్థమేమనఁగాఁ బరి
చ్ఛిన్నత సర్వసామాన్యమనియే. తనకు సర్వవిషయములనుగూర్చియ

1) డ్యూసెన్ సిస్టమ్ ఆఫ్ వేదాంత పు 30 2

లియదని ప్రతివ్యక్తియు నంగీకరించును.[1] ఈ లోపము నందరు ర్తించియుండుటచే సర్వసామాన్యవిదితాంశమని చెప్పవచ్చును.

ఒక వ్యక్తికిఁగల జ్ఞానమునకు భిన్నమైన అజ్ఞానమే ఉపనిష లుచెప్పిన అవిద్యయైయున్నది.[2] శంకరుని రచనల ననుసరించి, గానమానసముయొక్క పరిచ్ఛిన్నతను సూచించు తర్కపద్ధతియే విద్య. అది వంధ్యాపుత్రునివలె నభావవస్తువు కాదు, ఏలన నది స్వజనముల అనుభవసిద్ధమైనది. సుజ్ఞానముచే నది నశించునుగావున, ని పరిపూర్ణము యథార్థమునైన భావవస్తువును గాదు. అది యసత్తై చో దీని నుత్పత్తిచేయఁజాలదు, అది సద్రూపమైనచో దానినుండి ముద్భవించినదియు నిజమే కావలెను. గాని మిథ్యామాత్రము కారాదు. అవిద్య యథార్థమునుగాదు, మిథ్యయునుగాదు, రెండునుగాదు.[3] దీని జన్మము, కారణము మనకుఁ దెలియనిదైనను, నది ప్రవర్తించు ను ప్రమాణరూపములచే సువిదితము. అజ్ఞాన పాప దుఃఖహేతువైన యా యవిద్య యెచటనుండివచ్చినది? అవిద్య వ్యక్తిత్వకారణము దు; ఏలన వ్యక్తులులేనిదే అది యుండఁజాలదు. అది వ్యక్తిత్వ రణమేయైనచో నది వ్యక్తుల అస్తిత్వముతో నిమిత్తము లేకుండనుండు ది యనగా బ్రహ్మకుఁజెందునది కావలెను కాని యవిద్య బ్రహ్మకుఁ ంద దేలన, బ్రహ్మ దీనికి వ్యతిరేకమగు నిత్యజ్ఞానశీలస్వరూపి.[4] సర్వ జ్ఞత్వమును తలఁచినరీతిగా నది బ్రహ్మయందుండఁజాలదు; వాచస్పతి చెప్పినట్లది వ్యక్తియందుండఁజాలదు.[5] బ్రహ్మయొక్క వికార గావమే అవిద్యాస్థానమనుట నిరర్థక మేలన, బ్రహ్మ వికారమందుట విద్యతప్ప కారణాంతరములేదు. ప్రతిజీవి కొక భిన్నమగు నవిద్యను న మూహింపవలెనని రామానుజుఁడుపలికెను, లేకున్నచో నొక జీవికి

1) అహం అజ్ఞ ఇత్యాద్యనుభవాత్, చూ॥ వేదాంతసారము పు 4
2) చూ॥ ఛాం॥ ఉ 1,1,10; బృ॥ఆ॥ఉ॥ 4,3,20,4,4,3,
3) వివేకచూడామణి పు॥ 3.
4) "దేవుఁడు జ్యోతిః అందుఁ జీఁకటియే లేదు" (1 యో॥5)
5) చూ॥ శ్రీధరుని న్యాయకందలి, రామానుజభాష్యము 2,1,15,

మోక్షసిద్ధితో జన్మిజీవులు ముక్తిఁబొందవలెను. అందుచే నవిద్య జీవపక్ష ములు కనుగుణమైయుండును గావునను, దానికది కారణముకాదు కా నను, నది దుర్బోధము   అటట మనకు శాఖాచంక్రమణవాద మేర్ప డదు.[1]  అవిద్యారూప మనిర్వచనీయమని చెప్పి శంకరుఁడీవాదమ ునుండి తొలఁగినాడు.  శంకరుని తత్త్వములో ప్రశ్నకర్థము లే వ్యావహారికప్రమాణము పారమార్థికముగా నిష్ప్రయోజనము. అవి

1) రామానుజభాష్యము 2,11,5; పా. ప్ర. మా. 1, 21, 24 5,13,19,
పార్థసారథిమిశ్రుఁడిట్లాక్షేపించినాఁడు, 'అవిద్యయనఁగా నపార్థజ్ఞానమా? లేక దాని గారణమైన దేదైన నింకొకటి యున్నదా? మొదటిదైనచో నీ యవిద్య యెవని అది శుద్ధచిత్స్వరూపియగు బ్రహ్మదికాదు   దనిలింబములో వంధకారముండదు జీవాత్మలదికాదు; ఏలన జీవాత్మలు బ్రహ్మభిన్నములుకావు   అవిద్యయుండుట కాశమువేదు; దానికి కారణమైన దింకొకటియుననేదు; మఱియు నవిద్యయు దానికా మును బ్రహ్మకరమైన యా శ్రయముగలదన్నచో బ్రహ్మయొక్కయేకత్వమంతరించు బ్రహ్మయొక్క అవిద్యయెటులుండిరచ్చినది? బ్రహ్మమొక్కటే నత్యస్వరూపమనుగా వేఱొద్దియునులేదు   అవిద్య బ్రహ్మస్వభావమన్నచో బ్రహ్మకు విద్యయే స్వభావమై కూడ నెట్లగును? కిం భ్రాంతిజ్ఞానం? కిం వా భ్రాంతి జ్ఞానకారణభూతం వస్త్వంత యది భ్రాంతి స్యా త్తస్య నబ్రహ్మణ స్తస్య స్వయంప్రకాశవిద్యారూపత్వాత్, న హి భాస్కరే రసాన్ధకారో నంభవతి; న జీవానాం, తేషాం బ్రహ్మతిరేకేణాభావాత్, భ్రాంత్యభావా దే భ్రాంతిజ్ఞానం తత్కారణంచ అభ్యుపగచ్ఛతా మద్వైతహానిః కింకర్తా చ బ్రహ్మణో భవే నహితాకారణాంతర మస్తి, స్వాభావికీతి చేత్, కథం విద్యా స్వభావః అవిద్యావస్తు స్యాత్? (శాస్త్రదీపిక పు. 34 కే.314,113)

అద్వైతమును ఖండించుచుఁ గుమారిలుఁడిట్లు వాదించెను 'బ్రహ్మనిత్యశుద్ధ శుద్ధుఁడైనచో, బ్రహ్మకు వేత్తవదేదియు లేను   పెన్నన్నదన్యత్వమైన యా యవి ప్రవృత్తికిఁ గారణమేమి? అవిద్య బ్రహ్మకు భిన్నమన్నను, దాని కింకొక కారణ వ దన్నను నద్వైతము నశించును  అది బ్రహ్మస్వరూపమే యైనచో నదియున్నఁయనిశించ

"స్వయంచ శుద్ధరూపత్వాత్ అసత్వాచ్చాన్య వస్తునః
స్వప్నాదివ దవిద్యాయాః ప్రవృత్తి స్తస్య కింకృతా
అన్యేనోపప్లవేఽపి స్యాద్ద్వైతవాద ప్రవణ్యతే
స్వాభావిక మవిద్యాంతు నోచ్ఛేత్తుం కించి దర్హతి
(శ్లో. వా. సంబంధాక్షేపపరిహారము, పు. 84,75)

యున్నదని మన మెఱుంగుదుము, జీవసృష్టి ఎట్లు జరిగినదో యను ప్రశ్నవలెనే, అవిద్య ఎట్లుదయించినదను ప్రశ్న కవకాశములేదు. ఆత్మకు నవిద్యకుఁగల సంబంధమును మనమెఱుఁగఁగల్గినచో మనమా రెంటికి నతీతులముగావలెను.[1] అవిద్యయే ఆత్మకు ముఖ్యలక్షణమైనచో నాత్మకు విద్యనుండి విముక్తి యెన్నఁడు నుండదు. కాని యాత్మ దనిర్వచనలోఁ జిక్కుకొనుటఁ గాని, తనలో నేమాత్రమునైన విడిచి పుచ్చుటగాని చేయునది కాదు. అవిద్య యే పరిచ్ఛిన్నవ్యక్తికిని, మానవుఁడైనను నీశ్వరుఁడైనను, హానికిఁ జెందదు, ఏలన, వష్టివ్యక్తి కవిద్య చెందుట కాతఁడు మొదట సృజింపఁబడవలెను కావున నాతని సృష్టికిఁ గారణ మాతనియొక్కగాని; మఱియెవ్వనియొక్కగాని యవిద్య కాఁజాలదు. బ్రహ్మ సగుణత్వమొందుటకాని, జీవులయుత్పత్తి గాని, పరిచ్ఛిన్న జీవితలక్షణమగు నవిద్యవలన జరిగినదికాదు. ఈశ్వరప్రవృత్తి వలన జరుగు సంఘటనమే అవిద్య. కాని అవిద్యయు బ్రహ్మము నేక కాలమున నుండఁగలవను సమస్యయే తీర్పరానిది. శంకరుఁడిట్లు చెప్పి నాఁడు: "బ్రహ్మ మవిద్యాసంజాతము కాదనియు, బ్రహ్మకవిద్య లేదనియు మన మంగీకరింతుము, అవిద్యావశమై బ్రహ్మేతరమైన యింకొక వ్యక్తియుండి తత్కారకుఁ డగుననియు మన మంగీకరింపఁ జాలము."[2] సంక్షేపశారీరకము ననుసరించి, "నిర్విభాగచిత్స్వరూపమే అవిద్యకాశ్రయము విషయమునై యున్నది."[3] వ్యాసు నిట్లు చెప్పి నాఁడు: "యథార్థముగా బ్రహ్మేతరమైనదేదియు లేదు, ప్రపంచ రూపమున బ్రహ్మ వికారమును, బహుజీవభిన్నత్వరూపమైన బ్రహ్మ యందు భేదమును మనము చూచుట కవిద్యయేకారణము. కాని యిది యెట్లు జరుగుచున్నది? బ్రహ్మ మేకము నద్వితీయమునై యుండఁగా

1) శం, గీ, భా, 13,2

2) శం, భా, బ్ర, సూ, 1,4,10 తన యద్వైతమకరందములో లక్ష్మీధరుఁడిట్లు చెప్పినాఁడు: 'నేను ప్రకాశించుటలేదను మాటకుఁ గారణభూతమైన స్వయంజ్యోతి రూపముగల ఆత్మ నవిద్య యెట్లంటఁగలదు? కాని చీకాకైనను నవిద్యాహేతు వెంత స్పష్టము: జ్ఞానమూర్త్యఁ దుదయించునట్లు నదియుండును ,, (16 17)

3) 1,319: ఆశ్రయత్వవిషయత్వభాగినీ నిర్విభాగచితిరేవకేవలా

వికారమును తాదాత్మ్యమును మనము చూచుచు పోవనున్న తె, పొల్పుచున్నాము: ఈ ప్రశ్నకు మన గ్రంథకర్తలు సమాధానమిచ్చి యుండలేదు.[1] వారు సమాధాన మీయకపోవుట నిజమేకాని కారణ సమాధానము లేకపోవుటయే. కాని, విమర్శకు లూరకుండరు; వారి బదులు చెప్పుదురు. "సర్వము విజ్ఞానాతీతమనిచెప్పి నీతత్త్వముల హేతువైపరీత్య మాక్షేపణీయముకాదు."[2] ఇది నిజమే. బ్రహ్మవే మనద్వితీయము శుద్ధము, పరిపూర్ణమునయ్యు విపరీతభావముల న యింపఁజేసి దిగ్భ్రాంతికల్పించు నీ యవిద్యాశక్తి యెచటనుండివచ్చె నదో తెలియదు.[3]

## 32—ప్రపంచము మిథ్యయా

ప్రపంచము మిథ్యయనియు, కేవలము మనఃకల్పితమనియు నొ దురభిప్రాయ మీ యవిద్యా సిద్ధాంతమువలన నుదయించినది. స దృశ్యములు, నీశ్వరుఁడును గూడ నవిద్యారూపములేయని శంకరుఁ

---

1) ద్యూసెన్‌సిస్టం ఆఫ్ వేదాంత పు 302

2) పార్థసారథిమిశ్రుఁడు: 'అనిర్వచనీయవాదినాం మతనిరూపణమ్.'

3) సంక్షేపశారీరక, వివరణ వేదాంతముక్తావళి, అద్వైతసిద్ధి, అద్వైతవాద గ్రంథకర్తలు, టీకలు గ్రహములోనుండి గ్రహముల మాఱుగుపడుచుండ్లె. అవిద్య బ్రహ్మమే ఆశ్రయము, విషయమునని తలఁచిరి అవిద్యకు జీవుఁడాశ్రయమనియు, బ్రహ్మ విషయమనియు వాచస్పతి భావించెను ఈశ్వరుఁడుగూడ జీవాజ్ఞానసంజాతుఁడేయని జీవు లెందరో ఈశ్వరు లందరుందురనియు నీతని మతము మఱియు సర్వజ్ఞా యత్వము చెప్పఁబడెను: జీవు లవిద్యపైనను, నవిద్య జీవులపైనను నాధారపడు అందు నవిద్యకు స్థానము బ్రహ్మమందే యున్నదని చెప్పఁబడెను. ఇది యద్వైతసి ద్ధముగాపున, ఏ విషయమును విద్యారణ్యనోరంబీగ్రంథకర్త చర్చించి, శుద్ధచైతన్య జీవాత్మ బ్రహ్మము ద్వైతమగుననియు, అవిద్య నిజముగా నున్నచో నది బ్రహ్మమ యుండవలెననియుఁ జెప్పెను ఈ పండిట్, సెప్టెంబరు 1872 శుద్ధాద్వైతము విని విరోధముకాదు, అవిద్య వృత్తిచైతన్యరూపము విద్యారణ్యుఁడు చెప్పినట్లు, అ కృతిఁదాల్చిన అంతఃకరణవికారమువ వాక్యయందలి యవిద్య తొలఁగుచున్నది

తలచుగాఁ బలికినాఁడు.[1] మన పరిచ్ఛిన్న జ్ఞాన మెటు తలఁచినన
బ్రహ్మయొక్క నిజస్వరూపము మారదు. దృష్టిదోషము గలవారికి రెం
చంద్రబింబములు కన్పట్టుటచే నిజముగాఁ జంద్రు లిరువురుందుర
"న త్తనికాని యన త్తనికాని చెప్పుటకు వీలులేని నామరూపాత్మకమ
వ్యావహారిక జగత్తు పూ ర్తిగా నవిద్యపై నాధారపడియున్నది. పరమ
స్వరూపమగు సత్తు నిత్యమై, మార్పులేనిదై ప్రకాశించుచున్నది. ప
మాటలలో మార్పుచే నిరవయవమైన పరమాత్మలో మార్పు కలుగదు.
సృష్టి యీశ్వరుని పరిచ్ఛిన్న శాసనమున్న ఉదయించినపుడు శంక
డిట్లుచెప్పినాఁడు ! "త త్త్వమసి" మున్నగు వాక్యములవలన నక
జ్ఞాన ముపదేశింపఁబడినపు డభేదదృష్టి ప్రబుద్ధమై, జీవుని జన్మాం
పరివ ర్తనము, నీశ్వరుని సృజనప్రవృ త్తియు విరతిఁబొందును; వి
విభాగరూపమైన ప్రపంచస్వభావ మవిద్యాసంజాతము; సమ్యగ్జ్ఞానమ
నది తొలఁగిపోవును. అయినచో సృష్టి యెచటనుండి వచ్చినద
మంచిని కాకుండఁ జెడుగునుగూడ సృజించిన బాధ్యత యెవని
నామరూపములే ప్రవృ త్తి సాధనశ క్తిగాఁ గలిగి, అవిద్యాకృతమై
దానిని వివక్షణచేయు జ్ఞానలోపముచే నుదయించినదే సదసత్కా
చరణ రూపమైన సంసారము. జనన మరణాదుల వస్తువిభాగ మం
వ్యామోహమువలనే, యీ యజ్ఞానము పారమార్థికదృష్టిలో నస
మైనదే,"[2] మఱియు, నామరూపాత్మకమగు నవిద్యాకృతమైన య
కత్వము, పరిణామము గలదియు లేనిదియు, సద్రూపము నసద్రూప
కానిదియునై, స్వస్వరూపములో నది పరిణామజగత్తునకతీతస్థితిగ
యున్నడునుమార్పు చెందనిదగుచున్నది."[4] ఈ భావమును బ్రహ
ముగా నక్కాణించినచో జీవుని యవిద్యకు వేఱుగా ననేకత్వమున క

1) ఏకత్వం—పారమార్థికం మిథ్యాజ్ఞాన విజృంభితంచ నానాత్వమ్। (శ
2,1,14।)

2) 2,1 31। 2,1,14, 2,3,46।

3) త్రో॥ అవిద్యాకల్పితం కార్యప్రపంచమ్॥ (శం॥భా॥ 1,3,1.)

4) త్రో॥ । శం॥ భా॥ 2,1,27,

త్వములేదని తోఁచును. అన్ని మార్పులు, చలనములు, వికాసపరిణామములు, ప్రకృతిశాస్త్ర పరిశోధనలు, స్వప్నవార్తలనియు, నెండమావులనియుఁ జెప్పవలసివచ్చును. బ్రహ్మ జగత్కారణత్వ వాద మీ భావమును రూఢిపఱచును. జగత్పరివర్తనమువలన బ్రహ్మం దెట్టి మార్పును గలుగదని నిరూపించు నుత్కంఠతో,[1] సర్వమును బ్రహ్మమునం దారోపించినట్లే. జగత్తు బ్రహ్మమున నారోపింపఁబడెనని శంకరుఁడు చెప్పినాఁడు.[2] "చీఁకటిలో నొకఁ డొకత్రాడును పామని పొరపడి, భయకంపితుఁడై పరుగిడవచ్చును అప్పు డింకొకఁడు, "భయపడకుము, అది త్రాడేకాని త్రాఁచుకాద"ని చెప్పవచ్చును. అట్లు చెప్పి మొదటివాని భయ ముడిపి, పొరపాటు నాతనిని మరలించవచ్చును. త్రాడు పామని కలిగిన భ్రాంతి కొంతసేపుండి, తరువాతఁ దొలఁగుట వలనఁ త్రాడునకెట్టి మార్పును గలుగలేదు."[3] నక్షత్రములు నిజముగా మిణుకు మిణుకు మనవు, మన దృష్టికిమాత్ర మట్లు కన్పట్టుచున్నవి. నక్షత్రములనుండి ప్రసరించు కాంతి నిర్వక్రమముగానే యున్నది, కాని యా కాంతిమార్గమగు వాతావరణములోని చలనముల వలన మనదృష్టి చలించి, నక్షత్రములు చలించుచున్న వను భ్రాంతిని గలిగించుచున్నవి. అదేవిధముగా, మనదృష్టిదోషముచే బ్రహ్మమందనేకత్వ పరివర్తనాదిక మున్నదను భ్రాంతి జనించుచున్నది.[4] శంకరుఁ డిచ్చిన కొన్ని యుదాహరణముల వలన ననేకత్వము, భిన్నత్వము మానవ మనస్సముద్భవమగు మరు మరీచికా భ్రాంతి వంటిదేయని స్పష్టమగును. భేదములన్నియు మానవ మానస కల్పనములే; మన హ్నైక కోణాకృతిగల గాజుముక్కవలె, యథార్థముగానున్న యేకత్వమును విచ్ఛేదమొనర్చి దానిస్థానమున ననేకత్వమును బ్రదర్శించును; నిజమున కనేకత్వము, దానినిఁ గల్పించు మనస్సు రెండు నసత్యములే. కాని మన యుపమానములను భావస్ఫూర్తికొఱకే యుపయోగింపవలెను

---

1) శం॥ భా॥ 2,1,28; 2,1,9
2) అధ్యారోపితము
3) శం॥ భా॥ 1,4,6; మాండూక్యకారికా; శం॥ భా॥ కఠోపనిషత్తు 3,1 ॥ 4,11
4) శం॥ భా॥ 2,3,46.

గాని, వాని వాద్యార్థమును సాగఁదీసి యర్థాంతర వ్యాప్తి నిచ్చునట్లు చేయరాదని శంకరుఁడు చెప్పియున్నాఁడు.[1]

అనంతరాద్వైతులు కొందరు విజ్ఞాన వాదార్థము నంగీకరించిరి అవిద్య విజ్ఞాతకుఁ జెందుననియు, కనుగ్రుడ్డుపైఁ బొరయున్నట్లే సది వస్తుస్వరూపమును మఱుగుపఱచునట్లు, వర్తించుననియు వాచస్పతి చెప్పినాఁడు.[2] అవిద్యయే మిథ్యాప్రపంచ కారణమనియు, నీ యవిద్య వలననే మనము బ్రహ్మము మిథ్యాజగత్తున కుపాదాన కారణమనియు భావింతుమని మధుసూదనసరస్వతి పలికినాఁడు.[3] "మిథ్యా జగన్మూలము చిత్తము; చిత్తనాశముతో మిథ్యాజగత్తును నశించును."[4] చిత్సుఖి, అద్వైత సిద్ధాంతముక్తావళి, యోగవాసిష్ఠము, దృష్టి సృష్టి వాదము లను బలపఱచి, మన చిత్తజ్ఞానము జగన్మూల కారణమనియు విషయివిషయ విజ్ఞాన విరతితో జగత్తు నశన్మగ్నమగు ననియు వాదించినవి.[5]

---

1) శం।గా। 3 21, 17 19

2) శివాశ్రయం బ్రహ్మవిషయం। బ్రహ్మకుఁ గల్పించిన భిన్నరూపములకు గారణ మంతఃకరణ వికారములని యాతఁడు చెప్పెను ఈ విధముగా వాతఁడు వికారములను, వాని విషయములను నంగీకరింపవలసివచ్చినది

3) "అవ్యక్తైశ్వేంద్ర శాలన్య యదుపాదానకారణ అజ్ఞానం తదుపహితం బ్రహ్మకారణముచ్యతే। (అద్వైతసిద్ధి, పు 238)

4) చిత్తమూలో వికల్పోఽయం చిత్తాభావే న కశ్చన।(వివేకచూడామణి। పు 407

5) చూ॥ స॥ సి॥ సా॥ సంగ్రహము 12 13,19 దృష్టిసృష్టివాదమనఁగా చూడఁబడినంతకాలమే సృష్టియున్నదనునది యోగవాసిష్ఠసిద్ధాంతము

"మనోదృశ్యమిదం సర్వం యత్కించిత్ సచరాచరమ్,
మనసోహ్యమనీభావాత్ ద్వైతం నైవోపలభ్యతే।

చూ॥ యోగవాసిష్ఠసారములో శివస్తుతి అధ్యాయము చూడుము। సంక్షేపశారీరకమ "తదవిత్త మాత్ర తమసా జనితం పరికల్ప్యత ఇత్యఖిలమేవ జగత్" వృసింహాశ్రమి

"చిద్ధిదం సర్వమ్" (2 1,7)

అద్వైత తత్త్వమునందుచెప్పిన జగన్మిథ్యాత్వమునుగూర్చి పశ్చిమఖండవిమర్శకు లిట్టి భావములనే ప్రకటించుటలో నాశ్చర్యము లేదు. జగత్తునుగూర్చి యిట్టిభావమును మనము నందుంచుకొనియే ఎడ్వర్డుకెయిర్డు వ్రాసినాఁడు." అద్వైతమతమొక జగన్మిథ్యావాదమై, సర్వమీశ్వర స్వరూపమను తత్త్వముగాఁ బెంపొందినది. ఇది ప్రదర్శించు నేకత్వము వస్తుభిన్నత్వమును సమన్వయించునదికాదు, ఈ యేకత్వమొక యగాధమైన గర్తము, అందు భిన్నత్వమువడి యదృశ్యమైనది" [1] ఈ భావము జీవితమునొక విషాదాంతమగు హాస్యముగాఁ జూచి, వ్యావహారికజగత్తునుగూర్చి శంకరుఁడు చెప్పిన యనేకవాక్యముల కపార్థము కల్పించి, సముచితార్థవివరణముల నన్నిటిని భంగపఱచినది, అందుచే జగత్తు మిథ్యయను భావమునకు వ్యతిరేకముగా దృశ్యమాత్రమను భావమును బలపఱచు పెక్కువిషయముల నిచటఁ గ్రోడీకరింపవలసి యున్నది.

అవిద్య సాంఖ్యులప్రధానమువలెనే యచేతనమగుటచే జగత్కారణము కాఁజాలదు. సాంఖ్యప్రధానవాదులను ఖండించిన శంకరుఁ డవిద్యాసముద్భవమే ప్రపంచమను వాదమును సమర్థించునని మన మూహించుట కవకాశములేదు. అవిద్యతో నారంభమైన బౌద్ధుల కారణధర్మపరంపరా వాదమునుకూడ శంకరుఁడు ఖండించిన విషయమును మఱవరాదు. "చేతనుఁడగువాని మనస్సులో నుదయించిన యూహాయేఅవిద్య. పదిరెండు లింకులుగల కారణధర్మమను గొలుసులో నిది మొదటిలింకు. దేహ మనస్సుచ్ఛయము లిందు గ్రహింపఁబడినవి, కాని యవియెట్లుపరస్పరసంపర్కమును గలిగి

* తస్మాద్విజ్ఞాన మేవాస్తి ప్రపంచో న తు సంస్థితిః (లింగపురాణము పా॥ ప్రా॥ భా 1, 42 లో నుదాహృతము) వీనియాధారమున ననే విజ్ఞానభిక్షువిట్లు సమర్థించెను: "ఏకే వాధునికానాం వేదాంతి బ్రువాణాం అపి మతం, విజ్ఞానవాదతుల్య మాగతోమతయా నిరస్తమ్(సాం॥ ప్రా॥ భా॥ 1, 43)

1) ఇవల్యూషన్ ఆఫ్ రెలిజియన్, వాల్యూము 1 పు॥ 263 ఇట్టి పశ్చిమ పండితుల విమర్శలకు డా॥ కీర్తికర్ స్టడీస్ ఇన్ వేదాంత, అ 2

యుండునో చెప్పఁబడలేదు." [1] శంకరుఁడు శూన్యవాదమును, [2] క్షణభంగ వాదమును [3] గూడ నిరసించినాఁడు. విషయముతో సంబంధము లేని విషయజగత్తున్నదను నిరూపణమువలననే బౌద్ధవిజ్ఞానవాద నిరసనము స్థిరమైనది. వస్త్వస్తిత్వము మన మానసికవికారములపై నాధారపడియుండలేదు. ప్రపంచమును జ్ఞానస్వరూపముగాఁ జూచినపుడు పారమార్థికసత్యము చెప్పఁబడినది. అదేవిధముగా జాగ్రదనుభవము స్వప్నానుభవతుల్యమని నిరూపింప యత్నించు వాదములన్నిటిని శంకరుఁడు నిరసించినాఁడు. [4] జగత్తు కేవల మవిద్యాసంభూతమని యాతఁడంగీకరింపఁడు. శంకరుని భావములో నవిద్య కేవలము వ్యక్తిగతమైన శక్తియేకాదు, దానికి బాహ్యమగు వాస్తవికతయుఁ గలదు. అందరి కనుభవసిద్ధమైన పృథివ్యాదిప్రపంచమునకు కదియే కారణము అవిద్య, స్థూల సూక్ష్మ రూపములనుగలిగి, యనాద్యమై, [6] భావాత్మక లక్షణయుక్తమైనదే అవిద్య. [7] అవిద్య, మాయ, ప్రకృతియు సమానార్థకములుగా వాడఁబడినవి.

పరబ్రహ్మమే జగదాధారమని శంకరుఁడు వాదించెను. బ్రహ్మము జగత్తునుండి పూర్తిగాభిన్నమైనచో, అత్మ జాగ్రత్స్వప్న సుషుప్త్యం

1) శం భా॥ 2,2,1

2) శం,భా. 2,2,41

3) శం భా, 2, 2,18,21,26.

4) రెంటికి భేదము విదితముగా నవశంకరాద్వైతుల రచించిరి, లక్ష్మీధరుని అద్వైత మకరందమునకుఁ దాను వ్రాసిన వాక్యములలో స్వయంప్రకాశుఁడు చెప్పెను: "జాతి స్వప్నప్రపంచము భ్రాంతి కల్పితమైనట్లే నాటకగలుగు జాగ్రదవస్థయు భ్రాంతికల్పితమే" చూ. పండిట్, అక్టోబరు 1873, పు. 1,28

5) "శీవతః శో విశుద్ధా చిత్ విభాగశ్చ తయోర్ద్వయోః
అవిద్యాతచ్చితో ర్యోగ స్సదప్యాక మనాదయః
(సిద్ధాంతముక్తావళిలో నుదాహృతము)

6) అనాదిభావరూపం యద్విజ్ఞానేన విలీయతే తదజ్ఞాన మితిప్రాజ్ఞా లక్షణం సం(ప్ర)చక్షతే (చిత్సుఖి 1,13)

7) అర్ధ్యక్తమవిద్యాఖ్యా నాదిః స్థూలసూక్ష్మాత్మనాస్థితా॥ (సంక్షేప శా॥ సంగ్రహమ 12 19) (3 వోల్యు: లోకాచార్య: తత్త్వత్రయము పు 48, చౌకాంబాముద్రణము,

స్థలమునుండి పూర్తిగాపేక్షించినచో, జగత్తుయొక్కగాని, జాగ్రదాద్యవస్థా త్రయముయొక్కగాని యథార్థతనునిరసించుటవలనఁ బరమార్థప్రాప్తి సాధింపఁబడదు, అపుడు మనము నాస్తికవాద మంగీకరించి, సర్వోప దేశములు నిరర్థకములని త్రోసిపుచ్చవలసివచ్చును. [1] మిథ్యాసర్పము శూన్యతనుండి జనించుటలేదు, భ్రాంతితొలఁగినపు డది శూన్యగతమగుట యును లేదు. భ్రాంతికి మూలస్థానము మన తర్కములుగాని, పర మార్థముగాదు. బహురూపప్రపంచము మన భావదోషముచేఁ బుట్టి నది భావదోషమును దొలఁగించుటనఁగా, భావమును మార్చుకొనుట. త్రాడు పాముగాఁ గనిపించును, భ్రాంతి తొలఁగినపుడు, పాము త్రాడులోఁ గలసిపోవును. అదేరీతిగా వ్యవహారజగత్తు బ్రహ్మసాక్షాత్కార సిద్ధిలో లీనమగును. ఇచట జగత్తు నిర్మూలింపఁబడుటలేదు, అది వేఱొకరూపముతో గోచరించును. జీవన్ముక్తిభావము, క్రమముక్తి భావము, సత్యాసత్యములకు, ధర్మాధర్మములకు భేదమునుగుర్తించుట, వ్యావహారిక జగమ్మూలమున మోక్షసంపాదనావకాశము, నివన్నియు బాహ్యప్రపంచ దృశ్యములలో సత్య మున్నదని సూచించును, జగత్తులో బ్రహ్మమున్నదికాని, జగద్రూపమున లేదు జగత్తంతయు మిథ్య యైయు బ్రహ్మతోసంబంధములేనిదైనచోఁ, ప్రేమయు భావము, వైరా గ్యము మున్నగు జీవిత వికాసమున కుపయోగింపవు ధర్మాచరణముచేఁ బరబ్రహ్మ సాక్షాత్కారసిద్ధి కవకాశమున్నదని శంకరుఁ డంగీకరించినంత కాలము ధర్మమునకు విలువయున్నదని యొకఁడంగీకరించినట్లే. ప్రపంచ మసత్యమేకాని, భ్రాంతి కాదు అది కేవల మొక యసత్పదా ర్థము కాదు. ఆత్మకాని దాని నాత్మ యనుకొను భ్రాంతిని దొలఁగించుట వలననే మోక్షము లభించును. విద్యారణ్యుఁడు చెప్పినరీతిగా, "జీవాత్మ పూర్తిగా నాశనము బొందవలసినచో మానవులకు మోక్షము లాభకరము గాదు"

బ్రహ్మమే లేకున్నచో మనకు జీవాత్మయు నుండదు, భ్రాంతియు నుండదు. శంకరుఁడు చెప్పినవిధమున, "నిజముగాఁగాని యబద్ధ

---

1 యహం ప్రత్యవస్థాత్మ విశం తురీయ మన్యత్ తత్ప్రతిపత్తి ద్వారాభావాత్ శాస్త్రో పదేశానర్థక్యం ప్రసక్తి స్యాత్, (శం భా మాం కా 2,7.)

ముగాఁగాని వంధ్యకుఁ బుత్రుఁడుదయించఁడు" [1] ప్రపంచమున కెట్టి యథార్థమైన యాధారములేనిచో, సత్తే దాని మూలమైనచో, బ్రహ్మముకూడ నసత్యమేయని మనము కొట్టివేయవలసియుండును" [2] ప్రపంచమునకు సత్పదార్థమాధారము, ఏలన, "మరుమరీచికయు నిరాధారముగానుండఁజాలదు. [3] ఏస్వప్నమీశ్వరకల్పితమో, దీనిద్రవ్యమీశ్వరసంబంధమో, యది స్వప్నమేకాఁజాలదు. [4] మనమీ ప్రపంచము ద్వారా పరమార్థముకేరఁ గలుగుచున్నామనఁగా నీప్రపంచములోఁ బరమార్థాంశ మిమిడియున్నదని చెప్పవలెను. రెండును భిన్నములైనచో, నొకటి సత్యము రెండవ దసత్యరూపమునని చెప్పుటకే వీలులేదు. ప్రపంచము బ్రహ్మముకాదు; బ్రహ్మముపై నాధారపడియుండవచ్చును. ఏది సత్యముపై నాధారపడియుండి, సత్యముకాదో దానిని దృశ్యమాత్రమని చెప్పవలెను. ప్రపంచము బ్రహ్మముయొక్క సత్యస్వరూపము గాకున్నను, పరిచ్ఛిన్నులమగు మనదృష్టికి గోచరించు బ్రహ్మముయొక్క బాహ్యదృశ్యరూపమేయని చెప్పదగును. కాని వ్యవహారజగత్ప్రమస్య యింతమాత్రమున నిశ్చయముకాదు. [5]

1 శంకరుల గౌడపాదకారిక 1 6

2 యదివాచిజామేవ జన్మస్యాత్ బ్రహ్మణోఽపసత్యప్రపంచః

3 నహి మృగతృష్ణికాదయోఽపి నిరాస్పదా భవంతి (శం గీ భా 13-14) మరియుఁజూడు, శంభాష్యా త్రి 6,2,3; మాం ఉ 1 7.

4 అనంతరాద్వైతమునందుఁ ప్రపంచమును స్వప్నముతోఁ బోల్చిన యుపమానమును భగ్నమగునటుల సాగఁదీసిరి. అద్వైతమకరంద మిట్లుచెప్పుచున్నది "ఆత్మను గూర్చిన అజ్ఞానమను నిద్రచేఁగల్పితమైన జగత్తను దీర్ఘస్వప్నమునందుఁ బాలోకమోహాదిస్వప్నముల కొరకట్టుచుండును,

" అత్మాజ్ఞానమహానిద్రా జృంభితేఽస్మిన్జగన్మయే,
దీర్ఘస్వప్నేస్ఫురంత్యేతే స్వర్గమోహాదివిభ్రమాః (18)

5 ఇంకొకసందర్భములో బర్క్లే చెప్పినది శంకరుని విషయములోనరిపోవును, "సూర్యచంద్రనక్షత్రము లేమగును గృహ నదీపర్వత వృక్షశిలాదులు, మనశరీరము లేమగును? అవన్నియుఁ గేవల మూహావినోదములాయనునేః మనము నిర్వచించిన మాత్రములనునుబంధి, ప్రకృతిలోనేయుక దానికి స్థానములేదు, మనకింద్రియ గోచరమగున దంతయు నిజమైనది స్థిరమైనదియును, ప్రకృతిసిద్ధవస్తుజాలమునకు, బుద్ధ్యాదృశ్యములకు భేదము నిలిచియేయుండును" మనవవిజ్ఞానమాత్రములు పు.34

మోక్షమునుగూర్చిన శంకరునిభావములవలన జగత్సత్యమును గూర్చి పైనిచెప్పిన యంశము సమర్థింపబడుచున్నది. మోక్షమనఁగా నది లభించుటతోఁ బ్రపంచ మదృశ్యమైపోదని యాతఁ డుద్ఘాటించెను. ఏలన నట్లైనచోఁ బ్రపంచము మొట్టమొదటి ముక్తపురుషునితో నంత రించియుండును. బహుత్వమును నాశనమొనర్చుటే మోక్షమైనచో, విద్యచే నవిద్యను బోఁగొట్టుకొనుట మోక్షమునకు యుక్తమార్గముకాదు; అపుడు చేయవలయు కర్తవ్యము ప్రపంచమును నాశమొనర్చుటే. [1] శంకరుఁడు జీవన్ముక్తి, విదేహముక్తియను ముక్తిభేదములను జెప్పినాఁడు. ముక్తావస్థకు శరీరముండుటలేకుండుటయు భేదమునుకలుగఁజేయదు. సంసారబంధములనుండి విముక్తియే మోక్షము, జగద్రూపమగు నవేకత్వ ముండుటయుఁ బోవుటయు ననువానిపై మోక్ష మాధారపడి యుండలేదు, మోక్షసిద్ధిగలిగిన వానిని జగత్తు మోసగింపఁ జాలనిదగును. అందుచే జీవన్ముక్తునికిఁ, దనశరీరముతోఁగూడిన ప్రపంచము విరతినొందదు, కాని దానివెట్టిదృష్టితోఁజూడవలెనో యాతఁడు గ్రహించును. ముక్త పురుషునికి జగ మింకొక కాంతిలో గోచరించును. ముక్తపురుషుఁడు కామములచే బంధుఁడై, సంసార సంచారములో నెన్నఁడు లభింపని సుఖాదులకొఱకుఁ బరుగు లిడఁడు. జీవబ్రహ్మైక్యసిద్ధియగుట తోడనే, జీవులువేఱు, విషయములువేఱు, వాని ప్రవృత్తులు వేఱను భేదబుద్ధినిఁ గలిగించు నజ్ఞానము నశించును. [2] అవిద్యయనఁగా నాత్మ ననాత్మ నుండి వివేకింపలేక పోవుటయే. ఇచ్ఛాజ్ఞానక్రియా ప్రవృత్తులు మనకుఁ గలవని మనమెఱుఁగుదుమను విషయము స్పష్టమేయని శంకరుఁ డంగీక రించునుగాని, వీనిపైనాధారపడి, పరిచ్ఛిన్నజీవులు నిజముగా వాని స్వస్వరూపములైన యపరిచ్ఛిన్నాత్మ రూపములని యాతఁ డంగీక రింపఁడు. పరమార్థ మర్థమునుగ్రహించును దృశ్యము లన్నియుఁ బరమార్థమునకుఁ జెందినవే. అద్వైత మంగీకరించిన అనన్యత్వ సిద్ధాం తములోని సత్యమిదియే. రామానుజుఁడు దీనినిట్లు విమర్శించినాఁడు,

1) శం భా 3 221

2) బ్రహ్మాత్మదర్శినాం ప్రతి, సమస్తస్య క్రియాకారక ఫల లక్షణస్య వ్యవహార స్యాభావమ్, (శం భా 2.1.14)

“ కార్యమసత్యమును కారణముచేఁ గార్యకారణములకు నన్యత్వమును సమర్థించువారు, వారియనన్యత్వసిద్ధాంతమును నిలుపుకొనఁజాలరు; ఏలన, సత్యమైన దానికి నసత్యమైన దానికి ననన్యత్వముండఁజాలదు. వారి వాదమే యుక్తమైన దైనచో, బ్రహ్మ మసత్యమైనను గావలెను లేదా, జగత్తు సత్యమైనను గావలెను.”[1] నిర్గుణబ్రహ్మము జగత్తుతో ననన్యతను గలిగియున్నదని యద్వైతి చెప్పుటలేదు. జగత్కారణమున కాధారభూతమగు బ్రహ్మము, జగత్తుతో సమానముగా సత్యమైనదనియు నాతఁడు వచించుట లేదు దృశ్యప్రపంచ మసత్య మనియు నసఁగా, బ్రహ్మమునకు వేఱుగా దాని కస్తిత్వము లేదనియు నాతఁడు చెప్పును. ఈ యనన్యత్వమును శంకరుఁ డభావముగా నసఁగా, దాని కారణమునకు భిన్నమైన దానినిగా నర్థము చెప్పినాఁడు.[2] అనన్యత్వమేకత్వమును సమర్థించదు; భిన్నత్వమునే నిరసించునని తన భామతిలో వాచస్పతి స్పష్టపఱచినాఁడు.[3] కారణధర్మమును, దానికి సంబంధించిన శాశ్వతైకత్వమును జర్చించుచుఁ, గార్యము కారణముతో నేకమేగాని కారణము కార్యముతోఁగాదని శంకరుఁడు పలికినాఁడు.[4] ఏకత్వములో భేదములన్నియు లయముకావచ్చునుగాని యద్వైతమునందు వ్యావహారిక పారమార్థికసత్యములకు మధ్యమందుఁ గల ఛిద్రమును గప్పివేయుట కొఱకొక సద్వైతకత్వప్రకటనము చేయఁబడెను. మృత్తికా వికారముల కన్నిటికి మూలాధారము మృత్తికయే యని చెప్పిన యుపనిషద్వాక్యమున కర్థ వివరణముచేయుచు శంకరుఁడు ప్రపంచము బ్రహ్మరూపము

1) రామానుజభాష్యము, 1 1 19

2) తద్వ్యతిరేకేణాభావః (శం భా,1,1,14 )

3) నఖల్వనన్యత్వమిత్యభేదం బ్రూమః కింతుభేదం వ్యాసేధామః, (భామతి) ఈ భావమునే టీకాకారుఁడిట్లు చెప్పెను;

" ప్రపంచము బ్రహ్మముతో నేకముగాదు; దాని మూలకారణమగు బ్రహ్మమునకు వేఱైన యస్తిత్వము దానికిలేదు "

" కారణాత్ పృథక్ సత్తాశూన్యత్వం సాధ్యతే, నత్వైకాభిప్రాయేణ "

4 7 శం. భా. 21,7

భా, 6—7

బ్రహ్మమూలమువని చెప్పియున్నాఁడు. కార్యము అసత్యములని యాతఁడు నిరసించునపుడు, "బ్రహ్మభిన్నము, లేక 'కారణభిన్న'ము నని విశేషములు చేర్చినాఁడు.[1] జీవితము నిజముగా నొకస్వప్నమని కాని, మన జ్ఞానమొక స్వప్నదృశ్యమనికాని యాతఁడెచ్చటను చెప్పి యుండలేదు

సగుణమైన సర్వసామాన్యలక్షణము పారమార్థికప్రమాణము కాఁజాలదని శంకరుఁడు నిరసించుటవలన నాతఁడు ప్రపంచమును మిథ్యా కల్పితముగా భావించె నని యూహింపఁబడెను అద్వితీయమైన శంకరుని బ్రహ్మ మేజంతువులు దరిఁజేరినను మరలఁ దిరిగిరాని సింహగుహ రమువంటిదని తోఁచును. తర్కపద్ధతిచే మనము జగద్బ్రహ్మ సంబంధము ను తెలిసికొనఁజాలమని, శంకరుఁడుచెప్పి, జగత్తు బ్రహ్మమూలము బ్రహ్మైక రాధారాస్తిత్వములు లేనిదియునని యేయితరవాస్తవికవాదికిని దీసిపోకుండ నుద్ఘాటించియున్నాఁడు. బ్రహ్మమును జగత్తునొక సంపూర్ణద్రవ్యభాగములని యాతఁడంగీకరింపఁడు గాని, వానికిఁ బర స్పరవ్యతిరేకత్వ మున్నదనియు నాతఁడు చెప్పఁడు. కని, పెక్కుమంది సుప్రసిద్ధపండితులిట్టి నిర్ణయమునకు వచ్చిరి.[2] దృశ్యప్రపంచ బ్రహ్మసంబంధసమస్య పరిచ్ఛిన్న మనస్కులమగు మనకెన్నటికి నొక సమస్యగానే యుండునని శంకరుఁడుచెప్పినభావ మధికవరిణతినిఁ జూపును అవాద్యమగువిషయముల కాదినిగ్రహింపఁజాలని మానవ విజ్ఞానము వ్యర్థమైనదని మనము నిరపింప నవసరములేదు.

ఇప్పుడు మనప్రశ్న యేమనఁగా, నీదృశ్యములనుండి మనము పరమార్థము నన్వేషించి కన్గొనయత్నింతుమో, అట్టివ్యావహారికదృశ్య

---

1 బ్రహ్మ వ్యతిరేకేణ, లేక కారణవ్యతిరేకేణ, (శం భా 2 2,3 గౌడపాద కారిక 1 6 )

2) మ్యాక్సిమ్ భావఁవరణము సువిదితమైనది. మ్యాక్సుముల్లరు చెప్పినాఁడు: "నేనిచటఁ బ్రదర్శించుటకు యత్నించినరీతిని సరియగు వేదాంతతత్త్వముయొక్క ముఖ్యసూత్రముల నర్థముచేసికొనిన బ్రతివ్యక్తికి నీతత్త్వమునందు మనస్తత్త్వమునకుఁగాని, సృష్టివాదములకుఁగాని ధర్మశాస్త్రమునకుఁగాని తావులేదని స్పష్టమగును "(సిక్స్ సిస్టమ్స్ ఆఫ్ ఇండియన్ ఫిలాసఫీ పు 170.

ములు, పరమార్థసత్యమును గూర్చి మనము మనపరిచ్ఛిన్నమనస్సులతో నూహించి కల్పించుకొను భావమాత్రములా? మఱియొకలాగునఁ జెప్పినచో, వ్యావహారికప్రపంచము పరమార్థముయొక్క వికృతిరూపమా? లేక మన పరిచ్ఛిన్నదృష్టికి గోచరించు కేవలమిథ్యాస్వరూపమా? యనునది ముఖ్యసమస్య. జగము పరమార్థవికృతిరూపమని రామానుజుని మతము. ఇదియే హెగెల్ తత్త్వము, దీని ననుసరించి, వ్యవహార జగత్తు నిర్గుణబ్రహ్మయొక్క బాహ్యప్రదర్శనము. స్పైనోజాయొక్క తత్త్వ మొకవిధముగాఁ జూచినచో నిట్టిదే [1] జగత్తు కేవలభావకల్పితమను భావము యోగాచారబౌద్ధులును, ప్రతిపాదించిరి. వీరు క్యాంటుతత్త్వజ్ఞునివలెను, తరువాత నధికముగా షోపెన్‌హాయరువలెను, బాహ్యప్రపంచము వ్యక్తిగతమైన బుద్ధిగోచరమాత్రమే యని నిర్ణయించిరి. సత్యస్వరూపమును మానవుఁ డూహించి కల్పించిన భావమాత్రాస్తిత్వముగలదే ప్రపంచమను నర్థమునిచ్చు వాక్యములు గొన్ని శంకరుని రచనలలోఁగలవు. పరిచ్ఛిన్నవ్యక్తులతో నిమిత్తములేకుండ బాహ్యప్రపంచమునకు యథార్థమగు నస్తిత్వముగలదను భావమునిచ్చు కొన్ని వాక్యములును గలవు. శంకరుని తత్త్వమును సరిగా గ్రహించుటకు మన మవిద్యా మాయా సంబంధమును స్పష్టముగా గ్రహింపవలెను.

## 33 – మాయ – అవిద్య

బాహ్యప్రపంచ దృక్పథమునుండి చూచినచో మాయయనియు, వ్యక్తిగతదృష్టినుండి చూచినచో నవిద్య యనియుఁ జెప్పఁబడును. [2] బ్రహ్మము నాత్మయు నొకటేయైనట్లు, మాయయు నవిద్యయు నొకటే. నిజముగా నొకటైన దాని ననేకముగాఁ జూచు మానవస్వభావము నవిద్య

---

1) ఎండిన కోకిలేశ్వరశాస్త్రి యిట్టిభావము శంకరునకుఁ గలదని వ్రాసినాఁడు, అతని అద్వైతతత్త్వము

2) "అధికర్తయొక్క సంకల్పమునకు వశమై, పాటిలేని ఫలితముల నుదయింపఁజేయునపుడు దానిని మాయయందుము; అది స్వతంత్రమై, సత్యమును నాచ్ఛాదించు శక్తిగలిగిన దైనప్పు డవిద్య యనఁబడును" (వివరణ ప్రమేయసంగ్రహము 11 ఇండియన్ ఫిలాసఫీ వాల్యూము 1 పు 280.)

యందుదు; కాని యిది మానవులందఱకు సామాన్యమైనది. ఏలన, నవిద్యనుగూర్చి శంకరుఁడు చెప్పునపుడది నీదియనిగాని నాదియనిగాని చెప్పలేదు అదియొక విశ్వవ్యాప్తమగుశక్తి, వ్యక్తుల చిత్తములలో నది వ్యాపించునుగాని, వాని కతీతమైన శక్తియునై యున్నది. మన జ్ఞానేంద్రియము లదివఱకే సృజింపఁబడిన వస్తువులను జూచి, వ్యవహరించును, మన యింద్రియము లావస్తువులను జేసియుండలేదు. శ్రుతులు చెప్పిన క్రమములో నీశ్వరుఁడు ప్రపంచమును సృజించినాఁడు. దానిని మనము దర్శించుచున్నాము.[1] మాయ విషయివిషయసంబంధి, వ్యక్త్యాత్మకము సార్వజనికము గూడనై యున్నది. ఉపాధిగతములైన చిత్తములను బాహ్యవస్తువులను గూడ దానినుండియే వచ్చినవి. ఏదికారణముఁగా నసత్యప్రపంచము సత్యమైనదిగా గోచరించుచున్నదో, యది కేవల వ్యక్తిగతమైనదైనచో, నది కేవల మూహాకల్పితమే యగుటచే, జగత్తున కుపాదానకారణమని మనము చెప్పుట కవకాశములేదు. అట్లుగాక, మాయ జగత్తున కుపాదానకారణమే యన్నచో, నఁగా సాంఖ్యప్రకృతివంటిదన్నచో, నది యప్పుడు కేవలము వ్యక్తిగతము కాఁజాలదు. వ్యక్తిగతమైన అవిద్యయు, బ్రహ్మసంబంధమైన ప్రకృతియు నేక కాలమం దుదయించును, ఇం దేదియొకటియు రెండవది లేనిచో దురూహ్యము;[2] అందుచే నవిద్యయుఁ బరమార్థముపై నాధారపడియున్నది.[3] జీవాత్మయుఁ బ్రకృతియు నన్యోన్యాశ్రయ భూతములై యున్నవి. అవిద్యాప్రకృతులు సమాననిత్యతను గలిగి, వ్యవహారజగత్తునకుఁ జెందియున్నవి[4] దేశకాలనిమిత్త కల్పితమగు జగత్తు, అవిద్యాద్వార

1) శ్రుతిదర్శితేన క్రమేణ పరమేశ్వరేణ సృష్టం, అస్మాభిః వస్త్రాయుక్త మేవదృశ్యం, తత్తద్విషయ ప్రమాణాంతరతో ఐక్య తత్య దృష్టిసిద్ధిః (సిద్ధాంతలేశ: 2)

2) కోల్పు; క్యాంటు; బెర్గ్సన్, జడపదార్థములయొక్క భౌతికస్వరూపము మన విజ్ఞానముయొక్క బుద్ధి కల్పనములో నాఁడైనది బుద్ధియు, నింద్రియ గోచరమగు జగత్తు నేకకాలమం దుదయించి, పరస్పరాశ్రయ భూతములై యున్నవి

3) భాష్యకారణమ: అవిద్యావంతవద్వైషాప్రాదుర్భావా మహాత్మనః (1 5 5)

4) అద్వైతసిద్ధి: పు 5,9,5

మన మనకు గోచరించు పరమార్థరూపము అవిద్య యావనిచేయు ఒకే యర్థాత గలదై యేర్పడియున్నది. కేవల విజ్ఞానవాదముగాని, భౌతికవాదముగాని శంకరుఁ డంగీకరింపఁడు. జీవాత్మ ప్రకృతి సంజాతమగు నొక వస్తువుకానిచో, ప్రకృతి మన విజ్ఞానమునకు మాత్రమే గోచరించు నొక దృశ్యమును గాదు వస్తుప్రపంచాస్తిత్వము నకుఁ గల హేతువులే, జీవాత్మాస్తిత్వమునకును గలవు. మన మానసము అపార్థకల్పనములేల చేయుచున్నవి? అవిద్య యెందుకున్నది? దేశకాలనిమిత్త పరికల్పిత జగత్తేల యున్నది? మాయకుఁ గారణ మేమి? ఈ ప్రశ్న లన్నియుఁ బరిష్కరించుటకు సాధ్యముకాని మూల సమస్యారూపములే. శుద్ధచిత్స్వరూపమగునాత్మయెట్లో అవిద్యావశమైనది, శుద్ధసత్స్వరూపమగు బ్రహ్మము దేశకాలనిమిత్తాత్మకమగు ప్రపంచ మైనట్లే, వ్యావహారిక జగన్మూలమగు బ్రహ్మము నెఱిఁగినట్లే, మన మవిద్యామూలమున విద్యను గ్రహింతుము ఇట్టిపరివర్తన మనాదియై యేల సంభవించుచున్నదో మన కనిర్వచనీయమైనది, కాని, మనవిజ్ఞానసహిత మానసములుగాని వానిచే గ్రహింపఁబడుచున్న ప్రపంచము గాని మిథ్యకాదు. వస్తుదృశ్యమొక యూహాదృశ్యముకాదు. అవిద్యయు, మాయయు నొకేయనుభవముయొక్క బాహ్యాభ్యంతరరూపములు జ్ఞానముచే సదృశ్యమగునదికావున నది యవిద్యయనఁబడెను; బాహ్యదృశ్యపరంపర, పరమేశ్వరునితో సమానముగా నిత్యమైయుండు నదికావున మాయ యనఁబడును. మాయ ప్రళయ కాలమందుఁగూడ నుండునని శంకరుఁడుచెప్పినాఁడు. సర్వజ్ఞుఁడైన యీశ్వరుఁడు మాయ కధిపతిగావున, నాతని కవిద్యయును లేదు. సాంఖ్యతత్త్వజ్ఞు లీశ్వరు నంగీకరించలేదు, కాని ప్రకృతిప్రపంచము ననాదియైన యవిద్య కారణ మనిరి. అవిద్య బుద్ధియొక్క గుణముకావున, బుద్ధి యందే యుండును, అవిద్య కనాదిత్వలక్షణము బుద్ధినే యాశ్రయించియుండు నని చెప్పవలెను. బుద్ధి, యీ కారణముచే మూలద్రవ్యమగు ప్రకృతి యొక్కరూపమే. ఈ విధముగా నవిద్యయొక్క వాస్తవికత సాధింపఁబడినది. వివరణప్రమేయసంగ్రహ మిట్లు చెప్పుచున్నది: "అద్వైత దర్శనమున కాటంకముకల్పించి, ద్వైతమును దరి[illegible]ంత మనకు నవిద్య మనబుద్ధిగతమైన లోపమే యు[illegible]ందే హ[illegible]

కాని, యది జగదుపాదాన కారణమగుటవలన నది మహనీయమైనది; ఏలన, దానివలన బ్రహ్మజ్ఞానము సాధ్యమగుచున్నది"[1] అపరిచ్ఛిన్నమైన దానినిఁదెలిసికొనుటకుఁ బూర్వము పరిచ్ఛిన్నత మన కవసరమైనదే.

శంకరుఁ డవిద్యామాయాశబ్దములను సమానార్థకములుగా నుపయోగించినను.[2] రెంటికి భేదము ననంతరాద్వైతులు నిర్ణయించిరి మాయ యీశ్వరోపాధియనియు, నవిద్య జీవోపాధియనియుఁ జెప్పఁబడెను. విద్యారణ్యుననుసరించి, మాయయందు బ్రహ్మయొక్క ప్రతిబింబమే శుద్ధసత్త్వస్వరూపియగు నీశ్వరుఁడనియు, అవిద్యయందు బ్రహ్మప్రతిబింబమే రజస్తమోగుణసహిత సత్త్వరూపము జీవాత్మయనియుఁ జెప్పఁబడెను.[3] శంకరుఁడీభావమునే యిట్లు చెప్పెను, "నిర్గుణబ్రహ్మమే, మనము మనబుద్ధిచే భావించినపుడు శుద్ధోపాధిగల సగుణుఁడైన యీశ్వరుఁ డగును" [4]అవిద్యాసంజాతము లన్నియు

1) ఇండియన్ ఫిల్. వాల్యుము 2 పు 177 పోల్చు: ఈశ్వరాపేక్షావశవిధి: అవిద్యవలన పృథక్త్వము వచ్చునని యిందుఁ జెప్పఁబడెను

2) అవిద్యయు మాయయు నొకటికాదని కల్నల్ జాకోబ్ భావించెను చూ. వేదాంతసారము, 5 నానాత్వముతోఁగూడిన జగత్తవిద్యాకార్యము, పరిచ్ఛిన్నమానవ రూపములు దేశకాలనిమిత్తములు దృశ్యప్రపంచమున కాలంబనములు అవిద్య మాయానామ రూపములను గల్పించి వానిమూలమున బాహ్యజగత్తు నుద్భవింపఁ జేయుచున్నది అవిద్యా ప్రత్యుపస్థాపిత నామరూపమాయావేశవశేన (శం భా, 2 2,2) మూల ప్రకృతి మాయయనియు, దానికార్యములైన ఆవరణవిక్షేపము లవిద్యయనియుఁ గొన్నిసమయములలోఁ జెప్పఁబడెను శుద్ధసత్త్వసహిత మూలప్రకృతి మాయయనియు, నశుద్ధసత్త్వ సహితమైన దవిద్యయనియుఁ గొందరు తలఁచిరి పంచదశి ప్రధానమూల ప్రకృతిమాయా అవరణశక్తి ప్రధానామూర్తి ప్రకృతి అవిద్యా సత్త్వరజస్తమో గుణ కలితమై ఈశ్వరోపాధి రూపమైన దవిద్యయని కొన్ని యద్వైతగ్రంథములు చెప్పుచున్నవి ఇది సరియగు భావముగాఁ దోఁచదు రజస్తమోగుణము లీశ్వరున కున్నచో వానికి జీవునితో భేదముండదు పోల్చు: స్కందపురాణము అవిద్యజీవోపాధియనియు, బ్రహ్మ విష్ణు మహేశ్వరుల యుపాధిరూపమే మాయయనియు నిందుఁ జెప్పఁబడెను

అవిద్యోపాధికో జీవో న మాయోపాధికః ఖలు,
మాయాకార్య గుణచ్ఛన్నా బ్రహ్మ విష్ణు మహేశ్వరాః

3) పంచదశి 16,17

4) శం భా, ఛాం ఉ, 314, 2 విశుద్ధోపాధిసంబంధాత్

నీశ్వరుని కృతి. ఈశ్వరభావా విష్కృతియే ప్రపంచము, మానవ బుద్ధితో నది సంబంధించియున్నది. జగద్వస్తువు లన్నియు నీశ్వర మాన సిక భావములును, మానవబుద్ధి గోచరములునై యున్నవి. జగత్కా రణుఁ డీశ్వరుఁడని చెప్పఁబడెను [1] గాని, మఱల జగ మవిద్యాకల్పిత మనియు వచింపఁబడెను. [2] బ్రహ్మమును, మాయయు జగత్తులో నుండి, రెండును గలిసి దానియుపాదానకారణ మగుచున్నవి బ్రహ్మ మును, మాయయు సత్యము దానిదృశ్యమునై, రెండుసూత్రము లొకేసూత్రముగాఁ బెనవేయఁబడిన ట్లున్నవి.

## 34-ప్రకృతి జగత్తు

శంకరుఁడు యథార్థజగద్వర్ణనముతో మారకొనలేదు. తనసిద్ధాం తము ననుసరించి, దృశ్యప్రపంచరూపములను బరిశీలించి, పరిచ్ఛిన్న భావములలోనుండుసత్యమును నిర్ణయించినత్యము, భిన్న దృశ్యరూపము లలో నెట్టిక్రమములో గోచరించునో తెలిపియున్నాఁడు ప్రతిదృశ్యమెట్లు తనకాధారభూతమగు సత్యమును బ్రదర్శింప యత్నించునో యాతఁడు నిరూపింపఁబూనుకొనెను. సర్వమునకు మూలాధారభూతమై యవ్యయ బ్రహ్మముండుటచేఁ, క్రమముగా నుత్తరోత్తరాధికముగా బ్రహ్మస్వ రూప మావిష్కృత మగుచున్నది [3]. "మానవునియొద్దనుండి తృణము వఱకు నన్నియు నాకేచైతన్యముతో నిండియున్నను జ్ఞానము శక్తి మున్నగునవి సోపానక్రమములో సన్నగిల్లునట్లే, మానవుని మొదలు హిరణ్య గర్భునివఱకుఁగలయున్నతసత సోపానశ్రేణిఁజెందిన జీవ

---

1) 1,1,2

2) పోల్చు: అవిద్యాత్మికాహిబీజశక్తి రవ్యక్తశబ్దనిర్దేశ్యా పరమేశ్వరాశ్రయా మాయా (శం భా 1 4 3) మఱియుఁజూడు శం భా 2 1 14, 1 3 19. అవిద్యయామాయయా

3) యద్యప్యేక ఏవాత్మా సర్వభూతేషు స్థావరజంగమేషు గూఢస్తథాపి చిత్తోపాధివిశేషతారతమ్యాత్ ఆత్మనః కూటస్థనిత్యస్యైకరూపస్యాప్యుత్తరోత్తర మావిష్కృతస్య తారతమ్యం ఐశ్వర్యశక్తివిశేషైః శ్రూయతే (శం భా 1 1 11)

రాశిలోఁ గ్రమక్షాపాభ్యున్నతి వికసించుటను మనముచూచుచున్నాము[1] దృశ్యప్రపంచమున మన మీక్రిందిభేదములను దర్శింపఁగలము. (1) కర్మఫలప్రదాతయగు నీశ్వరుఁడు, (2) కర్మఫలనిలయగు నామ రూపాత్మక ప్రకృతి ప్రపంచము, (3) ఉపాధిగతములైన జీవాత్మలు. కర్మఫలము ననుభవించు నిమిత్తము తిరిగి తిరిగి లోకమున జన్మించు చుండుట - ప్రపంచముయొక్క అనేకత్వము భోక్తయు భోగ్యము, కర్తయు గర్మభూమియు నను ద్వంద్వములపై నాధారపడియున్నది. జడప్రపంచమంతయు క్షేత్రమని చెప్పఁబడెను, ఏలన నిచట జీవులకు తమ కర్మానుసరణమున ననుకూలమైన వాతావరణమున్నది. ఇచట జీవులు తమ కోరికల ననుసరించి కర్మలొనర్చి, ఫలితముల ననుభవింతురు[2] ఇది పంచభూతాత్మకమగు జడప్రకృతి జీవప్రపంచమాత్మలతో నిండి యుండును జీవాత్మలీ భూతములలోఁ బ్రవేశించి తరులతాపశు మానవ దేవతారూపములఁ దాల్చును[3] ఈ సంసారచక్రమునందు, భిన్న వర్గములకుఁ జెందిన జీవరాశు లున్నవి, వాని కనుగుణములైన యనుభవములకు తగినట్టి పరిస్థితులిందుఁ గల్పింపఁబడినవి. తృణబ్రహ్మ పర్యంతముగల యీ జీవరాశి సోపానక్రమములో సున్నతములగు ననుభవములను బొందుచుండును.[4]

ప్రపంచపరిణామమొక క్రమము ననుసరించును.[5] ప్రకృతి నుండి ప్రథమవస్తురూపమగు నాకాశము దేశపదార్థముల కాకరమై యుద యించెను. "బ్రహ్మాండమంతయు నీశ్వరునుండి యుదయించినది,

---

1) శం॰ భా 1 వ 30 యథాహి ప్రాణినాం ఏకోఽపి మనుష్యాది స్తంబపర్యంతేషు జ్ఞానైశ్వర్యాది ప్రతిబంధః పరేణపరేణ భూయాన్ భవన్ దృశ్యతే తథామనుష్యాదిష్వేవహిరణ్య గర్భపర్యంతేషు జ్ఞానైశ్వర్యాభివ్యక్తిరపి పరేణ పరేణ భూయసీ భవతి మా శం॰ భా 1 11

2) పరోపభోగార్థం, సర్వప్రాణి కర్మఫలాశ్రయః (శం॰ భా, ము॰ ఉ 3 1,1,

3) వైదిక దేవతలును జగత్పరిణామమునకుఁ జెందినవారే (శం॰ భా 1,2,17; 1,3,33

4) శం॰ భా 1,3,10 శం॰ భాష్యము 1,4.10.

5) శం॰ భా 2,1,24-25.

మొదట నాకాశము దాని వెనుక నితర భూతములును జనించినవి [1] ఆకాశము జడము, నేకము, ననంతము, సర్వగతము, నైన ప్రథమ భూతము. [2] ఆకాశ మనఁగా నవకాశమును, నత్యంతసూక్ష్మపదార్థ మును గూడనై యున్నది. ఆకాశమెంత సూక్ష్మతమ పదార్థమైనను నదియు భూమి జలాగ్ని వాయువర్గములకు జెందినదియై యున్నది. ఆకాశ మనఁగా కేవల నిరోధములులేని యవకాశమాత్రమను బౌద్ధుల భావ మును శంకరుఁడు ఖండించినాఁడు.[3] దీని యథాభావాత్మకమైన లక్ష ణము భావాత్మకలక్షణ ఫలితమే యని శంకరుని వాదమైయున్నది.[4] ఆకాశమునుండి యితర సూక్ష్మభూతము లన్నిత సోపానక్రమముగ నుదయించును.[5] ఉపనిషద్వర్ణనము [6] ననుసరించి, యాకాశము నుండి వాయువు జనించునని శంకరుఁడు చెప్పినాఁడు. అగ్ని వాయువు నుండియు, నగ్నినుండి జలమును, జలమునుండి భూమియు నుద యించును. ఈ పంచభూతములును దాని వికారరూపములకంటె నెక్కువ నిత్యతగలిగిన వగుటచే నవి శాశ్వతములు నవినాశములు నని వర్ణింపఁ బడినవి.[7] ఆకాశమునకు శబ్దము గుణము వాయువున కొత్తిడి, అగ్నికుష్ణతయుఁ గాంతియు, జలమునకు రుచియు, భూమికి గంధమును గుణములై యున్నవి. భూతములకు గుణసంబంధము బీజవృక్షసంబంధము ఆకాశకారణము శబ్దతన్మాత్ర, ఆకాశము స్థూల శబ్దము నుదయింపఁజేయును తన్మాత్రలో భూతమును దానిగుణ మును గూడ నుండును. భూతములలోఁ గూడ సోపానక్రమమున్న దని మనము చూచితిమి. ఇవన్నియు నాకాశతన్మాత్రలో నున్నవని తెలియుచున్నది అనఁగాఁ బ్రపంచమంతయు నాకాశమునుండి లేక శబ్దమునుండి, జనించుచున్నది

1) శాం॥ భా॥ 2,3,7
2) శాం॥ 1,1,22; 1,3,14 చూ॥ ఛాం॥ ఉ॥ 3,1,43 8,14
3) అధ్యాసభాష్య (శాం॥ భా॥ 2,2,22 )
4) ప్రస్తుతభాగం
5) శాం॥ భా॥ 1,3,8—13
6) తై॥ ఉ॥ 2,1; ఛాం॥ ఉ॥ 6,2 2-3
7) ఛాం॥ ఉ॥ 4,3,1; బృ॥ ఆ॥ ఉ॥ 1,5 22

మహాభూతకల్పితమైన జడప్రపంచమంతయు నీ సూక్ష్మభూత మిశ్రమములచేఁ గలుగుచున్నది [1] స్థూలాకాశము శబ్దమును, వాయువొత్తిడిని శబ్దమును, నగ్ని వీనిని మఱియు నుష్ణమును గాంతిని, జలము వీనితోఁగూడ రుచిని, భూమి యితర భూతగుణములతోఁబాటు తన సహజగుణమైన గంధమును బ్రకాశింపఁజేయును. ప్రతివస్తువునకును శబ్ద స్పర్శ రూపరసగంధములు గుణములై యున్నవి. భూతతన్మాత్ర లణునిర్మాణములేని యవిచ్ఛిన్నము నేకమునగు పదార్థరూపములై యుండఁగ, స్థూలభూతపదార్థములు సముచ్చయద్రవ్యములు, ఇవి గూడ నణునిర్మాణములేని యవిచ్ఛిన్నద్రవ్యములనియుఁ జెప్పఁబడినవి. [2] స్థూలభూతములు పరిణామవికారములచే భిన్నవస్తూత్పత్తి హేతువులగుచున్నవి జడపదార్థము నిత్యమవస్థాపరిణామమందుచున్నది. ఇందు బాహ్యమునుండియు మార్పులు కలుగవచ్చును, బ్రహ్మాండ పరిస్పందన మున్నదని శంకరుఁడు పలికినాఁడు [3] ఈ భూతములన్నియు నచేతనము లగుటచే నవి స్వయముగాఁ బరిణామముఁబొందఁజాలవు. వానియం దంతర్యామియై యీశ్వరుఁడున్నాఁడని భావింపవలెను. [4] భిన్నభూత ప్రవృత్తులకు భిన్నదేవతలు కారణములని చెప్పినచో నందు విరోధమేమియును లేదు, ఏలన, దేవతలందరు నీశ్వరుని క్రియారూపములే

---

1) ప్రతి స్థూలవస్తువునందును, భిన్నపరిమాణములలోఁ బంచతన్మాత్రలుండును దీనినే పంచీకరణమందురు. అనగాఁ బంచతన్మాత్రలను మిశ్రమముచేయుట, స్థూలవస్తూత్పత్తియగుట శంకరుఁడు పంచీకరణమునుగూర్చి చెప్పలేదు కాని యనంతరాద్వైత ములో దీని కధికప్రాధాన్యము గలిగెను చూ: వేదాంతసారము త్రివృత్కరణమును శంకరుఁడు చెప్పియున్నాడు వాచస్పతియుదీనినిఁజెప్పెను

2) అద్వైతవేదాంతము నిరూపించిన అణువనఁగా సూక్ష్మతమమైన జడపదార్థ విభాగముగాదు. అణువనఁగా, బుద్ధిగ్రహించుటకు సాధ్యమైన అల్పతమ పదార్థ కణము

3) సర్వలోక పరిస్పందనము

4) పరమేశ్వర ఏవ తేన తేనాత్మనావతిష్ఠమానో ఽభిధ్యాయం స్తం తం వికారం సృజతి (శం. భా 2 3 13) పరిణామమున కన్నిదశలలో నీశ్వరసంకల్ప మవసరము లేదని రామానుజుఁడు భావించెను ఆకారోత్పత్తికిఁ బూర్వమొకసారియే దైవసంకల్పము కలుగును

లయమనఁగా సృష్టియొక్క అపక్రమము [1] లయకాలమందు, భూమిజలమందును జలమగ్నియందును, అగ్నివాయువునందును, వాయువాకాశమందును, ఆకాశ మీశ్వరునందును ప్రవేశించును

మనస్సు మున్నగు నింద్రియములన్నియు భూతగుణ స్వభావములు గలవేయని శంకరు నభిప్రాయము. ఇతరవస్తువులవలెనే మానవ దేహము భూమిజలాగ్నిత్రయముచేఁ గల్పితము [2] మనఃప్రాణ వాక్కులు భూమిజలాగ్నులకు వరుసగా సరిపోవును. [3] ఇవి స్థూల భూతములకు భిన్నములైనవిగావు, వానికిఁ గార్యములుగాని యవాంతరములుగాని యుత్పత్తియగునని కొందరు చెప్పువిషయమును శంకరుఁ డెఱుఁగును. ఏది యెట్లైనను, నివి భూతములవలెనే స్వయముగా నచేతనములును, భిన్నప్రయోజనములకు సాధనములుగా సృజింపఁ బడినవనియుఁ జెప్పవచ్చును జడపదార్థము పరార్థమని చెప్పఁబడెను. [4] జడప్రపంచములోఁ బ్రకృతి సమన్వభావము గలది [5]

జీవప్రకృతిలో నొక నూతననియతి మనకు గోచరించును ఇందు వస్తువులం దంతర్గతమై యొక జీవశక్తియున్నది ఈశక్తివలన నీవస్తు వులున్నత పరిణతి నొంది, యొక లక్ష్యమును సాధించుచున్నవి ఒకశిల

---

1) బ్ర. శం. భా 2,3,14 పోల్చుడు థ్యూబో. 'పంచభూతములయొక్క క్రమ పరిణామము, క్రమముగా నవి తిరిగి లయమగుటయును గూర్చిన యీ యుపదేశము యొక్క భావము మనకుఁదెలియుటకుఁ గావలసినంతవిశేషవివరణము మనకులేదు కాని, యిది ప్రకృతిశాస్త్రమునకుఁ గొంత సూక్ష్మభావము నీయవచ్చును ఘనపదార్థములు నీటిలోఁ గరఁగిపోవును నీరు వేడిమిచే నావిరియై వాయువుగా మాఱి వాయువు పైకిఁబోయిన కొలఁదియు నతిసూక్ష్మమై యాకాశముగా మాఱవచ్చును ఈ వ్యతిరేక క్రమమునవలయ నేర్పడవగును. దీని క్రమపరిణామము సృష్టి" (థ్యూబో, సిస్టమ్ ఆఫ్ వేదాంత పు.237)

2) ఛాం. ఉ. 6,2,2-3

3) శం. భా 2,4,20; 5,1,2

4) శం. గీ. భా 13-22

5) శం. భా. తై. ఉ. 2,8,

జీవించుటలేదు, ఏలన దానియందుఁ బరిపూర్ణతనొందు లక్షణములేదు, ఒక స్తంభముగాఁగాని, యొక విగ్రహముగాఁగాని మార్పునొందు నాంతరంగిక లక్ష్యముకాని, బలముకాని దానియందులేదు కాని యొక మొక్క సజీవము. దాని ననుకూలవాతావరణ మందుంచినచో నది చిగిర్చి, మొగ్గపెట్టి, పుష్పించి, ఫలించుశక్తి గలిగియున్నది. దానికిఁ జూచుటకు, వినుటకు, ననుభవించుటకు, నస్పష్టముగాఁ దాను గావలసిన భావిస్థితిని దెలిసికొనుటకు శక్తియున్నది. ఇఁకజంతు వనుకూలపరిస్థితులలోఁ బెంపొందుటేకాక, దానికనుకూలపరిస్థితులను వెదకికొను లక్షణమును గలదు. ఒక ప్రయోజనము నాశించి జంతువు చరించును, మొక్క యీపనిఁ జేయఁజాలదు, మానవుఁడింక నుత్కృష్ట జీవితమును బ్రదర్శించును శంకరుని వాక్యములలో మానవుఁడు వ్యుత్పన్నచిత్తుఁడు, సంకల్పజ్ఞాన శక్తు లాతనికిఁ గలవు. వనలతాదుల వికసించుశక్తియు, జంతువుల సంచారగ్రహణ శక్తులును, మఱియు దూరదర్శిత్వము, నిత్యానిత్య వస్తువివేకము, సదసద్విచక్షణ మున్నగు శక్తులను మానవుఁడు కలిగియున్నాఁడు సమగ్ర మనుష్యత్వసిద్ధిగాంచిన వారు దేవతలు ఈ విధముగా జీవప్రపంచములో నాలుగు వర్గములు మనకు గోచరించును, దేవతలు, మనుష్యులు, జంతువులు, వృక్షములు, [1] ఉపనిషద్భావము ననుసరించి, తరులతాదులు భోగస్థానము లనియు, నందు జీవాత్మలు తమ యసత్కర్మఫలాను భవమునకై ప్రవేశించిన వనియు శంకరుఁ డంగీకరించును, [2]

సుఖదుఃఖానుభూతి వానికిఁదెలియకున్నను, పూర్వకర్మ క్షయము వాని కగుచున్నదని చెప్పఁబడెను శంకరుఁడు సామాన్యముగా మూఁడు రకముల దేహధారులగుజీవుల నంగీకరించును. అత్యంతసుఖానుభోగము గలవారు దేవతలు, సుఖదుఃఖమిశ్రమ భాజనులగు మనుష్యులు, విశేష దుఃఖానుభవము ననుభవించు పశువర్గము [3] ఈ దేహసంబంధ మున్నంత

1) శాం॰భా 3,1,2,4
2) శాం॰భా, 3,1,24,
3) శం॰ భా॰ 2,1 34॥

కాలమును నీజీవులు ప్రాణశక్తులు సూక్ష్మశరీరములతోఁ గలసి, మోక్ష ప్రాప్తికాలమువఱకు వానివంటిపట్టుకొనియుండును అగ్నినుండి నెర సులవలెనే, జీవు లన్నియు బ్రహ్మమునుండి బహిర్గతిగాంచినవనియు, నెరసులు తిరిగి యగ్నిలోఁ బ్రవేశింపలేవుగాని, జీవులు తిరిగి బ్రహ్మ యందుఁ బ్రవేశించుననియుఁ జెప్పఁబడెను.[1]

## 35 జీవాత్మ

జీవాత్మలక్షణపరిశీలనమువలనఁ బరమాత్మైకత్వ సత్యజ్ఞానమును మనకుఁ గలిగించుటే వేదాంతమునకు లక్ష్యము. వేదాంతవాక్యములం దీయర్థములు రెండును గోచరించును.[2] స్మృతులసంబంధములు, ఇష్టానిష్టములు, నిశ్చయానిశ్చయములు మున్నగువాని సంపుటిరూపము లోని భిన్నాంశములన్నిటి నేకముగా త్రమున దర్శించుట మనకసాధ్య మైనను, దానిసామాన్యనిర్మాణము, ముఖ్యలక్షణములు మనపరిశీలన మునకు సుసాధ్యములై యున్నవి. జీవాత్మ విజ్ఞానాత్మయుఁ, బరిణాము గతమునై యుండఁగాఁ, బరమాత్మ యొక్కమార్పులకును వశముకానిదై యున్నది.[3] మూలరూపములో జీవాత్మయుఁ బరమాత్మయు నొక్కటే యని చెప్పఁబడెను 'తత్త్వమసి'[4] వ్యతిరేకలక్షణయుక్తములైన వస్తువులు సమానములుకావనునాక్షేపణయు నిస్సారమైనది, ఏలన లక్షణవ్యతిరేకత్వ మసత్యమని నిరూపింపవచ్చును."[5] సర్వానుభవ కారణభూతమైన యాత్మకును, మనమనవచ్చునట్టు 'నేను'

---

1) ముం. ఉ. 2,1,1; కౌషీ. ఉ. 3,3,4;20; బృ. ఉ. 2,1,20; బ్ర. సూ. 3,1,20–21; కఠ. ఉ. 3 3; ఛాం. ఉ. 6 2,2

2) శం. భా. 2,3,25.

3) శం. భా. 1,3,24; చూ. కఠోప. 3,1; ముం. ఉ. 3,1 1; శ్వే. ఉ. 4,6 7

4) చూ. : శ్వేతకేతునుద్దేశించి బ్రహ్మవిద్యాసిద్ధాంతము ప్రతిపత్తిడి కొక్క స్వాద యాంతరమునందు సంతర్లోకితయున్నది సర్వవాద సిద్ధాంతముల పీఠోద్ధతియొక్క సూచన దనుకొంచి పరిశీలింపఁ బడును 5) శం. భా. 4,1,3,

'వాది' యను వాక్యమున భేదమును శంకరుఁ డతిజాగరూకతతో వివరించినాఁడు. అహం ప్రత్యయవిషయము శుద్ధసాక్షియైన ఆత్మగాదు, కర్తృత్వ భోక్తృత్వాది గుణవిశిష్టమైన జీవాత్మయే. మన తత్త్వవేత్తలంతర్విలోకనవిషయమే యాత్మయనిచెప్పుదురు. పరమాత్మ శుద్ధ చిత్స్వరూపము,[1] జీవాత్మయొక్క లక్ష్యసిద్ధికై ప్రవృత్తిగలిగియున్నది. ప్రవృత్తి మనకందఱకు నిగూఢము నత్యంత సన్నిహితమునైన యనుభవము. సర్వప్రవృత్తులకు జీవాత్మయే కర్త[2] కర్తృత్వ మాత్మకు ముఖ్యస్వభావమైనచో, ఉష్ణత లేకుండ నగ్నియుండనిరీతిని, కర్తృత్వహీనమై యాత్మయుండఁజాలదు గావున దానినుండి యాత్మకు విముక్తిలేదు కర్తృత్వము దుఃఖజనకముగావున కర్తృత్వవిముక్తిఁ బొందనంతకాలము మానవుఁ డుత్తమస్థితినిఁ బొందనట్లేయగును. ఆత్మోపాధిలక్షణమే కర్తృత్వమై యుండఁగా, దాని నాత్మకారోపించుచున్నాము"[3] జీవాత్మ నిస్సంశయముగాఁ గర్తయే, లేకున్నచో, వేదవిధులన్నియు నిరర్థకములగును. ఆత్మకుఁ గర్తృత్వమును జెప్పిన యుపనిషద్వాక్యములు గలవు.[4] కర్తృత్వము నిజముగా విజ్ఞానోపాధియందేకలదు. జీవాత్మ విషయివిషయ, ఆత్మానాత్మ, స్వరూపము. వ్యక్తిత్వోపాధిగతమైన ఆత్మయే జీవి[5] అజ్ఞానసహితమైన ఆత్మయే జీవి ఇమర్సన్ భాషలో, "ప్రతి మానవుడు నీశ్వరుఁడయ్యు, మూర్ఖునిగా నటించుచున్నాఁడు[6] అవిద్యలేక తార్కికజ్ఞానము జీవాత్మయొక్క

1) శం॥ భా॥ 2,3,40 (2) శం॥ భా॥ 1,1,4

3) శం॥ భా॥ 2,3, 40 తస్మాదుపాధిధర్మాధ్యాసే నైవాత్మనః కర్తృత్వమ్ నస్వాభావికమ్ చూ॥ శంకరభాష్యకఠో ఉ॥ 3,4 ఆత్మకుఁగాని పురుషునకుఁగాని కర్తయొక్క ప్రవృత్తితో నిమిత్తములేదని అద్వైతము సాంఖ్యము నంగీకరించును. ఉపాధిసంబంధము వల నజ్ఞానవశమైనప్పుడది కర్తయనఁబడుచున్నది. ఈయజ్ఞానము నవిద్యయని అద్వైతమును, ప్రకృతియని సాంఖ్యమును చెప్పుచున్నవి

4) బృ॥ ఉ॥ 4,3,12। తై॥ ఉ॥ 3,5। శం॥ భా॥ 2,3,33

5) శం॥ భా॥ 2,3,41

6 మహేశ్వరుఁడు జీవాత్మ నొక గోపరిపాలకునిచే నవత్యజుఁడై గ్రామసీమలో పెంపబడుచున్న యొక రాజకుమారునితోఁ బోల్చెను కొంతకాలమున కారాజు, తన ని

వ్యక్తిత్వమునకుఁ గారణమై, "వంచించి వంచింపఁబడుచున్నది." జీవాత్మకు బుద్ధి సంబంధమే దాని విశిష్ట లక్షణము. పరిపూర్ణజ్ఞానముచే సంసారము నశించు నంతవఱకు నీలక్షణమట్లే యుండును.[1] మరణానంతరమునఁ గూడ జీవాత్మకు బుద్ధిసంబంధముండును అది మోక్షము చేతనే విచ్ఛిన్న మగును. సుషుప్త్యవస్థలోను, మరణావస్థయందును, నీబుద్ధిసంబంధ మవ్యక్తమై యుండి, జాగ్రదవస్థయందును, పునర్జన్మ మందును నది వ్యక్త మగును. ఈ సంబంధమున కవిచ్ఛిన్నతను మన మంగీకరించకున్నచోఁ గారణధర్మము భగ్నమగును; ఏలన నిశ్చిత కారణములేకున్నచో నేదియు నుదయించదు.[2] మరణకాలమందాత్మ విసర్జించివేయు పంచభూతమయమైన స్థూలదేహమును,[3] పంచప్రాణములను,[4] దేహబీజ రూపమగు సూక్ష్మభూతాంశపరికల్పితమైన సూక్ష్మశరీరమును[5] గలిసి మానవవ్యక్తిత్వ స్వరూప మేర్పడుచున్నది. సూక్ష్మశరీరమునందు,[6] పంచజ్ఞానేంద్రియములును, పంచకర్మేంద్రియ

---

స్వరూపమును దెలిపి, గోపాలకుల కొడికొత్తు విడిచి, తన సర్వజ్ఞత్వమును మహిమఁ జూపెను

రాజమానో స్మృతిప్రాప్తో వ్యాసభావో వివర్తకే,
యత్తైవమాత్మనోఽక్షస్య తత్త్వమస్యాదివాక్యతః।

1) శం॥ భా॥ 2,3,10

2) ఉపక్రాంతస్థితిలో బుద్ధియు నాత్మయున్నియు ఏకత్ర వందుండునని చెప్పఁబడెను; కాని జీవుడున్నియు సుషుప్తిమరణావస్థలలో బ్రహ్మమందుఁ జేరుననియుఁ జెప్పఁబడెను (ఛాందో 6,8; శం॥ భా॥ 2,3,31

3) అన్నమయకోశము

4) ఇంద్రియములు రెండు విధములు; జ్ఞానేంద్రియములు, జాగ్రదవస్థలకుఁ జెందినవి; కర్మేంద్రియములును, దర్శన కర్మలను స్వాధీన మొనర్చుకొను మనస్సును విజ్ఞానావస్థకుఁ జెందినవి. ముఖ్యప్రాణము పంచప్రాణములుగా విభాగింపఁబడును సూక్ష్మశరీరము మిక్కిలి చిన్నరూపము గలది కాని దృగ్గోచరము కాదు (శం॥ భా॥ 1 4 13)

5) సూక్ష్మశరీరము లింగశరీరము భూతాశ్రయము

6) దేహబీజాని, భూతసూక్ష్మాని

7) సాంఖ్యుల లింగశరీరమున కిది సరిపోవును

ములును, పంచప్రాణశక్తులును, మనస్సును, బుద్ధియుఁగలిసి పదునే డింద్రియము లున్నవి[1] ఈ సూక్ష్మశరీరము భౌతికమేకాని, మిక్కిలి సూక్ష్మమైన దగుటచే, దేహమును విడిచి పోవునపుడు దృగ్గోచరము కాదు. సూక్ష్మదేహమును, ప్రాణశక్తులును, మోక్షసిద్ధి కలుగువఱకు నాత్మకుసంబంధించి విడువనిదై యుండును, కర్మాశ్రయ రూపము మాత్రము ప్రతి జన్మమునందును మాఱుచుండును.[2] వ్యక్తిత్వమున కాధారము నాత్మలోఁగాని, యుపాధిలోఁగాని, చూడము. విద్యాకర్మ ప్రజ్ఞా[3] సమన్వితమైన కర్మాశ్రయమే దాని కాధారము. సంసార ముండునంత కాలము సూక్ష్మశరీరము ప్రాణశక్తులను దనతోఁ దోడ్కొని పోవును, తరులతాదిజన్మములెత్తినను నిది యాత్మననుగమించును, కాని యుద్భిజ్జన్మములలో నంతఃకరణేంద్రియములు నిద్రాణములై యుండును సంసార మనాదియగుటచే, నాత్మకీ యుపకరణసముచ్చయ మనాదిగానే కల్పితమయి యుండవలెను, మూఁడవదైన కారణశరీరము, కర్మమాత్రము ననుసరించి, జన్మాంతరములలో యాత్ర చేయుచుండు నిత్యత గలదై యున్నది. ఈ యాంతరంగిక వ్యక్తిత్వ వివరణము లన్నియు సాంఖ్యుల సిద్ధాంతమునకు సరిపడును. ఒక పంచ ప్రాణశక్తుల విషయమునదే భేదమున్నది.

పంచజ్ఞానేంద్రియములును, మనస్సుత్తృతీయైనవియు[4] సూక్ష్మములును, పరిచ్ఛిన్నములునై యున్నవి. అవి పరమాణు తుల్యములు కావు, అయినచో, నవి శరీరమంతయు వ్యాపించి యుం డుట కవకాశముండదు. అవి సూక్ష్మరూపములు గలవి, స్థూలము లైనచో మరణానంతరమవి దేహమును విడిచిపోవునపుడు కానిపింప వలెను. అవి పరిమితపరిమాణముగలవి; అట్లుకాక సర్వవ్యాప్తము

1) కర్తృత్వభోక్తృత్వవిశిష్ట ఊహాపోహనోమయాది శుభకోశవిశిష్ట అచేతనధర్మితలఁ బరిచేయును. (శం॥ భా॥ బృ। అ। బ్రా। 1, 4, 17)

2) శం। భా। 2,4-8-12; డ్యూసెన్ సిస్టమ్ ఆఫ్ వేదాంత (పు 3256.)

3) బృ। వ్యా। అ। బ్రా। 4, 4, 2.

4) శం। భా। 2,4, 1-4

త్రివలో, నవి దేహము విడిచిపోవుటగాని, తిరిగి దేహమునఁ బ్రవేశించుటగాని యుండదు. శంకరుఁడిచ్చిన వివరణములో నింద్రియ ప్రవృత్తులను గూర్చియే కాని, వాని భౌతికభాగములను గూర్చి ప్రసంగించియే యుండలేదు. ఇంద్రియము లన్నియు నవి యాక్రమించు స్థానముల పరిమాణములనే గలిగియున్నవి.[1] ఈ వివిధేంద్రియములు వివిధభూతములనుండి వచ్చినవనియు, నీ వివిధభూతాధిదైవతములే యింద్రియాధిదైవతములనియుఁ జెప్పఁబడెను.[2] ముఖ్యప్రాణమే జీవితమంతకును చైతన్యమిచ్చు నడపుశక్తి. మానసికయంత్రమంతయు దానిపై నాధారపడియున్నది. ముఖ్యప్రాణమే యింద్రియములనుగూడఁ బోషించునదికావున, నవియుఁ బ్రాణములని చెప్పఁబడెను.[3] ఉపాధిగతమైన యాత్మయే జీవుఁడు, జీవునకే కర్తృత్వభోక్తృత్వము లున్నవిగాని యాత్మకులేవు.[4]

జీవుఁడే దేహేంద్రియాధిపతియై, కర్మఫలసంగియై యున్నాఁడు. ఆత్మయే జీవుని మూలరూపము గావున దానికి విభుత్వమున్నదనియు నణుత్వముకాదనియుఁ జెప్పఁబడెను. దాని కణుపరిమాణమున్నచో, దేహమంతయు వ్యాపించు వేదనాజ్ఞానముండఁజాలదు.[5]

---

1) శం॥ భా॥ 2,4,8–13

2) శం॥ భా॥ 2, 4. 14–16; బృ॥ ఉ॥ భా॥ 1, 3, 11; 3, 2, 23; ఛాం॥ భా॥ 1, 2, 4.

3) శం॥ భా॥ 2, 4, 6,

4) పరంబ్రహ్మ ..అపహతపాప్మత్వాదిధర్మకమ్, తదేవజీవస్య పారమార్థికం స్వరూపమ్ ..ఇతరాదుపాధికల్పితమ్ (శం॥ భా॥ 1. 3. 19) ఇట్టి భావమునే ప్లేటో గ్లాకస్ సముద్రగర్భమున మునుగు నుదాహరణమిచ్చినాఁడు సముద్రములో నాతనిఁ జూచినచో నాతనిని మనము గుర్తింపలేము; ఏలన సముద్రములోని నాచు, [illegible] జాలము నాతని నావృతించినవి ప్రతి జీవాత్మయు స్వస్వరూపమును గోల్పోయిన పరమాత్మయే సంసారసంబంధమగు వస్తుగుల్లలు, నాచు మున్నగువాని పాశములనుండి దానిని విడిపింపవలెను

5) శం॥ భా॥ 2,3,29
భా. 8—8

జీవ మణుపరిమాణము కలదని వాదించువారు చెప్పునదేమనఁగా, నదియొక దేహమును విడిచి వేఱొక దేహమును బొందుచుండుటచేతను, సర్వవ్యాప్తమైనచో నట్లు రాకపోక లుండవు కావునను జీవమణుస్వరూపము గలదని వాదింతురు. ఈ రాకపోక లుపాధులకేగాని యాత్మకు లేవని శంకరునివాదము.[1] అణుపరిమాణమే జీవున కుండుట నిజమైనచో, దేహమంతయు వ్యాపించియున్న వేదనలను గ్రహించుట సాధ్యము కాదను వాదమునకు సమాధానముగా, చందనస్పర్శ దేహమునకొక చోటనే తగిలినను, దేహమంతయు దాని పరిమళము వ్యాపించు రీతిగానే, జీవుఁడణుమాత్రుఁడైనను దేహమంతయు వ్యాపింపఁగలఁడని చెప్పఁబడెను. పాదమున కొక ముల్లు గ్రుచ్చుకొన్నప్పుడు నొప్పి గ్రుచ్చుకొనినచోటనే యున్నను, క్లేశానుభవము దేహమంతయు ననుభవించుచుండుటచే జీవమణుస్వరూపము గాదని శంకరుఁడు బదులు చెప్పెను. ఒక గదిలో నుంచిన దీపముయొక్క కాంతి గదియంతయు వ్యాపించురీతినే, జీవ మణురూపమైనను, దేహమంతయు జీవ చైతన్యమాక్రమించునని జీవాణుత్వవాదులు పలికినారు. గుణమునకు ద్రవ్యాంతరవ్యాప్తిలేదని శంకరుఁడు చెప్పినాఁడు. దీపమునకు దాని కాంతికిని ద్రవ్యగుణసంబంధములేదు. రెండు నగ్నిరూపములే. దీపమం దగ్నిరేణువు లత్యంత సన్నిహితములై యున్నవి, కాంతియం దవి దూరముగా వేరుపడియున్నవి. జీవుని చైతన్యగుణము దేహమంతయు వ్యాపించియున్నచో, జీవమణుపరిమాణముగలది కాఁజాలదు. ఉపనిషద్వాక్యములలోఁ జెప్పఁబడిన యణుపరిమాణ మాత్మలక్షణముగాఁ జెప్పఁబడలేదు; చిత్తబుద్ధి కల్పితమగు జీవునికే చెప్పఁబడెను.[2] అణువనఁగా బుద్ధి కగ్రాహ్యమైన సూక్ష్మరూపము గలదనియే దాని యభిప్రాయము.[3] చిత్తాద్యుపాధి బద్ధమగు జీవాత్మ సర్వవ్యాప్తము గాదనియుఁ బరమాత్మ శక్తి సర్వవ్యాపిత్వ మున్నదనియు నంగీకరింపఁబడెను.[4]

---

1) శం, భా, 2. 3, 29
2) ముండ॥ ఉ॥ 3, 19; శ్వే॥ అ॥ ఉ॥ 5 8-9
3) శం॥ భా॥ 2,3, 29
4) శం॥ భా॥ 2,3, 19-32

వ్యావహారిక బుద్ధియుక్తమైనదగుటచే జీవాత్మ కణుత్వము చెప్పఁబడెను.[1] ఆత్మకు నిలయము హృదయమేయని చెప్పిన వాక్యముల కర్థమేమన, బుద్ధి స్థానములో జీవాత్మ యున్నదనియే. మఱియు సర్వత్ర వ్యాపించు శక్తిగల దేక దేశమున నుండుటకు సాధ్యపడుటేకాని, యేకదేశవ్యాప్తిమాత్రమే గలది సర్వత్రవ్యాపించుట కవకాశములేదు.[2] ఆత్మకుఁ బరిమితపరిమాణమును జెప్పిన యుపనిషద్వాక్యముల కన్నిటికి నీరీతిగానే శంకరుఁ డర్థమును వివరించినాఁడు.[3] మతవిధి విధాన మంతయు జీవాత్మ వ్యావహారికముగా నిజమను నిశ్చయముపై నాధారపడియున్నది. విధి నిషేధాత్మక ధర్మములతోఁగూడి, పాపపుణ్యనిర్ణయము చేయు శ్రుతి స్మృతి ధర్మశాస్త్రమంతయు దేహేంద్రియాద్యుపాధి పరికల్పితమగు జీవాత్మయే నిజమగు నాత్మయను నిశ్చయము నంగీకరించియున్నది. సంసార మహానాటకరంగమున నాతఁడే నవ్వుచు నాతఁడే యేడ్చుచు సుఖదుఃఖాది సర్వానుభవములను బొందుచుండుట దాత్మకాదనియు నాత్మయని మనము భ్రమించు జీవాత్మయనియుఁ జెప్పఁబడెను. ఉపాధి నిర్ముక్తమగునంతకు నాత్మకు సుఖదుఃఖాది సంగతియు, పృథగ్వ్యక్తిత్వమును నుండక తప్పదు.

ఆత్మకుఁగల భిన్నదశలను శంకరుఁడు వివరించినాఁడు. జాగ్రదవస్థలో, జ్ఞానేంద్రియము లన్నియుఁ బనిచేయుచుండుటచే, మనము వస్తుజ్ఞానమును మనస్సుచేతను నింద్రియములచేతను గాంచుచున్నాము. స్వప్నావస్థలో నింద్రియములు విరతినొంది, మనస్సొక్కటే ప్రవృత్తిలో నుండును. జాగ్రదవస్థలోఁ గలిగిన యింద్రియానుభవ సంస్కారముల వలన మనస్సు స్వప్నములో విషయములను గ్రహించును. స్వప్నము ననుభవించు నాత్మయుఁ బరమాత్మగాదు; ఉపాధిగతమైన జీవాత్మయే. అందువలననే, స్వప్నములో మనయిచ్చవచ్చిన దానిని

1) 2,3,29.

2) శాం॥భా 2,1,3,3,3,2,4

3) ఛాం॥శాం॥భా14-18:1,2,11-12.

4) వివేకవిజ్ఞానము.

సృజింపలేకున్నాము. అట్లు చేయఁగలిగినచో, నెవ్వనికి దుస్స్వప్నములే యుండవు.[1] గాఢనిద్రలో నింద్రియ మానసములు విరతినొంది, యాత్మ తన స్వస్వరూపములో మగ్నమై, సహజ స్థితినొందును. జీవాత్మావిచ్ఛిన్నతకుఁ గర్మావిచ్ఛిన్నతయే కారణమని శంకరుఁడు వచించెను. మఱియు స్మృతియున్నది. ఆత్మానుస్మరణము వలన నిద్రనొందిన యాత్మయే మేల్కాంచినదని నిరూపితమగుచున్నది. శ్రుతి దీనిని సమర్థించుచున్నది; అట్లు కాకున్నచో నాత్మ కవిచ్ఛిన్నతపోయి శ్రుతివాక్యములకు వ్యర్థత సంభవించును. "ఎ" యను వాఁడొకఁడు నిద్రించి "బి" రూపమున మేలుకనినచో, నాతని కర్మావిచ్ఛిన్నత నశించును. ముక్తపురుషులు మేల్కొనవచ్చును. గాఢనిద్రయందును, మరణమందువలెనే, వ్యక్తిత్వబీజము పోషింపఁబడినదని స్పష్టము. దీనికి వ్యతిరేకముగా నెన్ని వ్యర్థవాదములు చెప్పినను, సుషుప్తిలోఁగూడ జీవుని బంధించునుపాధి బీజరూపమున నున్నదని యంగీకరింపఁబడెను. మోక్షావస్థలో స్వప్నమందుఁ గూడఁ బృథగ్వ్యక్తిత్వ బీజము పూర్తిగా నశించినచో, మేల్కాంచుటకు వలయు నవిద్యాబీజ మెచటనున్నది? మోక్షమునందు బ్రహ్మముతో శాశ్వతైక్యము కలుగుననియు, నిద్రావస్థలోఁ దాత్కాలికైక్యము కలుగుననియు శంకరుఁడు వివరించినాఁడు. "సుషుప్తిలో నుపాధి మిగిలియుండుటచే, మెలకువ కలుగుటతో జీవాత్మ తిరిగివచ్చుచున్నది."[2] మోక్షావస్థలో నవిద్యాబీజములన్నియు భస్మములగును.[3]

మూర్ఛావస్థయొక్క ప్రత్యేకదశ, అది జాగ్రదవస్థకాదు. ఏలన విషయజ్ఞానములేదు. విషయాంతరైకాగ్రతచే నిట్టి బాహ్యవస్తువుయెడ నుదాసీనత కలిగియుండలేదు. అది స్వప్నావస్థకు భిన్నమైనదేలన, నీయవస్థాస్మృతిజ్ఞానముండుట లేదు, మరణమునకు భిన్నమైనదేలన, దేహమునఁ బ్రాణము నిలిచియున్నది; సుషుప్తికి భిన్నమైనదేలన, దేహమం దశాంతియున్నది. సుషుప్తగతుని లేపినంత సులభ

---

1) శం,భా,4,2,6 (2) శం।భా,3,2,౧

3) మా,శం,భా, గౌడపాదకారిక 3,14.

ముగా మూర్ఛాగతుని మేల్కొనఁజేయుటేమి అందుచే మూర్ఛావస్థ సుషుప్తిమరణముల మధ్యావస్థయని చెప్పఁబడెను. మూర్ఛావస్థ మరణావస్థకుఁ జెందును, ఏలన నది మరణద్వారము। "కర్మ శేషమేమైన నున్నయెడల, వాక్కును, మనస్సును మూర్ఛితునకుఁ దిరిగివచ్చును, లేకున్నచోఁ బ్రాణము నుష్ణము నాతనినుండి తొలఁగిపోవును." [1]

నిజమునకుఁ బ్రతిమానవుఁడు నిరవయవ నిర్వికార పరబ్రహ్మస్వరూపమేయైనను, మనమాత్మ పుట్టుననియుఁ మృతి నొందుననియుఁ బలుకుచుందుము. ఉపాధి జన్మమరణములను మనమాత్మ కారోపింతుము. [2] సృష్టిలోని జీవులకుపాధులే వ్యక్తిత్వము నారోపించు కారణములై యున్నవి. [3] జీవునాయుర్వర్ష దేహాదులన్నిటి నుపాధులే నిర్ణయించును. [4] ఉపాధి భేదము చేతనే జీవభేదము నేర్పడి, కర్మల కర్మఫలముల నీజీవులకుఁ జెందువనువిషయములో వ్యత్యయము కలుగుటలేదు. [5] జలగతమైన సూర్యబింబము వంటిదే జీవాత్మయని చెప్పినను, దానివలన జీవుల భిన్నవ్యక్తిత్వములకు లోపమురాదు. [6]

## 36_సాక్షి_జీవుఁడు

ప్రతి జీవాత్మయందును జ్ఞానేచ్ఛాక్రియా శక్తులేగాక, సాక్షిరూపమగు నంతరాత్మయు నున్నది. బాహ్యజ్ఞానము సాక్షి యనియు, దాని కంతఃకరణ ముపాధియనియు దాని సాహాయ్యమున వస్తువులను

1) శం।భా। 3,2,10
2) శం।భా। 2,3,17.
3) శం।భా। 3:2,9.
4) సురేశ్వర వార్తికము, పు. 110 113.
5) శం।భా। 2,3,49
6) "సూర్యుని ప్రతిబింబమొకటి కదలుచుండినప్పుడు గాని, యుండుటచే వేఱొక ప్రతిబింబమును గదల నవసరములేదు అట్లే యొక జీవాత్మకుఁగల కర్మలతోడను, కర్మఫలములతోడను వేఱొక జీవాత్మకు సంబంధముండవలసినవసరములేదు" (శం।భా। 2,3,50.)

ప్రకాశింపఁజేయునదియుఁ జెప్ప నగును. అంతఃకరణోపాధియే పరమాత్మను సాక్షిగాఁ ప్రదర్శించును. వస్తుజ్ఞానముతో నీసాక్షిచైతన్యము గోచరించును గాని, యది వస్తుజ్ఞానమునకుఁ బూర్వమే గలదు. అంతఃకరణ మొక వ్యక్తియందుఁ బ్రవేశించి, వ్యక్తిలో నొక ముఖ్యభాగ మగుట వలననే మనకు జీవుఁడేర్పడును.

జీవసాక్షుల సంబంధమెట్టిది? అర్వాచీనాద్వైతగ్రంథములలో భిన్న నిర్వచనములు చెప్పఁబడెను. స్థూలసూక్ష్మ దేహములకు మూలాధారమై వానితో సంగత్వములేకుండ వాని కార్యముల సన్నిధి నవలోకించుచు తానెన్నఁడు మార్పునొందకుండునది సాక్షియని విద్యారణ్యుఁడు చెప్పినాఁడు. [1]భోక్తయగు జీవాత్మయొక్క ప్రవృత్తి విరతినొందినప్పుడు సూక్ష్మస్థూలదేహములను ప్రకాశింపఁజేయునది సాక్షియే. తన సహచరులుగా గోచరించు నీ రెండు దేహముల నెల్లప్పుడు సాక్షి చూచుచుండును. జీవిత వ్యాపారములఁ బాల్గొను జీవుఁడు సాక్షిగాదని విద్యారణ్యుని నిశ్చయము. సాక్ష్యాత్మ నిర్గుణమైన దనియుఁ గర్మఫలభోక్తృత్వము లేని కేవల సాక్షి మాత్ర మనియు నుపనిషత్తు చెప్పుచున్నది.[2] నాటకరంగవేదికపైనుండి తన కాంతిచే, రంగనాయకుని, నటిని, సభను గూడ సమానముగాఁ బ్రకాశింపఁజేయు దీపముతో విద్యారణ్యుఁ డింకొకచోటఁ బోల్చియున్నాఁడు, వీరెవ్వరు లేకున్నను దీపము వెలుఁగుచునేయుండును. [3]సాక్షిరూపమగు నాత్మ, జీవుని, యంతఃకరణమును బాహ్యవస్తువులనుగూడఁ బ్రకాశింపఁజేయుచు నవి సుషుప్తికాలములో లేనప్పుడును—సమానముగానే ప్రకాశించునని చెప్పుట కీయుపమాన మియ్యఁబడినది. [4]సాక్షి, నిష్క్రియత్వముచే నీశ్వరునుండి భేదించును.

---

1) పంచదశి 8 అ॥ సిద్ధాంతలేశము 1 అ, లో విద్యారణ్యునభిప్రాయము నిట్లు వర్ణించినది, "దేహద్వయాధిష్ఠానభూతమ్, కూటస్థచైతన్యం, స్వావచ్ఛేదకస్య, దేహద్వయస్య, సాక్షాదీక్షణాత్ నిర్వికారత్వాత్ సాక్షీత్యుచ్యతే, ॥

2) శ్వే॥ "సాక్షీ, చేతా, కేవలో నిర్గుణశ్చ (శ్వే॥ 6॥11)

3) "నృత్యశాలాస్థితోదీపః ప్రభుం సభ్యాంశ్చ నర్తకీమ్, దీపయేదవిశేషేణ తదభావేఽపిదీప్యతే।" (పంచదశి, 10,12

4) పంచదశి, 10, 12

సర్వ జీవాత్మయుఁ బరమాత్మయు నగు శుద్ధబ్రహ్మమే సాక్షియనియు, నది ప్రతి జీవాత్మకు కూటస్థమైన దగుటచే, ననేకముగాఁ దోఁచుచున్న దనియు తత్త్వప్రదీపికలోఁ జెప్పఁబడెను. సాక్షి నిర్గుణమని చెప్పుటచే సగుణబ్రహ్మయైన యీశ్వరుఁడనుటకు వీలులేదు. కర్మకుఁ గర్మఫలమునకుఁ గర్తయు భోక్తయునైన జీవుఁడును సాక్షికాఁజాలఁడు. [1] పంచదశీ తత్త్వప్రదీపికా భావమును శంకరుఁ డంగీకరించినాఁడు.

ఈశ్వరుని విశిష్టరూపమే సాక్షి యని కౌముది చెప్పుచున్నది. ఈశ్వరుఁడు సాక్షి యని చెప్పు శ్వేతాశ్వతరోపనిష ద్వాక్యముపై నీ గ్రంథకర్త యాధారపడి యిట్లు చెప్పినాఁడు ఈశ్వరుఁడు జీవప్రవృత్తి నివృత్తుల నెఱిఁగియుండియు, వానిచే నాతఁడుచలింపఁడు. [2] జీవునిలో నుండి యాతని యవిద్యాదుల నన్నిటి నాతఁడు ప్రకాశింపఁజేయును. మన ష్తిలోపలి సకల ప్రవృత్తులు విరతి నొందినపుడు సాక్షినే ప్రాజ్ఞుఁ డందురు [3]. తత్త్వశుద్ధికర్త దీని నంగీకరించును. ఈశ్వరుఁడు సాక్షి యనునది వ్యావహారికదృష్టికి గోచరించు ప్రథమభావము. ఈ భావమును శంకరుఁడు తన రచనలలోఁ బోషించినాఁడు. ఒకే వృక్షముపై నున్న రెండు పక్షులనుగూర్చిన సుప్రసిద్ధమైన ఉపనిషద్వాక్యమును గూర్చి [4] శంకరుఁడు భాష్యము వ్రాయుచు నిట్లు చెప్పెను "చెట్టుపై నున్న రెండుపక్షులలో నొకటి క్షేత్రజ్ఞుఁడు, ఇది సూక్ష్మ శరీరములోఁ బ్రవేశించి, యజ్ఞానవశమున, ననేక రుచులతోఁ గూడిన సుఖదుఃఖాత్మక కర్మఫలముల నాస్వాదించుచున్నది. రెండవపక్షి, నిత్యశుద్ధ బుద్ధస్వభావుఁడు, సత్త్వగుణసంపూర్ణుఁడు నగు నీశ్వరుఁడు, ఫలములను దినఁడు;

---

1) తత్త్వప్రదీపికాయాం అపి, మాయాశబలే, సగుణే, పరమేశ్వరే 'కేవలో నిర్గుణశ్చ' ఇతి విశేషణానుపపత్తేః సర్వప్రత్యగ్భూతం, విశుద్ధం, విశుద్ధం బ్రహ్మ, జీవాద్భేదేన సాక్షి ప్రతిపాద్యం ఇత్యుదితం (సిద్ధాంతలేశం 1)

2) పరమేశ్వర స్యైవరూపభేదః కశ్చిజ్జీవప్రవృత్తినివృత్త్యోరనురుంధా స్వయముదాసీనస్సాక్షీనామ। (సిద్ధాంతలేశము, 1 )

3) మా। వైశేషికసూత్రము 1। 3, 42

4) ముం। ఉ। 3, 1,1

ఏలన, భోక్తృభోగ్యముల రెంటిని భాసించువాఁ డాతఁడే. "ఒక సర్వభావముని విషయములోనలెనె, యాతని చూపే భాసకతుల్యమైనది."[1]

అవిద్యోపాధిగతుఁ డగు జీవుఁడే సాక్షి యని మఱికొందరు భావించిరి. ఏలన, నాతఁడు సాక్షిమాత్రుఁడేకాని కర్తగాఁడు. అజ్ఞాన వశమున నాతఁ డంతఃకరణముతోఁ దాదాత్మ్యభావము నొందినపుడే కర్తయు భోక్తయు నగును. దీని కాక్షేపణ యిట్లు చెప్పఁబడెను, సర్వవ్యాప్త మగు నవిద్యయే సాక్షిరూప జీవనోపాధియైనచో నన్నిఁడా జీవుఁడు తన మనస్సువేశాక సర్వజీవ మానసములను ప్రకాశింపఁజేయ వలెను. కాని యిట్లు జరుగుటలేదు. కావున, నంతఃకరణోపాధిసహితు డగు జీవుఁడే సాక్షిరూపమగు నాత్మ. అందుచే భిన్నవ్యక్తులలో నిది భిన్నమైయుండును. సుషుప్త్యవస్థలో నిది సూక్ష్మరూపమునుండు నని చెప్పఁబడుటచే నది మూఁ డవస్థలలోనుండును. జీవాత్మకును, సాక్షిరూపమగు నాత్మకును భేదమేమనఁగా, నంతఃకరణము జీవాత్మకు గుణమై యుండఁగా, సాక్షిరూపమగు నాత్మ కది యుపాధియగు చున్నది.[2] వేదాంతపరిభాషా నిశ్చయము నిదియే; ఇతర భావలతో దీనికి విరోధముఁలేదు; ఏలనఁ బరమాత్మ పృథగ్వ్యక్తిలో వర్తించు నపుడు సాక్షియనఁబడును. పరమాత్మయే వ్యక్తిగతమై వర్తించు నపుడు జీవసాక్షియనియు, సర్వజగత్తునందు వర్తించునపు డీశ్వరసాక్షి యనియుఁ బేర్కొనఁబడెను. భిన్నోపాధులే యీ భిన్ననామములకుఁ గారణము. జీవసాక్షి కుపాధియంతఃకరణము, శరీరము మున్నగు నవియు, నీశ్వరసాక్షి కుపాధి సర్వసృష్టియునై యున్నది. విశ్వాత్మ యీశ్వరుఁడును, వ్యక్తిగతాత్మ జీవుఁడునై యున్నాఁడు.

---

1) పశ్యతేవతేరలం దర్శనమాత్రేణాహ తస్యాప్రేరయితృత్వం రాజవత్ (శం|భా| ఛా| 3,1,1.

2) అంతఃకరణోపాధానేచ్ఛిన్నస్సాక్షీ...అంతఃకరణ విశిష్టః ప్రమాతా (సిద్ధాంతలేశము, 1)

## 37—ఆత్మ జీవుఁడు

మనము ద్రవ్యత్వమునుగాని నిరవయవత్వమునుగాని జీవాత్మకు లక్షణములని చెప్పఁజాలము. అది యణువు గాదు. భిన్నాంశముల సముచ్చయము. దేహాద్యుపాధిపరికల్పితమగు నొక విశిష్టకేంద్రమున జరిగిన భిన్నానుభవముల సమన్వయ స్వరూపమే జీవాత్మ యైయున్నది. దేహేంద్రియాదు లియనుభవమునందుఁ బాల్గొని, యేకత్వావిచ్ఛిన్నత్వములను గూర్చును. దేహాదులతో బద్ధమైన యీ చైతన్యము పరిచ్ఛిన్నమైనది. దీని యనుభవములో శరీరావస్థాద్యంశములు భాగములై యున్నవి. శరీరము క్రమముగాఁ బెంపొందునట్లే, జీవవిజ్ఞానమును గ్రమముగా వికసించును. జీవాత్మ తన విజ్ఞానమునకుఁ దానే కారణముకాదు. కాలగతమై పరిణామమునందుచున్న వ్యావహారిక విజ్ఞానముచేఁ గల్పితమైన యేకత్వానుభవమే జీవాత్మయై యున్నది. అదియొక బుద్ధి భావకల్పితమైన స్వరూపము [1] అది యొకేవ్యక్తిలోఁ బరివర్తనమందుచుండునదగుటచే నిర్వికారమగు పరమాత్మస్వరూపము గాదు. సర్వజీవాత్మాధారభూతమగు నాత్మ నిర్వికారము. నిశ్చంచలమునైనది.

బుద్ధి కగమ్యమైనను, నిత్యసాక్షియైయుండి, జీవానుభవ సంసర్గమెంతమాత్రమును లేనిదే యాత్మ. నిత్యసాక్షి స్వరూపమగు నాత్మ మనఃప్రవృత్తి విహారమునకు వెనుకనున్న తెరవంటిది. ఈ మనఃప్రవృత్తు లాత్మనుండి యుద్భవించునని చెప్పరాదు; ఏలన, సత్య స్వరూపము, కానుగాని వస్తువులని యూహింపఁబడుటచే సంగత్వ దోషము నొందునది కాదు. మనము వేరొక రూపమున వర్ణముచేసి కొంటిమిగదాయని వస్తువుల మార్పునొందవు. నిర్వికారమగు నాత్మ యెట్లు వికారము నొందును? నిత్యమైన జ్ఞానజ్యోతి కేబాహ్యకారణముచేఁగాని తమస్సంపర్క మెట్లు కలుగఁ గలదు?; ఏలన నది సర్వసంగ వివర్జితము. నత్తెట్లగునను ప్రాచీన సమస్యయే యిది దేహేంద్రియ

---

1) చూడు : డా॥ సైకలాజికల్ ప్రిన్సిపుల్సు పే 361-382.

మనోవిషయాద్యుపాధి సంబంధము వలననే, యాత్మ కనిత్య జీవాత్మ భావము కలిగినది. కాని యాత్మకును, జీవాత్మకునుగల సంబంధము మాయ యనియు నసంగా ననిర్వచనీయమని చెప్పఁబడెను. ఆత్మయే నిత్యముక్త, శుద్ధ మోక్షస్వరూపము నైనచో, నది జీవాత్మరూపములో నెట్లు కాంక్ష ప్రవృత్తులను గలిగియుండును? "స్వయముగా నసంగమయ్యు నాకాశవస్తు వితర వస్తువులం జలింపఁజేయవచ్చు"నని సమాధానము చెప్పంబడెను. సూదంటురాయి తాను గదలకుండ నినుపముక్కలను జలింపఁ జేయును.[1] జీవపరమాత్మలకు సంబంధమును చెప్పునపుడు మనకు వ్యావహారిక ప్రమాణములే గతియైయున్నవి. కాని యీ వ్యావహారిక ప్రమాణము లాసంబంధమును చెప్పుటకు సమర్థములు గావు.

ఆశ్మరథ్యుఁడు, ఔడులోమి, కాశకృత్స్నుఁడు మున్నగువారు జీవబ్రహ్మసంబంధమును గూర్చి బ్రహ్మసూత్రములోఁ బేర్కొనిన విభిన్న భావములను శంకరుఁడు సమీక్షచేసినాఁడు. నిప్పునకు నెరసులకు గల సంబంధమే జీవబ్రహ్మ సంబంధ మని వచించు నుపనిషద్వాక్యము నాశ్మరథ్యుఁ డాధారముగాఁ దీసికొనెను. నిప్పునుండి బయల్వెడలు నెరసు లానిప్పునకు భిన్నములుగావు, ఏలన రెంటికి నేకస్వభావము గలదు. కాని నిప్పునకు నెరసులకు నసలే భేదము లేకపోలేదు, ఏమియు భేదము లేకున్నచో నెరసులు వేఱుగాఁ దెలియనే తెలియఁ బడవు, వానిలో వానికి భేదమును దెలియుదు. కావున జీవులు పరమాత్మ నుండి పూర్తిగా భిన్నములు గావు, ఏలన భిన్నము లైనచో వానికి విలక్షణ మేమియు నుండరాదు, అవి పూర్తిగా నభిన్నములునుగా నయినచో, వానికిని బ్రహ్మకును, వానిలో వానికిని భేదమే యుండదు. అందువలన జీవాత్మలు పరబ్రహ్మమునుండి భిన్నములు నభిన్నము కూడ నగుచున్నవని యాశ్మరథ్యుఁడు నిర్ణయించెను.[2] దేహబద్ధం యాద్యుపాధిబద్ధమైన జీవాత్మ బ్రహ్మమునుండి భిన్నమనిఁ

1) శాం॥ భా॥ 2,2,2,

2) శాం, భా॥ 1,4,20

వల్లయ్యు, జ్ఞానధ్యానాది సాధనములచే నది యుపాధినిర్ముక్తమై బ్రహ్మైక్యము నొందుననియు నొకులేమి నిశ్చయించెను. బద్ధమైన జీవాత్మ బ్రహ్మమునుండి పూర్తిగా భిన్నమనియు, ముక్తాత్మ పూర్తిగా బ్రహ్మమే యనియు నాతఁ డంగీకరించినాఁడు.[1] శంకరుఁడు కాశకృత్స్నుని భావముతో నేకీభవించెను.[2]

రామానుజుఁడు తలంచినట్లు జీవాత్మ బ్రహ్మములో నొక భాగము కాఁజాలదు; ఏలన, బ్రహ్మము దేశకాలాతీత మగుటచే విభాగములు లేనిది. మధ్వాచార్యుఁడు భావించిన రీతిగా జీవాత్మబ్రహ్మ భిన్నము గాదేలన, బ్రహ్మ మద్వితీయము నేకము సర్వమయము నైనది.[3] వల్లభాచార్యుఁ డూహించిన విధమున, జీవాత్మ బ్రహ్మముయొక్క వికారమును గాదు; ఏలన బ్రహ్మము నిర్వికారమైనది. సృష్టి క్రమమును తెప్పిన వేదము అగ్న్యాదిభూత సృష్టినే చెప్పినదిగాని, ఆత్మ సృజింపఁబడెనని చెప్పి యుండలేదు గావున, జీవాత్మ యీశ్వరుని సృష్టిగాదు. జీవాత్మ పరమాత్మనుండి, భిన్నమునుగాదు, దానిభాగమునుగాదు వికారమును గాదు జీవాత్మయే పరమాత్మ. ఉపాధి పరిచ్ఛిన్న మగుటచే దాని స్వభావమును గుర్తింపలేకున్నాము.[4] అది పరమాత్మ. స్వరూపమే కాకున్నచో, జీవమోక్షమును తెప్పు శ్రుతివాక్యములు నిరర్థకము లగును. ఆత్మైకత్వ్య ముపదేశమును గూర్చి శంకరుఁ డిట్లు చెప్పినాఁడు. "జీవాత్మ పరమాత్మనుండి భిన్నమైనచోఁ, పరమాత్మ జ్ఞానము వలన జీవాత్మ జ్ఞానము లభింపదని చెప్పవలసి వచ్చుటచేఁ, పరమార్థ స్వరూపము నొక్కదానినిఁ దెలిసికొన్నచో సర్వము విదితమగునని చెప్పిన యుపనిషద్వాక్యము వ్యర్థమగును."[5] తైత్తిరీయోపనిష ద్భాష్యములో శంకరుఁ డిట్లు చెప్పినాఁడు. "ఒక వస్తువునకుఁ దనకు భిన్నమైన

1) శాం।భా 14,21,
2) శాం।భా 1 4,22,
3) శాం, భా 4,3,14,
4) భా,శాం,బ్ర,సూ,భా, 2,2,1, తై,భా,2,2,1,
5) శాం।భా 1,4 20

దానితో నేకత్వ మెన్నటికి సాధ్యముకాదు." [1] బ్రహ్మవేత్త బ్రహ్మయే యగునని చెప్పిన యుపనిష ద్వాక్యముల వలన జీవుఁడే బ్రహ్మమని చెప్పబడుచున్నది.

తాత్త్వికముగా జీవాత్మపరమాత్మైకత్వము నంగీకరింపవచ్చును. కాని యా జీవాత్మ స్వస్వరూపజ్ఞాన మనుభూత మగునంతకు జీవబ్రహ్మ సంబంధ సమస్య పరిష్కృతముకాదు. ఉపాధి భారములచే మన జీవాత్మలు క్రుంగి ప్రవృత్తి పరము లగుచున్నవి. [2] జీవాత్మ పరమాత్మ సంబంధమును దర్కముచే నిర్ణయింపఁజాలమని యెఱిఁగియుండియు ననంతరాద్వైతములో సిద్ధాంతములుగా రచింపఁబడిన కొన్ని యుపమానములను శంకరుఁడు సూచించినాఁడు.

ఒక ఐర్లండు దేశీయు ననంతదేశమును నిర్వచింపు మని యడుగగా నాతఁడిట్లు వచించెనని చెప్పుదురు: "పై భాగము క్రిందిభాగము, నలుపైపుల తలుపులు పీకివేసిన పెట్టె వలెనున్నది." తలుపులు మున్నగు నావరణములచే బద్ధమైన పెట్టె యనంతమగు దేశముకాని రీతినే, బుద్ధీంద్రియాది బద్ధములగు జీవులు బ్రహ్మముగాదు. మన పరిచ్ఛిన్నజీవముల కూర్ధ్వాధో భాగములను, నలుదెసలఁ గల యాచ్ఛాదనములను నిర్మూలించినచో, మనము బ్రహ్మముతో నేకమగుదుము. అనచ్ఛేద్యానచ్ఛేదకసూత్ర ముపయోగింపఁబడినది. [3] అఖండాకాశ ఘటాకాశ సంబంధము నుపయోగించి, శంకరుఁడు జీవబ్రహ్మసంబంధమును సూచించినాఁడు. ఘటాద్యుపాధులను భగ్నమొనర్చినచో, నవచ్ఛిన్నాకాశములు మహాకాశములోఁ గలిసిపోవును. అదేవిధముగా, దేశకాల

1) శం॥భా॥ తై॥ ఉ॥ 2,8,16.

2) "సాన్నిధ్యముచే నాత్మను దనలోఁ బ్రతిబింబింప నహంకారమే జ్ఞాతయన్నచో రామానుజుఁడిట్లు ప్రశ్నించినాఁడు: "ఆత్మ అహంకారమునఁ బ్రతిబింబించునా? లేక అహంకార మాత్మలోఁ బ్రతిబింబించునా? ఆత్మ కర్త కాదనుటచే నది ప్రతిబింబింపదు అట్లే యచేతనమగు నహంకారమెన్నటికిని జ్ఞాతకానేరదు "(రామానుజభాష్యము 1,1,1)

3) అనచ్ఛేద్యానచ్ఛేదకత్వము. శం॥భా॥ 1,3.7; 1,2,9; 1,3,14-18; 1,2 11-12; 2,1,14-22; 2,3,17; 3,2,34

నిమిత్త కల్పితములగు నుపాధులను నిర్మూలించినచో జీవుఁడే బ్రహ్మ మగును. ఒక ఘటాంతర్గతమగు నాకాశము ధూళిధూమపరిచ్ఛిన్న మైనచో నితరఘటాకాశముల కంటనిరీతిని యొకజీవికిఁ గలుగు సుఖ దుఃఖాదు లితరజీవి నంటవు. ఉపాధిభేదము ననుసరించి, యొకేయాకాశ మనేక నామములను బొందుచున్నను, దానికెన్నఁడును మార్పులేదు. బ్రహ్మమునకు నుపాధ్యంతర్భావము కలిగినప్పుడు స్వరూప తిరోభావము నందును! అప్పుడు బ్రహ్మయొక్క సర్వజ్ఞత్వము పరిచ్ఛిన్నతనొందును. ఇట్టి యుపాధిపరిచ్ఛిన్నత్వము ధవళమైన మణికి సమీపమునయున్న రక్తకుసుమ రక్తిమకలిగినట్లె యని చెప్పవచ్చును.[1] ఆకాశము ఘటాదులతో దహింపఁబడుట కాని, చలించుట కాని జరుగదు.[2] ఒక ఘటములోని యాకాశము మహాకాశములో నొకభాగముకాని, దాని వికారముకాని చెప్పఁజాలము. అదేరీతిగా జీవులాత్మభాగములుకాని వికారములుగాని కావని చెప్పవలెను. బాలుర కాకాశము ధూళిధూసరితమని గోచరించు రీతినే, యాత్మబద్ధమనియు భావముచే మలినమైనదనియు నజ్ఞానులు తలపోయుదురు. ఘటోత్పత్తినాశములతో నాకాశ ముత్పత్తి నాశనములను బొందుటలేదు. అదేవిధముగా నాత్మ కుత్పత్తిలయములులేవు. కొంద ఱితరాద్వైతు లీ భావము నంగీకరించి, యంతఃకరణోపాధి వశమైన పరమాత్మయే జీవుఁడని చెప్పుదురు.

ఈ యుపాధి సిద్ధాంతమునకు వ్యతిరేకముగా, నొక జీవుఁడు తన పుణ్యకర్మ బలముచే స్వర్గమునకుఁ బోయినప్పుడు, స్వర్గములో నా జీవుని చిత్తోపాధి, భూలోకములో నున్నప్పటి చిత్తోపాధికి భిన్నమని చెప్పఁబడెను. దీనివలన ననిష్టధర్మఫలములగు కృతనాశము, నకృతాభ్యాగమము మున్నగునవి కలుగును భూలోకములోని పరిచ్ఛిన్నచిత్తమే స్వర్గమునకుఁ బోవునని చెప్పరాదని సమాధాన మీయఁబడెను. విశ్వవ్యాప్తమైన యాత్మకు సంచారలక్షణమును జెప్పుట యుక్తముగాదు. ఘట సంచలనమువలన నందలి యాకాశమునకు సంచలన మెన్నఁడు నుండదు.

1) శాం॥భా॥ 3,2, 15॥ ఆత్మబోధ శ్లో॥ 16

2) శాం॥భా॥ 1-2-8

భోక్తయగుజీవాత్మయొకటియని చెప్పుటకు దానినొక పరిచ్ఛిన్న చిత్తమని కాక, దర్పణము వంటిదైన మనస్సుతో నిత్యము నవినాభావ సంబంధముగల చిత్ప్రతిబింబ రూపమని చెప్పవచ్చును.[1] బృహదారణ్యకోపనిషద్భాష్యమునందు[2] శంకరుఁడు ప్రతిబింబవాదమును సూచించినాఁడు. నీట సూర్యచంద్ర ప్రతిబింబములు కేవల ప్రతిబింబములేకాని, నిజముగాఁ గానట్లును సమీపమునున్న రక్తకుసుమము యొక్క రక్తిమ ధవళమణియందు గోచరించునేకాని నిజమున కది ప్రతిబింబమైనట్లును, నీటిని కలఁగించినంతనే, సూర్యచంద్రులే మిగిలి యుండుటవలనను, రక్త కుసుమమును దీసివేసిన వెంటనే మణియొక్క స్వచ్ఛధావళ్యము మార్పులేకుండఁ బ్రకాశించుట చేతను వస్తువులు జీవులు నదేరీతిగా, నవిద్యాంతర్గతమై యున్న పరమాత్మ ప్రతిబింబములే కాని యథార్థములు గావని చెప్పవచ్చును. అవిద్య కలఁగినంతనే ప్రతిబింబములు నదృశ్యములై బ్రహ్మయొక్కటే ప్రకాశించును. బ్రహ్మయే మూలబింబము, ప్రపంచము దాని ప్రతిబింబము. వివిధరూపములతోఁ గూడిన ప్రపంచము, బ్రహ్మ మను సూర్యు డనేక రూపములలోఁ ప్రతిబింబించు సాగరము వంటిదని చెప్పఁబడెను. ప్రతిబింబములోని దోషములచే బ్రహ్మబింబము స్పృశింపఁబడదని చెప్పుట కుపయోగించు నీయుపమానమును శంకరుఁ డంగీకరించినాఁడు. ప్రతిబింబభిన్నతకు దర్పణభిన్నతయే కారణమైన రీతిగా, నద్వితీయమగు బ్రహ్మచైతన్యము భిన్నాంతఃకరణ సంసర్గముచే భిన్నమై గోచరించుచున్నది. రూపప్రతిబింబముగల జలము కదలినచో, నందలి ప్రతిబింబములును కదలును. అవచ్ఛేదక వాదు లంతఃకరణరూపమున నున్న సూక్ష్మ పదార్థ మవిద్యారూపమనియు దాని నవచ్ఛేదకమనియు, జీవవిశేషణ మనియుఁ జెప్పఁగాఁ బ్రతిబింబవాదులంతఃకరణము చిత్స్వరూప ప్రతిబింబమును స్వీకరించు నుపాధి[3] యని చెప్పుదురు. అది జీవుని కవిద్యావశమున గోచరించునేకాని దానిసహజస్వభావముకాదు.

---

1) శం॥భా॥ 2,3,50; శం॥ భా॥ గౌడపాదకారిక, 1,6,

2) శంభాష్య॥బృ॥ఉ॥ 3,4,12 చూ॥ బ్రహ్మబిందు ఉ॥పు॥ 12

3) ఒకవర్ణ మావర్ణముగల వస్తువునకు విశేషణము ఒక ఘటము ఘటాంతర్గతమైన యాకాశమున కుపాధి

అనంతరా ద్వైతవాదుల కొందరీ భావము నంగీకరించి, యంతఃకరణ ప్రతిబింబితమగు పరమాత్మయే జీవుఁడని పలికిరి.[1] జగమొక నీడయైనచోఁ దచ్ఛాయామూలము బ్రహ్మము ప్రతిబింబవాద మనేక హేతువుల ననుసరించి విమర్శింపఁబడెను. రూపము లేనిదానికిఁ బ్రతిబింబము నుండదు. అందును ముఖ్యముగా రూపములేని దర్పణములో ననలే యుండదు శుద్ధచిత్తునవిద్యయు రెండును రూపములేనివే. జీవుఁడొక ప్రతిబింబమైనచో నేది ప్రతిబింబితమో యది ప్రతిబింబించుదానికి భిన్నమై యుండవలెను. అందుచే మూలరూపమైన బ్రహ్మము, జగద్వస్తుజాలమునకు వేఱై యుండవలెను. అప్పుడు బ్రహ్మముయొక్క సర్వాంతర్యామిత్వ సిద్ధాంతమునకు బాధకలుగును. ప్రతిబింబవాదమునకు నవచ్ఛేద్యావచ్ఛేదక వాదమునకు సంభవించు దోషములు పట్టును. ప్రతిమనస్సులోని ప్రతిబింబమునకుఁ దత్సమీపముననున్న చిద్రూపమే కారణమైనచో, భిన్నస్థలములలో నీ ప్రతిబింబము లొకేమనస్సులో భిన్నములు కావలెనని విమర్శింపఁబడెను. కాని చిద్రూపము సర్వత్ర యుకమను మాట నీ విమర్శనము గుర్తింపలేదు. జీవుఁడు బ్రహ్మ ప్రతిబింబమైనచో నప్పుడు బ్రహ్మకు భిన్నుఁడు కావున నయథార్థము కావలెను. వివరణ గ్రంథకర్త యీ సమస్య నొక విధముగాఁ బరిష్కరించినాఁడు. నేత్రములనుండి కిరణములు, బయల్వెడలి, ప్రతిబింబించు వస్తువునకుఁ దగిలి, వెనుకకు మరలివచ్చి, యథార్థముల ప్రతిబింబమునేచూపును. ఈ ప్రతిబింబము నిజమగు వస్తువునకుఁ జెందినదే. దీనినే బింబప్రతిబింబాభేదవాద మందురు. కాని యిదియు నంగీకరింపఁబడలేదు. ఈ యుపమానమును బూర్తిగాఁ దీసికొన్నచో, మన కొక ప్రకాశించు జ్యోతియు, దానిభాయునకు నొక వస్తువును, బాజ్యోతియొక్క కిరణముల నడ్డగించు నింకొకటియుఁ గావలసియున్నవి. కాంతి వెడలుచున్న జ్యోతికివేఱై కిరణప్రసారమున కుపయోగించు నింకొక పదార్థముండవలసివచ్చుటచే నద్వైతమునకు బాధకల్గును. ఈ రెండువాదముల[2] కు గూడఁ దిరస్కరించువారు తన సహజస్వరూపము తెలిఁగని

---

1) అంతఃకరణ ప్రతిబింబం జీవచైతన్యం। (వేదాంత పరిభాష 1)

2) ఈవాదఖండనమునకు చూ సాం. బ్ర భా 1,152,153

పరమాత్మయే జీవాత్మయని చెప్పుదురు. శంకర సురేశ్వరు లీభావము నంగీకరింతురు. జీవాత్మరూపము బ్రహ్మముయొక్క అనిర్వచనీయ ప్రదర్శనము[1] జీవాత్మగా గోచరించుచున్నది. కాని యెట్లో మన మెఱుఁగము.

## 38 ఈశ్వరుఁడు—జీవుఁడు

జీవేశ్వరు లిరువురు స్వస్వరూపములలో బ్రహ్మమేయై యిరువురు నుపాధివశులైన యెడల, జీవేశ్వరులకు భేదములేకుండఁ బోవుచున్నది. ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడు, సర్వశక్తిసమన్వితుఁడు, సర్వవ్యాపియు; జీవుఁడు మాత్రమల్పుఁడు, దుర్బలుఁడు, నజ్ఞానియు ననియు శంకరుఁడు పలికియున్నాఁడు. "నిరతిశయోపాధి కలితుఁడగు[2] నీశ్వరుఁడు హీనోపాధికలితుఁడగు జీవులను బరిపాలించును.[3] ఈశ్వరున కవిద్యలేదు.[4] ఈశ్వరోపాధులీశ్వరుని సర్వజ్ఞత్వమునకు బాధకములు గావు. ఈశ్వరునిమాయ యీశ్వరుని వశమైయుండుటచే నతని స్వభావము నిరాచ్ఛాదితమై యుండును. గాజుపాత్ర తనలోనున్న వస్తువులను మఱుఁగుపఱచ నట్టిరీతినే, మాయ యీశ్వరలక్షణములను గప్పివేయదు. ఈశ్వరోపాధియగు మాయ శుద్ధ సత్త్వకల్పితమగుటచే నది యవిద్యారూపమగు నంతఃకరణము నుత్పత్తి చేయదు. మాయ యాతనికి స్వాధీనములోనుండి, యాతని సృష్టిలయ కార్యములలోఁ దోడ్పడును. ఈశ్వరుని యందుఁగల యీ మాయలేక ఆత్మవ్యక్తీకరణ శక్తి, జగన్నానాత్వకారణమై జగత్తువేఱనియు జీవులువేఱనియుఁ దలఁచు జీవుని భ్రమకుఁ గారణమగుచున్నది. అవిద్య మాయవలననే జనించినది. బ్రహ్మముయొక్క శుద్ధచిత్స్వరూపమిట్టి మాయా సమన్వితమైనపు డీశ్వరుఁడనియు, నవిద్యాసమన్వితమైనపుడు జీవుఁడనియు

1) భా, శం భా బ్ర అ 1,2,
2) శ భా, 2,3,45,
3) శం, భా, 2,3,43,
4) నిత్యనివృత్తావిద్యత్వాత్, (శం, భా, 3,2,9)

వ్యవహరింపఁబడెను. సృష్టిచేయుటలో నీశ్వరునికి స్వార్థమేమియు లేనందున, నాతఁ డకర్తయనియు, జీవుఁడు కర్తయనియుఁ జెప్పఁబడెను. ఈశ్వరుఁడు కర్మానుగుణఫలముల నిచ్చువాఁడును, బ్రహ్మముతోఁ దానేకమని యెఱిఁగిన వాఁడు నగుటచేఁ దన యంతరంగములో శాశ్వతానందము ననుభవించుటచేఁ బూజింపఁదగినవాఁడు. జీవుఁ డాతని సేవకుఁడు, తన దైవత్వస్వరూపజ్ఞానములేని వాఁడగుటచే, సంసారమగ్నుఁడైన వాఁడు. ఇదియే శ్రుతవాక్యములలో స్వామిభృత్య సంబంధము.[1] వేరకులు నిచ్చినచోట్ల యట్లే జీవు లీశ్వరాంశము లనియు స్థలాంతరమునఁ జెప్పఁబడెను[2]

అనంతరాద్వైతమున జీవేశ్వర సంబంధమునుగూర్చి చెప్పఁబడిన వివిధభావముల నిచటఁ బేర్కొన నగును. ప్రకటార్థ వివరణ మిట్లు చెప్పెనది: "అనాదియు ననిర్వచనీయము, సర్వజడజగత్కారణము శుద్ధితో మాత్రమే సంపర్కము గలదియునైన మాయయందుఁ బ్రతిబింబితమగు చిత్తే యీశ్వరుఁడు, ఆవరణ విక్షేపశక్తులు రెండు గలిగి, అవిద్యయను నామముచే వ్యవహరింపఁబడు మాయయం దనంత పరిచ్ఛిన్న దేశములలోఁ బ్రతిబింబితమగు చిద్రూపము జీవుఁడు"[3] ఈ గ్రంథకర్త ననుసరించి, మాయావిద్యల పూర్ణాంశసంబంధము గలవి మాయ యీశ్వరోపాధియు నవిద్య జీవోపాధియునని చెప్పనచ్చును. కొలఁది భేదములతో సంక్షేపశారీరక మీ భావమునే యంగీకరించెను. ఇం దవిద్య కారణము, నంతఃకరణము కార్య మనియుఁ జెప్పఁబడెను.[4] ఈ గ్రంథకర్త ప్రతిబింబవాదము నంగీకరించును గానఁ బూర్ణాంశ విభాగవాదము నంగీకరింపఁడు. పంచదశి యిట్టి భావమునే

---

1) శాం॥భా॥ 3,2,9

2) శాం॥భా॥ 3,3,43

3) అనాది రనిర్వాచ్యా, భూతప్రకృతి శ్చిన్మాత్ర సంబంధినీ, మాయా తస్యాం చిత్ప్రతిబింబ ఈశ్వరః తస్యా ఏవ పరిచ్ఛిన్నానంత ప్రదేశేష్వావరణ విక్షేపశక్తి మత్స్వవిద్యాభిధానేషు చిత్ప్రతిబింబో జీవ ఇతి. (సిద్ధాంతలేశము,1)

4) అవిద్యాయాం చిత్ప్రతిబింబ ఈశ్వరః అంతఃకరణే చిత్ప్రతిబింబో జీవః
భా, 6—9

ప్రకటించినది. త్రిగుణాత్మకమై, అవ్యక్తమైన మూలప్రకృతికి రెండు రూపములు ఉన్నవి. రజస్తమో గుణముల నణఁచివైచి, సత్త్వగుణ మతిశయమైయున్న మూలప్రకృతి భాగ మీశ్వరోపాధియగు మాయయనియు, సత్త్వగుణము నతిక్రమించి రజస్తమములున్న భాగము జీవోపాధియగు నవిద్యయనియుఁ జెప్పఁబడెను. ఇచట మాయావిద్యలకు భేదము పరిమాణాత్మకముగాక గుణాత్మకమైయున్నది. పంచదశిలో నింకొకచోట నిట్టి భావమే యున్నది. విక్షేపశక్తివిశేషముగాఁగల ప్రకృతి మాయయనియు, నావరణశక్తి విశేషముగా నున్నచో నవిద్య యనియు నచటఁ జెప్పఁబడెను. [1] పంచదశిలో [2] విద్యారణ్యుఁడాకాశము నిట్లు భాగించెను; (1) ఘటాకాశము, (2) మేఘమహాసారుజాదులతోఁగూడి ప్రతిబింబించు జలాకాశము (3) మహాకాశము, (4) మేఘాకాశము. అదే విధముగా నాలుగు విధములుగాఁ జిత్స్వరూపమున్నది. (1) కూటస్థ మనఁగా స్థూలసూక్ష్మ దేహావృతమై, యెన్నఁడు మారకుండునది, (2) జీవుఁడనఁగా, మనస్సులోఁ బ్రతిబింబితమైన చిత్స్వరూపమే యజ్ఞానవశమున మార్పులేని మూలచిత్స్వరూపమని తలఁపఁబడునది; (3) అవిచ్ఛిన్న చిత్స్వరూపము, (4) సర్వజీవమానసములలో సూక్ష్మవాసనారూపమునఁ [3] బ్రతిబింబించు చిత్స్వరూపము, బ్రహ్మనంటిపట్టుకొనియుండు శీతరూపమైన మాయలేక యీశ్వరుఁడు దీని ననుసరించి, మనః ప్రతిబింబితమైన చిత్స్వరూపము జీవుఁడనియు, సర్వజీవ సూక్ష్మ సంస్కారములతోఁ గూడిన మాయయందు ప్రతిబింబించు చిత్స్వరూప మీశ్వరుఁ డనియుఁ జెప్పనగును. పంచపాదికా వివరణగ్రంథకర్త జీవుఁ డీశ్వర ప్రతిబింబమని చెప్పెను.[4] మాయావశుఁడైన యీశ్వరుఁడే జీవుఁడనియుఁ జెప్పఁబడెను.

---

1) ఈ భాగములనే తత్త్వవివేకము చెప్పును

2) 6 అ

3) ధీవాసనా.

4) వీని కాధారము, బ్ర॥ అ॥ చ॥ 6, 7; గీతాభాష్యమున, "ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి"

## 39 - ఏకజీవవాదము, అనేకజీవవాదము

అవిద్య యొకటే యగుటచే నవిద్యోపాధిగతుఁ డగు జీవుఁడు నొకఁడేయను వాదమును శంకరుఁ డంగీకరించెడు, ఏలన సర్వజీవు లొకటియే యైనచో, నొక్క జీవునికి మోక్షసిద్ధితో, సర్వజీవమోక్షము కలిగి, సృష్టిలో జీవులు లేకుండఁబోవలెను. కాని యట్లు జరుగుటలేదు. అవిద్యాసంజాతములైన భిన్నాంతఃకరణోపాధిగతమైన బ్రహ్మమనేక జీవరూపములుగా విభాగము నొందినదివలె నగుచున్నది. కాని మాయకు నవిద్యకు, వీనికిని బ్రహ్మమునకుఁ గల సంబంధ సమస్యలవలన ననంత రాద్వైతమునం దనేక సిద్ధాంతములు బయల్వెడలినవి. వానిలో ముఖ్యమైనవి. (1) ఏకజీవవాదము (2) అనేకజీవవాదము.

ఒక్కటే జీవమున్నది, ఒక్కటే శరీరమున్నది ఈ యొక్క జీవమే నిజమైనది. నిద్రాదులలో గోచరించు దేహములకు జీవములేదు. ఒక్క జీవియొక్క అవిద్యవలననే, అనేకత్వముతోఁ గూడిన ప్రపంచ మూహింపఁబడినది. కాని యిట్టి యేకజీవవాద మీ బాదరాయణ సూత్రములకు వ్యతిరేకమైనది. 2. 1. 22, 2. 1. 33; 1. 2. 3. సృష్టికర్త జీవుఁడుకాఁడు, వినోదార్థము సృజనశక్తిచూపు జీవేతరుఁడగు నీశ్వరుఁడు, ఈశ్వరుఁ డాప్తకాముఁ డగుటచే నాతనికిసృష్టిచేయుటలో నెట్టి కోర్కెయునులేదు. అందుచే బ్రహ్మముయొక్క ప్రతిబింబమైన ముఖ్య జీవుఁ డనఁగా హిరణ్యగర్భుఁడొక్కఁడే యున్నాఁడనియు, నితరజీవు లన్నియు నా హిరణ్యగర్భుని రూపాంతరములే యనియు వీనికే బంధ మోక్షము లున్నవనియుఁ జెప్పఁబడెను. ఈ రచయిత లందరు జీవైకత్వవాదము నంగీకరించి, దేహము లనేకము లున్నవనియు, నొక్కొక్క దేహమున నొక్కొక్క జీవప్రతిబింబము సమకూర్పఁబడె ననియుఁ జెప్పెదురు. ఏకజీవవాదులలో మూఁడవ వర్గమువా రిట్లు చెప్పుదురు. ఒకేజీవ మనేక శరీరములలో నివసించుచున్నది. శరీరభేదమునుబట్టి జీవభేదము గోచరించుచున్నది. కాని యొకే దేహములోని భిన్నావయవములకుఁ గలిగిన క్లేశముల నేకజీవ మెట్లుగ్రహించుచున్నదో యట్లే, సర్వదేహములలో జీవ మేకమే యైనచో భిన్నదేహక్లేశముల నేకకాలమునఁ దా నేల యనుభవించుట లేదను నాక్షేపణము నీ యేకజీవవాదు లూహింప

రై రి. వారివారు చెప్పినదేమన, మనకుఁ బూర్వజన్మములలోని ?
దుఃఖానుభవజ్ఞానము లేని రీతిగానే, దేహానేకత్వభేద మొకే జీవున
కితర దేహానుభవము లేకుండఁజేయుచున్నది. జీవైకత్వ, దేహానే
వాదమును వీరు సమర్థింతురు.

అవిద్యనుగూర్చిన భిన్నాభిప్రాయములవలన ననేకజీవవాదమ
కనేకరూపములు కలిగినవి (1) అంతఃకరణరూపమున న
యుండుట జీవత్వభావమునకు ముఖ్యమైనది. అంతఃకరణాదికము
రూపమైనదో, నంతఃకరణము లనేకము లుండుటచే జీవు లనేకవ
గావలెను. (2) ఇతరు లిట్లు భావించిరి. బ్రహ్మమందుండి, బ్ర
మున కాశ్రయమై, బ్రహ్మము నాచ్ఛాదించు నవిద్య యేకమైనద
యవిద్యానాశనమే మోక్షమైనను, నీ యవిద్యలలో భాగములు గ
జీవన్ముక్తిలో విక్షేపశక్తిగల యవిద్యాంశము కొంత యుంకను వి
యున్నదని చెప్పవలెను. విదేహముక్తుని విషయములో నీ యు
పూర్తిగా నశించును. (3) చిద్రూపమున కవిద్యతో సంబంధ ముఁ
బంధమనియు నట్టిసంబంధము విచ్ఛిన్నమగుటే మోక్షమనియు భా
మూఁడవమార్గము వారు కొందఱు గలరు. చిద్రూపమున క
సంబంధమును నిర్ణయించున దంతఃకరణము లేక మనస్సు. బ్రహ్మ
భవ ప్రాప్తితో మనస్సు నశించి చిత్స్వరూపములో నా భాగమునకు
యవిద్యాసంబంధము తొలఁగును; ఇతర చిద్భాగములలో నవిద్యాస
ధము మిగిలియుండును. (4) ప్రతిజీవిలో నవిద్య సంపూర్ణతగా
బ్రహ్మమును మఱుగుపఱచుచున్నది. అవిద్య జీవుని విడిచిపు
మోక్షము. (5) అవిద్య యంతయు నంశవిభాగ మంది, జీవ
బంచిపెట్టఁబడినది. తనకుఁ జెందిన అవిద్యాంశమును నశింపఁజేయ
నా జీవమునకు ముక్తి కలుగును. ప్రపంచమంతకు నవిద్యాంశా
చ్ఛాదనమే కారణము. "ఒక వస్త్రమునకు దారము లన్నియుఁ
కారణ మగుచున్నవి; ఏ యొకదారము తెగినను, వస్త్రము చెడును;
లినదారముతో నప్పాతక నూతనవస్త్ర మేర్పడినరీతిగానే, ప్రపంచ
సర్వజీవులకుఁ జెందిన అవిద్యాంశానముచ్ఛయముచే నేర్పడి, యే
జీవియొక్క అవిద్యాంశము నశించినను, ప్రపంచము చెడును,

మిగిలిన జీవుల అవిద్యాంశములచే నింకొక నూతనప్రపంచము కల్పిత మగుచుండును." (6) అవిద్యలోని ప్రతిభాగము నొక ప్రత్యేక ప్రపంచమును గల్పించును. శుక్తిలో గోచరించిన రజతభ్రాంతి ప్రతి వ్యక్తి కొక్కొక్కరీతిగా నుండునట్లు ప్రతిజీవిలోనున్న యవిద్యవలన నుదయించిన ప్రపంచ మొక్కొక్కని కొక్కొక్కరీతిగా నుండును ....

కాని యీ భిన్న ప్రపంచము లన్నియు నొకటిగాఁ గన్పట్టుటకుఁ గారణము "నీవు చూచిన రజతమునే నేను చూచితి" నని చెప్పుట వంటి మిథ్యాజ్ఞానము. (7) ఒకటే ప్రపంచమున్నది; దీనికుపాదాన కారణ మీశ్వరసంస్థితమైన మాయ; సర్వజీవులలో నివసించు నవిద్యా సముచ్చయమున కిది భిన్నమైనదని చెప్పువారు కొందఱుగలరు. ఈ యవిద్యాప్రవృత్తి రెండు రకములు, ఒకప్రవృత్తి భ్రమము నావ్ఛాదించును; రెండవది విక్షేపశక్తి రూపకమై శుక్తి రజతభ్రాంతి, స్వప్నగత యథార్థ వస్తుభ్రాంతిని గలుగఁజేయును.[1]

## 40 ధర్మశాస్త్రము

ప్రపంచములోని సర్వవిషయములలో మానవుఁడొక్కఁడే ధార్మిక వ్యక్తి. పరిచ్ఛిన్నా పరిచ్ఛిన్నజగత్తులు రెంటితోఁ దనకు సంబంధ మున్నదని యాతఁడు గుర్తించినాఁడు. పరిచ్ఛిన్న జగత్తులో నపరిచ్ఛిన్నశక్తి ప్రవర్తించుచుండుట కవి కల్పితము కాదు, అది తత్త్వశాస్త్రము చర్చించి కనుగొనిన పరమసత్యము. మానవుని దేహ సంబంధము పూర్వకర్మ ఫలానుగుణమై, యచేతన సూత్రనిబద్ధమై నడచినను, నాతనియందు సత్యసుందర శివస్వరూపములగు నిరవధికలక్ష్యములు, వాని యుత్తరోత్తరాధికావిష్కృతి కతనిఁ బ్రేరేపించి పనిచేయించు చున్నవి. మానవునియందు బ్రహ్మమధికముగా నావిష్కృతి నందు చున్న కారణము వలననే, మానవునికిఁ దార్మికధార్మిక ప్రవృత్తి కర్తయు నధికారమును గల్గినది.[2] మానవుఁడు దానిని సాధింపయత్నిఁ

1) చూ. సిద్ధాంతలేశము

2) ప్రాధాన్యాత్ కర్మజ్ఞానాధికారః (శం॥భా॥తై॥ ఉ॥ 2, 1)

చియు సిద్ధిపొందఁజాలనంతకాల మాతఁడు సంసారబద్ధుఁడై యుండును అతఁ డనంత బ్రహ్మజ్ఞానసిద్ధిని గాంచిన క్షణమువనే, హృదయభారము తడలి, అవ్యయానందము వరదలై పొంగును బ్రహ్మైక్యసిద్ధియే సర్వ ప్రవృత్తి లక్ష్యము; ఏలన బ్రహ్మము కేవలము సద్రూపము. చిద్రూ పమేకాక, ఆనందరూపముకూడనగుటచే, సర్వసాధనములచే సంపాదింప దగినది.[1] బ్రహ్మైకత్వమే జీవిత చరమ గమ్యస్థానము, "ఆత్మ కుచితమగు భోజనము."[2] పరమైక ప్రయోజనము. ఈ గమ్యస్థాన మును సాధించుటకు జీవాత్మ దవస్థితివలన ననంతప్రీతిమగ్నుఁడగును "మూఁడు లోకములలోనున్న ప్రతిజీవియు దుఃఖాస్పదములైన వాని కొఱకుఁగాక, సుఖాస్పదములైన వానికొఱకే యన్వేషించును."[3] సర్వ మానవులును నిశ్శ్రేయసమునే యపేక్షించుచున్నారు. ప్రొనింగు క వరేణ్యుని మాటలలో, "సర్వజీవులు నెన్నిలోపములున్నను, ఎంతదుర్బల లైనను, గొంత సుగుణసంపత్తిగలిగి, యూర్ధ్వముఖులై పయనించు చున్నారు. నిగూఢములై లోతైన గుహలలోనున్న మొలకలు కూడనెన్న డును సూర్యునిఁజూచియుండలేదు కాని, సూర్యోన్ముఖములై యాతని గన్గొను నాత్రముతో నూర్ధ్వముఖముగాఁ పైకిఁ బెరుగ యత్నించు చుండునట్లే."

సంసారవృక్షమునుండి మనము త్రుంచు మధురాతి మధురమ ని తలఁపఁబడిన ఫలములను మన నోటఁ బెట్టుకొన్నంతనే, భస్మముగా మారిపోవును. మహోన్నతమని యూహింపఁబడిన భోగముకూడ రోఁ పుట్టించును, స్వర్గ సుఖములుకూడ నశాశ్వతములు. ఒక సత్క్రియా చరణము కాని, యొక మధురగీతాశ్రవణముగాని, యొక ధ్యాననిష్ఠ దృష్టి కాని మనల నొక్కసారి మన సంకుచితావధులనుండి పైకి లేవనె చ్చును గాని, నిత్యసంతుష్టి నిచ్చునది బ్రహ్మానుభవ మొక్కటే. అ

1) ప్రయోజన మానవార్థమ్ ఆనందగ్రహణమ్
(వేదాంతపరిభాషను గూర్చిన శిఖామణిః ఉపోద్ఘాతము)

2) కోయిల్రద్ పు. 247

3) శతశ్లోకి పు 15

యేమన వ్యక్తిత్వమునకుఁ బరిపూర్ణ వినాశము నిచ్చి, నిరుపమాన ములగు శాంత్యానందములను జేకూర్చును.[1] మనము లోకమును కంటిపట్టుకొని, క్షణిక మిథ్యాదృశ్యములను నిజములని నమ్మి, వాని వలనఁ గలుగుసట్లుతోఁచు సుఖలేశాభాసము వానిని జేరునప్పటికే యదృశ్యమై పోవుటఁజూచి నిరాశోపహతుల మగుటచే మనకు దుఃఖప్రాప్తి కలుగుచున్నది. "మానవుఁ డెంతకాలము దేహమే యాత్మయని నమ్మునో, యంతకాలము పాపజలరాశిలో మునిఁగి, దుఃఖవంక నిమగ్నుఁ డగును. సర్వాత్మస్వరూపమే తానని నమ్ముటతోడనే, దుఃఖపరిసమాప్తి యగును."[2] పరమార్థ స్వరూపమును మన మనోదృష్టి కనుగుణముగాఁ గల్పింపఁ జాలము; దాని స్వరూపమును యథారీతిగా మనము గ్రహింప వలసినదే. శంకరుని దృష్టిలో సత్యమిట్లుండ వలెనని మనము కల్పించినది తత్త్వశాస్త్రము గాదు, సత్యమెట్లున్నదో చూచి గ్రహించుటే. అనుభవదృష్టిచే ననంతరూపమగు సత్యము తెలుఁగుటవలన శాంత్యానందములు సిద్ధించును. భిన్నత్వముతోఁ గూడిన ప్రపంచముతోఁ గలిసియున్నను, ధర్మశీలమువలని ఫలితము లన్నియుఁ బరమార్థ సంపాదనకు సాధనము లగును. బ్రహ్మాత్మైక్యసిద్ధియే పరమ శ్రేయమైనను, ధర్మమువలన లభించును. శ్రేయఃప్రాప్తి తత్సాధన రూపమే. ధర్మవిరుద్ధములగు ఫలితములు బ్రహ్మజ్ఞాన సంపాదమునకు వ్యతిరేకము లగును.

సత్యసమన్వితమైనదే ధార్మికమైన కర్మ, అనృతసమన్వితమైన దధర్మము.[3] మరణానంతరము పుణ్యలోకప్రాప్తి నిచ్చునది సత్క

1) "మోక్ష మనఁగా దుఃఖరహితమైన నిరవధికానందము, మానవుల సుఖము దుఃఖము రెంటికిఁ గోరుట సహజము గావున, మోక్షాపేక్ష యెల్లప్పు డుండును" (సంక్షేప శారీరకము 1, 67) (పోల్చు: స్పైనోజా. "మనము సుఖముగాని దుఃఖముగాని మన ప్రేమకు నిలయమైన వస్తుస్వభావముపైననే యాధారపడి యుండును కాని, నిత్యము ననంతమునగు వస్తువుపైఁ గల ప్రేమ, స్థిరతరమైన పరిశుద్ధానందముతో మనస్సును నింపును "

2) శంకరభాష్యము 3,1,2

3) పోల్చు: "పాపముచేయు ప్రతి మానవుఁడు జ్ఞానమును ద్వేషించును." (సెయింట్‌జాన్, 3,19.)

ర్మయు, దుఃఖమయలోక ప్రాప్తినిచ్చునది దుష్కర్మయు నగును. మానవుఁడు క్రమవికాసమువలనఁ దన నిజమగు సనాతనస్వరూపమును సాధించి దైవత్వసిద్ధిఁబొంద యత్నించును. వ్యావహారిక ప్రపంచములో నీశ్వరుఁడే యుత్తమవ్యక్తి; ప్రపంచ మాతని కార్యము, ఈశ్వరభక్తుఁ డీజగత్తునంతను ప్రేమింప వలెను; ఏలన నిదియంతయు నీశ్వరసంతానమే, స్వార్థపరతంత్రుఁడగు వానికి శాంతి మోక్షములు లేవు; లోక కల్యాణమునకై కర్మార్పణము చేయువానికే నిశ్శ్రేయస మున్నది. అహంకారమే మహాపాపము, సర్వభూతదయ, ప్రేమయే పరమపుణ్యము. సర్వజీవసుఖ శ్రేయములకై పాటుపడుటవలననే, మనకు వ్యక్తిగతోద్ధరణము కలుగును అహంభావకారణములగు నింద్రియములను ప్రతివ్యక్తియు నిగ్రహింపవలెను. గర్వమువిడిచి వినయము నార్జింపవలెను. అట్లే, పరనిరసనమునకు బదులు క్షమ, స్వకుటుంబ మమకారమునకు బదులు జగత్కుటుంబ ప్రేమయుఁ బెంపొందవలెను. మనముచేయుకర్మ వ్యక్తిగతమైన స్వార్థపరత నుఁడిపైచి, సంఘ శ్రేయోభివృద్ధిని బలపఱచు సంకల్పమే ప్రధానమైనది. మానవుఁడు తన మమకారమును జంపి, విశ్వాత్మలో లీనమగుట కుపాయములుగానే విధు లుద్దేశింపఁబడినవి. తన కాలములోని ధర్మప్రమాణములను శంకరుఁ డంగీకరించి, శాస్త్రనిషిద్ధకర్మలను విడువవలెనని బోధించినాఁడు. అధ్యయన యజ్ఞదానతపోపవాసాదికములు జ్ఞానసాధనములు. [1] అవి శీలమును బోషించి, చిత్తశుద్ధి నిచ్చి అంతర్దృష్టి నుజ్జ్వలింపఁజేయును. లోకోత్తర ప్రజ్ఞాప్రభావము గలవారు సత్యమును వెంటనే గ్రహింపవచ్చునుగాని, సామాన్య మానవునికి గొంతకాలము, ప్రయత్నమవసరము. నిత్యవిధులను, గృహస్థధర్మములను శ్రద్ధతో నెఱవేర్చుటవలన, బ్రహ్మప్రాప్తి కనుగుణమైన చిత్తశుద్ధి నిచ్చును. [2] వైదిక కర్మకలాపమును నిష్ఠతో నాచరించుటవలన సఖ

1) బృ॥ ఆ॥ ఉ॥ 4, 4, 22

2) శం॥ భా॥ 3 4 26

3) 4, 1, 4

వరయు ప్రాప్తికలుగును గాని, అభ్యుదయమనఁగా నిశ్శ్రేయసము కాదు. [1] బ్రహ్మజ్ఞానమువలనఁ బరమాత్మనెఱిఁగి ముక్తి బొందవచ్చును గాని, యీశ్వరు నీ రూపములో వర్ణించినను, ననేకవిధములగు ఫలితములు లభించును గాని యవన్నియు సంసారము నతిక్రమింపఁజేయునవి కావు. [2] కానివలన మనము స్వార్థములను విడిచి, రాగద్వేషమాంద్యములను జయించి దుఃఖములను ధైర్యముతో నెదుర్కొని, నిశ్చలశాంతి నందఁగలుగుదుము శ్రద్ధాపూర్వకమగు ధ్యానమువలన జ్ఞానము చేకూరును భక్తియు జ్ఞానసాధనమే. తీవ్రశిక్షణాభ్యాసముచే సునిశితములైన మానసములకే బ్రహ్మజ్ఞానము సాధ్యమగును. జ్ఞానము నార్జించుట యనఁగా బాహ్యమునుండి దానిని మనసులోఁ జొప్పించుట కాదు, సత్యము మానవునాత్మ గర్భమునందే యున్నది. వినశ్వరమగు ప్రపంచమునుండి తిరోగమించు మనస్సులో నాత్మజ్ఞానము ప్రకాశించును. మనబుద్ధి నద్దమువలె స్వచ్ఛ మొనర్చినచో, లోని జ్ఞానము లాంతరులోని దీపము తోమిన గాజుచిమ్నిలోనుండి బయటికి స్వచ్ఛముగాఁ బ్రసరించినట్లు ప్రకాశించును. "ఆత్మ సర్వకాలములలో సర్వవస్తువులలోనుండియు, నది యన్నిటిలోఁ బ్రకాశించుటలేదు స్వచ్ఛమైన వస్తువులలోఁ గాంతి ప్రతిఫలించునట్లు, జ్ఞానము స్వచ్ఛబుద్ధిలోఁ బ్రకాశించును" [3] శంకరుఁడు బ్రహ్మజ్ఞానమున కతిశయప్రాముఖ్యము నిచ్చెను. ధర్మానుష్ఠానము బ్రహ్మజ్ఞాన సాధనము. జ్ఞానమే మోక్షహేతువు; ఇతర సాధనములు పరోక్ష సహకారులు. [4] "ఎవనికి రాగ

---

1) శం॥ భా॥ ముం॥ ఉ॥ ఉపోద్ఘాతము

2) శం॥ భా॥ 1, 1, 24, చూ 3,2,21

3) సదా సర్వగతోఽప్యాత్మా, న సర్వత్రావభాసతే, బుద్ధావేవావభాసేత, స్వచ్ఛేషు ప్రతిబింబవత్॥ (ఆత్మబోధ శ్లో. 17.)

4) శం॥ భా॥ 4 11। శం॥ భా॥ తై॥ ఉ॥ 1.3 జ్ఞానసంపాదనమే తత్త్వవేత్తల కర్తవ్యమని ప్లేటో చెప్పినాఁడు శ్రేయోభాన దర్శనమే యట్టి జ్ఞానఫలము ఇతరుల కది దేశకాలపాత్రానుగుణమైన విధినిషేధములనుగూర్చి సునిశ్చితభావముల నిచ్చును చూ. ప్లేటో, రిపబ్లిక్ అప్లై, అరిస్టాటిల్ 'మనుష్య శక్తిపరము, అయిన 'నీతి ధర్మముల'ను సామాన్య మానవుల కుపదేశించెను మోక్షాపేక్షగలవారికి వివేకము నాతఁ డుపదేశించెను వివేక ముత్తమమైన విషయముల నెఱింగించును" (నికోమకీన్ ఎథిక్స 10,8)

రహితమైన చిత్తశుద్ధికలదో, వర్తమాన పూర్వజన్మకర్మ లెవని బంధింపవో, ఎవఁడు లోకములోని క్షణికములగు లాభనష్టములను వికారములను సమవృత్తిఁ జూచునో, వానికే బ్రహ్మజ్ఞానకాంక్ష జనించును,[1] సమాధిస్థితిని జేకూర్చు యోగాభ్యాసమును శంకరుఁ డంగీకరించినాఁడు. బాహ్యవస్తువు లన్నిటినుండియు నింద్రియములను లోనికిఁ దీసికొని, తన సహజస్వరూపముపైఁ గేంద్రీకరించుటవలన సమాధిలో సంపూర్ణ మగు సంతుష్టి కలుగును. దీనిని శంకరుఁడు సంరాధనయని పలికినాఁడు. యోగాంగములగు యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహారములు బహిరంగసాధనము లనియు, ధారణ ధ్యానము లంతరంగ సాధనము లనియు నద్వైత మంగీకరించినది.[2] సదసద్వస్తువివేకము, ఇహాముత్రఫలభోగవిరాగము, శమదమోపరతితితిక్షాసమాధి శ్రద్ధలు, ముముక్షుత్వమను నివి యాంతరంగికనియమములు వీనివలన బ్రహ్మజ్ఞాన ముదయించును[3]

ఏ విజ్ఞానవేత్తయుఁ దామున్నత సత్యగ్రహణములో నుత్తీర్ణుఁడైనను, దనయుగములోని విశ్వాసములను భగ్నమొనర్పుటకు యత్నింపఁడు. వర్ణాశ్రమధర్మవ్యవస్థల పటుత్వము సడలినను, శంకరుఁడు వానియందలి విశ్వాసమును నిరసింపఁడు. ఏదేనొక వర్ణములో జన్మించుట హేతురహితకాకతాళీయము కాదనియుఁ, బూర్వజన్మకర్మ ననుసరించియే యది జరుగుననియుఁ జెప్పు సంప్రదాయము ననుసరించి, వేదాధ్యయనాధికారము దేవతలకు, ఋషులకు, మున్నత ద్విజవర్ణములవారికే గలదను విషయమును శంకరుఁ డంగీకరించినాఁడు.

---

1) శంకరభాష్య ఉపోద్ఘాతము మరియు శం. భా. బాదరాయణసూత్రోద్ఘాతము 5,8,1; బృహదారణ్యక 4,4,22; కఠ 1,2,15

2) వేదాంతములోని శ్రవణమననములు ధారణమునకును, నిదిధ్యాసము ధ్యానమునకును, దర్శనము సమాధికిని సరిపోవును

3) శం. భా. 3,4,23.

[1] ఏ వర్ణస్థుఁడైనను బ్రహ్మజ్ఞానమునకు కర్తుఁడని [2] శంకరుఁ డంగీకరించెనుగాని, బ్రాహ్మణధర్మము నంగీకరించువారు మాత్రము వర్ణాశ్రమ విధుల ననుసరింపవలెనని శంకరు నభిప్రాయము. బ్రాహ్మణుఁడు వేదాధ్యయనముచే జ్ఞానమును బొందఁగా, నితరు లీశ్వరారాధనాదికముచే నాజ్ఞానమునే పొందవచ్చును. [3] బ్రహ్మజ్ఞానసంపాదనమునకు వేదాధ్యయన మొక్కటేగతి యను వాదమునకు శంకరుని రచనలలో సాక్ష్యమును సంపాదించుట కవకాశములేదు. తన తత్త్వశాస్త్రమందు వలెనే, హిందూధర్మ ప్రవచనము నందును శంకరుఁడు పరస్పర విరోధ భావముల కవిరోధసమన్వయమును జూపయత్నించినాఁడు. కులమత భేదములతో నిమిత్తము లేకుండ, జిజ్ఞాసగల మానవు లందఱకు బ్రహ్మజ్ఞానద్వారములను దెఱచియుంచి, శంకరుఁడు తన విశ్వమానవ ప్రేమను వెల్లడించి, అద్వైతమునుండి బయల్వెడలు తార్కికనిర్ణయముల కాతఁడు బద్ధుఁడై నిలిచినాఁడు. ఉత్తమ బ్రహ్మజ్ఞానము నార్జించిన విదురుఁడు మున్నగు శూద్రులు పూర్వజన్మపుణ్యవిశేషముగల వారను బ్రాహ్మణవాదము నాతఁ డంగీకరించినాఁడు. ఏ శూద్రుఁడైన నద్వైత జ్ఞానమును గ్రహించు సామర్థ్యమును జూపునో యాతఁడు పూర్వ జన్మములో వేదము నభ్యసించెనని తలఁపవలెను. ఈ విధముగా నగ్రవర్ణముల యధికారమును శంకరుఁడు తృణీకరించినాఁడు. బ్రహ్మజ్ఞానవేత్తలైనవారు ద్విజులైనను, చండాలురైనను వారి నితరులు గురువులుగా భావింతురని శంకరుఁడు పలికినాఁడు. అద్వైతము ననుసరించి, జగన్మిథ్యాత్వము నెవఁడు తెలిసికొనెనో యాతఁడు చండాలుఁడైనను ద్విజుఁడైనను, నాకు నిజముగా గురుతుల్యుఁడు ఇది నానిశ్చయము. [4]

---

1) రైక్వుఁడు శూద్రుఁడని చెప్పియు వేదము నుపదేశించిన జానశ్రుతి ఓపయు మున్న, భా. ఉ 41, 2 సర్వకామనాకాదం విషయమును శూద్రుఁడు సంసారమార్గములో నున్నత వర్గమునకు వచ్చు జన్మించునటు నాతని బ్రహ్మజ్ఞానార్హత లేదను వర్ణముతో విభేదించె నదెను

2) శం. భా. 3,4,38

3) పురుషమాత్ర సంబంధిర్జపోపవాసదేవతారాధనాదిభిర్ధర్మవిశేషై రనుగ్రహో విద్యాయా స్సంభవతి.

4) మనీషాపంచకము, మూ॥ కాశీపంచకము, ఛ 3,3,5

ఆశ్రమ ధర్మములు విధిగా నాచరింపవలెనని చెప్పఁబడెను. మోక్ష సిద్ధికొఱకుఁ బ్రతివ్యక్తియు సన్న్యసింప నవసరములేదు. బృహదారణ్యక ఛాందోగ్యోపనిషత్తులలో గృహస్థులే బ్రహ్మవిద్యనార్జించి బోధించిరని చెప్పఁబడెను. కాని, సన్న్యాసులకు వైదిక కర్మలుకాని, గార్హస్థ్య విధులుగాని నైమిత్తిక పూజాదికములు గాని లేని కారణముచే నితరులకంటె నధికసులభముగా బ్రహ్మజ్ఞానమును సాధింప నర్హులని చెప్పవచ్చును. ఆశ్రమధర్మముల ననుసరించువారు మోక్షాత్పూర్వము సన్న్యసించి తీఱవలెను. ఆశ్రమవిధుల ననుసరింపనివారి కట్టి నియమము లేదు. సన్న్యాసులు బ్రహ్మసంస్థితులు. "అట్టి బ్రహ్మసంస్థితి మిగిలిన మూఁడాశ్రమముల వారికి సాధ్యము కాదు. ఏలన వారు తమ యాశ్రమమున కనుగుణము లగుధర్మములను సరిగా నాచరింపని లోపముచే నష్టులగుదురు. సన్న్యాసులకు కర్మాచరణలోప దోషములేదు." [1] మఱియు, "ఏ యాశ్రమస్థునికైనను జ్ఞానప్రాప్తి కధికారమున్నను, సన్న్యాసికి జ్ఞానమే మోక్షమిచ్చును, మిగిలినవారిజ్ఞానము కర్మసంబంధము గల దగుటచే నట్లియ్యఁజాలదు." [2] హిందువుల సన్న్యాసాచారములలో నొక శిక్షణక్రమముగాని, యొక సామాన్యప్రమాణముగాని లేదనిగుర్తించి, సన్న్యాసాశ్రమ వర్గములను నవీనపద్ధతుల కనుగుణముగా నిర్మించి, బౌద్ధనిర్వాణ ప్రయోజనములను హిందూధర్మమునకును లభింపఁజేసెను. [3] స్త్రీలను బౌద్ధాశ్రమములలో నంగీకరించిన దుష్ఫలితముల నెఱిఁగి, శంకరుఁడు దారిద్ర్యశౌచ తపో విధానముల నాశ్రయించి, సంసారనిర్ముక్తులు కాఁగోరువారికి నిలయములుగను, విద్యాకేంద్రములుగను నిర్మింపఁబడిన

---

1) శం॥ భా॥ 3, 4, 20

2) శం॥ భా॥ మాం ఉ ఉపోద్ఘాతము. సన్న్యాస నిష్ఠో బ్రహ్మవిద్యా మోక్ష సాధనమ్ న కర్మసహితా

3) వివిదిషా సన్న్యాసమనియు, విద్వత్సన్న్యాసమనియు సన్న్యాసమును విద్యారణ్యులు విభాగించెను. మొదటిది బ్రహ్మాన్వేషకునిది. రెండవది సిద్ధపురుషునిది. మొదటి రకపు సన్న్యాసము స్వీకరించినచో దానిని నియమమునమసరించియే నడుపవలెను. రెండవ దానికి బంధములు లేవు. చూ॥ జీవన్ముక్తివివేకము

మతములలో స్త్రీలకుఁ దావులేదని శంకరుఁడు నిర్ణయించెను మతవ్యవస్థలలో వర్ణభేదములను శంకరుఁడు పాటింపలేదు.

హిందువు లందఱకును వర్ణాశ్రమ విధులు వర్తించును, ఏలన, నీ ధర్మములు జాతియొక్క పరిణత విజ్ఞానమును సూచించును. సంఘ శ్రేయము కొఱకే వ్యక్తులు జీవింపవలెను, అట్టివారికి సూత్రములు బాహ్యశాసనములు గావు. ఒక వ్యక్తియొక్క నైతికప్రయోజన మా వ్యక్తి సంఘమునకుఁ జేయు సేవమీఁదనే కేవల మాధారపడి యుండలేదు. బాహ్యమునుండి మనయిచ్ఛవచ్చిన రీతిని రూపము నిచ్చుటకు మానవుఁ డొక మట్టిముద్ద కాదు. అతనిని లోపలనుండి సంస్కరింపవలెను. మానవుని నీవిధి చేయుము చేయవల దని శాస్త్రములు శాసించునవి గావు, జాతియొక్క పరంపరాగతమైన యనుభూతినే శాస్త్రములు జ్ఞాపకము చేయును. [1] సామాన్యధర్మములుగాక, నియమములు, నాచారములు భిన్నస్థానములలో భిన్నములై యుండును. [2] క్రమోన్నతినందిన కొలఁదియు నైతికజీవితమును క్రమముగా వికసించును [3] ఆచార నీతి నియమావళి కాలముతోఁ బెరుగుచుండును వైదిక విధివిధానము జ్ఞానమున కవిలంఘ్యము కాదు. వేదాధికారము లేనివారైనను బ్రహ్మవేత్తలైరి దీనులు, నీచవర్ణులును గూడఁ బూజా ప్రార్థనములవలనను, త్యాగోపవాసాదికములవలనను దైవ కృపకుఁ బాత్రులై, తన్మూలమున జ్ఞానమును మోక్షమును బొందవచ్చును. [4]

పరమార్థసిద్ధినంది బ్రహ్మవేత్తయైనవాఁడే శ్రేష్ఠుఁడగు బ్రాహ్మణుఁడు. అట్టి బ్రహ్మవేత్త యెట్లు జీవించునో చెప్పుటకు శంకరుఁ డీక్రింది శ్లోకము నుదాహరించినాఁడు:—

1) జ్ఞాపకం హి శాస్త్రమ్, న కారకం, శాంకరభాష్యము 2,1,20

2) శం భా. 1. 1, 4

3) శం, భా 1. 1, 4

4) శం భా 3, 4. 36-39

"ఏ యొక్కఁడు నెవ్వనిఁ గులీనుఁడనిగాని, కులహీనుఁడనికాని, పండితుఁడని కాని, దుర్వృత్తిపరుఁడని కాని భావింపఁడో యాతఁడే బ్రాహ్మణుఁడు. గూఢ ధర్మాశ్రితుఁడైన యట్టి విద్వాంసుఁ డీ లోకమున నంధ జడమూక జనుని వలె నవిజ్ఞాతుఁడై చరించుచు జీవితమును గడపవలెను. [1] అట్టి బ్రహ్మవేత్త జీవితము ధ్యానమయ నిష్క్రియత్వము గాదు అతఁడు వినయప్రపూర్ణుఁడై, పరమ పావనమ్మైన శాంత్యానంద మహాగంగా ప్రవంతిలో సుస్నాతుఁడై యీఁదులాడును. ఏకర్మ నాతఁడుచేసిన నది యాతని బంధింపదు. అతని కర్మ సామాన్యుల కర్మయింపు కర్మవంటిది గాదు. [2] కొందఱు ముక్తపురుషులు జీవనమాత్రార్థ స్వల్పకర్మములఁ జేయుదురు; కాని మఱికొందఱు లోక సంగ్రహార్థము మహాక్రియా పరతంత్రులగుదురు [3] ఇట్టికర్మ వ్యక్తి యొక్కఅహంకారము నుండి [4] బయల్వెడలునది కాదు. కావున నది యాతని సంసారబద్ధు నొనర్పదు. [5] ముక్తులైనవారు తమ మోక్షమును వలెనే తమతోఁబాటు లోకమును గూడఁ దరింపఁ జేయఁగలరు.

---

1) "యం న సంతం న చాసంతం, నాశ్రుతం న బహుశ్రుతమ్ న సువృత్తం న దుర్వృత్తం వేద కశ్చిత్ స బ్రాహ్మణః గూఢధర్మాశ్రితో విద్వాన్ అజ్ఞాతచరితం చరేత్, అంధవజ్జడవచ్చాపి మూకవచ్చ మహీం చరేత్" శం భా 3. 4, 50: డ్యూసెన్ (సిస్టం ఆఫ్ వేదాంత పు 240

2) విదుషః క్రియమాణమపి కర్మ, పరమార్థతోఽకర్మైవ (శం।భా। 4,21 )

3) శం।గీ।భా। 4, 19

4) ఈ।ఉ।భా। 3, 1,13

5) "ఎవఁడు మేల్కొనియు గాఢసుషుప్తియందలి వలె నుండి, ద్వైతమును జూడఁడో, చూచియు దాని నద్వైతమని యెఱుఁగునో, ఎవఁడు కర్మచేసియు ఫలసంగుఁడు కాఁడో, వాఁడొక్కఁడే నిస్సంశయముగా నాత్మజ్ఞాని " (ఉపదేశ సాహస్రి పు. 4, 5) "ఎవఁడు ప్రవృత్తిలో నున్నను, దనకర్మయందు మమకార ముంచఁడో, యాతఁడే నిజముగా జీవన్ముక్తుఁ డగును." 'ఎవఁడు సర్వవిషయసంగి యయ్యుఁ దాను వేఱొక వనిలో నున్నరీతిగాఁ, బ్రశాంతుఁడు, సకలుఁడు, నిత్య సంతుష్టుఁడు నగునో, యాతఁడే నిజముగా జీవన్ముక్తుఁడు " రాముఁడు వసిష్ఠు నడిగినాఁడు: "ప్రపంచ విషయ సంగతుఁడయ్యు దీర్ఘ సమాధియందు మేల్కొన్న వానివలెఁ బ్రసన్నుఁడై యుండఁగలవాఁడా ఏకాంతమందు సమాధి నిమగ్నుఁడై యుండువాఁడా" శ్రేష్ఠుఁడు: వసిష్ఠగురు లిట్లు బదులుచెప్పినాఁడు:

సంసారచక్రములోఁ బరిభ్రమించు వారికి వేదవిధులు, నైతిక నియమములు నవసరములే, కాని విరాగియై సంసారమందలి భేద దృష్టిని విడిచి, ప్రవర్తించువాని కవి వర్తింపవు.[1] ముక్తపురుషుఁడు తన యిచ్ఛవచ్చిన రీతిగాఁ బ్రవర్తింపవచ్చునా యను సమస్య బయల్వెడలినది. కర్మ ప్రేరణకుఁ గారణమైన స్వార్థవ్యామోహము ముక్తపురుషునికి లేదు. గావున నాతఁడనలే కర్మచేయఁడు.[2] అవిద్యావశుఁడై చేయుకర్మయు నాత్మజ్ఞానము వేళకాలమున నుండఁజాలదు.[3] ఇట్టి వాక్యములవలన ముక్తపురుషుఁడైనవానికిఁ కర్మయే లేదని బోధపడును గాని, స్వార్థరహితుఁడై, ముక్తసంగుఁడై ముక్తపురుషుఁడు కర్మచేయు నని చెప్పువాక్యములు శంకరుని రచనలలోఁ గానఁగును.[4] అతఁడు పాపకర్మ నెన్నఁడును జేయుట కవకాశమే లేదు. ధర్మసూత్రముల కతీతమైన యథేచ్ఛా ప్రవర్తనము మోక్షావస్థ కలంకారమనియు, ధర్మ నియమోల్లంఘనమున కది యాహ్వానము కాదనియుఁ జెప్పఁబడెను. ధర్మమునెడ నిర్లక్ష్యభావము నది యొంతమాత్రమును బోధింపదు. పాపమెన్నఁడు చేయుట కవకాశము లేని పరమాత్మానుసంధానము ముక్తపురుషుని కేర్పడును అనఁగాఁ బాపకర్మవిషయములో నాతఁడు మృతుఁడే. క్రైస్తవ మతములోని అంటినామియనుల భావముతో శంకరుని భావము పొరపడరాదు ముక్తపురుషుఁడు సర్వవాంఛాసిద్ధిఁ

దనస్పష్టియు వారి గుణములు నవాత్మరూపములని భావించు వారికిఁ గలుగు నంతరంగ శాంతియే సమాధిః రసకి ప్రపంచములో సంగము లేదను నిశ్చయ భావములోఁ జిత్తశాంతి నార్జించినవాఁడు ప్రపంచములో నుండవచ్చును-శోదా ధ్యానమగ్నుఁడు కావచ్చును వానిగ్ని వారి హృదయములోఁ బూర్తిగాఁ జల్లారిపోయినచో దా రిరువుర సమానముగా దనుకలో" (యోగవాసిష్ఠము; శివమ్మ ... వివేకములో నుదాహృతము).

1) నిస్త్రైగుణ్యే పథి విచరతాం కో విధిః కో నిషేధః

2) నచనియోగా భావాత్ సమ్యగ్దర్శినో, యథేష్ట చేష్టాప్రసంగం సర్వత్రాభి మానస్యైవ ప్రవర్తకత్వాత్ అభిమానాభావాచ్చ, సమ్యగ్దర్శినః శం భా 2,3,48

3) శం। భా। తై। ఉపోద్ఘాతము

4) శం। గీ। భా। 4, 21

పొందెడు గావున నాతనికిఁ గోరుట కెట్టివిషయమును [1] లేనిది నిజమేకాని యాతఁడు లోకసంగ్రహార్థము పనిచేయును. మరియు నాతనివిషయములో నైతికవిధి కర్తములేదని శంకరుఁడు చెప్పినాఁడు; యాతఁడు నీతినియమములను విసర్జించెనని యెచ్చటను చెప్పియుం లేదు. [2] ధర్మసంసిద్ధి యనఁగా, ధర్మవినాశము గాక, ధర్మనియ బద్ధమైన వ్యక్తిత్వ వికాసమని తెలియవలెను. మనలోఁ గల్మషము మిగిలి, పరతత్వ మింకను దూరమంతకాలమే నీతి నియమముల కర్తమున్న నీతినియమములు, మనము తప్పు చేయఁజూచునపుడు సవ్యమార్గము సూచించును. నాగరికత గల మానవునికి హత్యా చౌర్య సంబంధ లగు చట్టములతో నిమిత్తము లేనిరీతినే, ఆత్మరతుఁడగు ముక్తపురు నికి నైతిక నియమావళితో నిమిత్తము లేదు.

### 41—శంకర ప్రతిపాదిత ధర్మసూత్రముల కాక్షేపణావిచారము

శంకరుఁడు ప్రతిపాదించిన నైతిక నియమావళి విశేష విమర్శ నార్హమైనది. దానినిఁగూర్చి చేయఁబడిన యాక్షేపణలను మనము సంగ్రహముగాఁ బరిశీలింపనగును. [3] ఉన్నదంతయు బ్రహ్మ మొక టేయై, ప్రపంచము మిథ్యయైనచో నప్పుడు మంచిచెడ్డలకు భేదమే తొలఁగిపోవును. ప్రపంచము ఛాయామాత్రమైనచోఁ బాపము ఛాయ ఛాయయగును. ఛాయామాత్ర రూపములైన పాపదౌర్జన్యములఁ మనమేల మేలు మాదరాదు? ఇట్టి స్వప్నసదృశము పరత్యమున జీవితములో ధర్మముకొఱకేల మనము మన స్వార్థములను త్యా

---

1) శంగీభా 5

2) సురేశ్వరాచార్యుఁ డిట్లుచెప్పెను; "ఎవనిహృదయమున నాత్మ బ్రహ్మైక జ్ఞానసిద్ధి కల్గినదో, యాతనికి అద్వేషము మున్నగు లక్షణములు ప్రయత్నార్జితము లగుట, అవి ప్రయత్నములేకుండగనే సంపాదితము లగును"(నైష్కర్మ్యసిద్ధి4, 69,

3) అద్వైత వేదాంతము ప్రతిపాదించు ధర్మసూత్రముయొక్క నీతివిమర్శ మునకును, డ్యూసేన్ పండితుని పునర్నిర్మాణమునకును, "అద్వైతము ధర్మశాస్త్రము నకు బోగ్ పండితుని వ్యాసము మదరాసు క్రిస్టియన్‌కాలేజీ పత్రికలో 1916 డిసెంబ

మొదర్చి క్రమమునొందవలెను : ధర్మశాస్త్రము చెప్పు నానాత్వము నిజమైనచో, జీవితము నిజము, జీవిత మసత్యమైనచో, ధర్మసూత్రము లసత్యములే యగును. కేవల జగన్మిథ్యాభావమును మన మంగీకరించుకున్నచో, నీ యాక్షేపణ నిరర్థకమగును. పరమార్థసంపాదనములో ధర్మాధర్మములకు విలువగలదు.

జీవాత్మ పరమాత్మైకత్వమే సత్యమైనయెడల, ధర్మమునకు స్థానమే లేదని యాక్షేపింపఁబడెను. బ్రహ్మ మొక్కటియున్నచో, ధార్మికకృషి కవసరమే లేదు. ఈ యాక్షేపణ నిత్యానిత్య వస్తుభేద జ్ఞాన లోపముపై నాధారపడియున్నది. యథార్థముగాఁ గాలమున కతీతమైన బ్రహ్మమును, గాలగతములై, యసంపూర్ణములగు విషయములు నొకటేయని శంకరుఁ డెవటను జెప్పియుండలేదు. జీవాత్మ బ్రహ్మైక్యమను దెల్పు తాత్త్విక సత్యమువలన, వ్యావహారిక జగత్తులో నైతిక భేదముల ప్రామాణ్యము భంగపడదు. శంకరుఁ డిట్లుచెప్పినాఁడు, "నిప్పంతయు నొకటే, శవదహనము చేయు నగ్ని పవిత్రమైనది కాదందుము, సూర్యుఁ డొకఁడే, పవిత్ర ప్రదేశములోఁ బ్రసరించు సూర్యకాంతిని మనము పూజించి, కల్మషప్రదేశములలో వ్యాపించిన దానిని గర్హింతుము. మృణ్మయరూపములేయయ్యు మణులను రత్నములను మనము కోరుదుము, ఇతరమృణ్మయ రూపములగు శవాదులను మనము నిరసింతుము."[1] అదేవిధముగాఁ, బారమార్థికముగా సర్వవస్తువులు బ్రహ్మమే యైనను, గొన్ని గ్రహింపఁదగినవి, కొన్ని పరిహరింపఁదగినవి, యని తెలియవలెను, 'అహంబ్రహ్మాస్మి' యనఁగా, నహంకారసహితమగు జీవాత్మయే బ్రహ్మ మని యర్థము కాదు, ఉపాధివిరహితమైన శుద్ధాత్మయు బ్రహ్మము నొకటి యని తెలియవలెను.[2] ధర్మ జిజ్ఞాస కవసర మెట్లుకలుగు ననఁగా, నాత్మయొక్క నిజమైన యపరిచ్ఛిన్నతా స్వభావమునకును, వర్త

1) శం॥ భా॥ 2,3,48

2) వాదసామ నాధికరణ్యము

భా, 6—10

మానవుం డది ధరించిన పరిచ్ఛిన్నతా వస్త్రజాలములకును సంఘట్టన మొందెగనిదై పడచుచున్నది. మానవుల స్వస్వరూప మేకము నవికారమునై యుండఁగా, ఉపాధిశక్తి వలన నది వతనమొంది, వికృతినొందినది.[1] మన మేస్థితికిఁ బోయినచో సత్యము ప్రత్యక్షమగునో, ఆ స్థితిలో నున్నప్పుడు పరిచ్ఛిన్నతా దౌర్బల్యముతోఁ గలుగు పోరాటమునకర్థముండదు. పరబ్రహ్మమునుండి మనము వేరనుభావము సంపూర్ణనాశన మగువఱకు నట్టి పోరాటము జరుగుచునేయుండును. జీవాత్మ తాను పరమాత్మయని గ్రహించువఱకు, తదంతృప్తి మగ్నమై స్వస్థాన దూరత్వమువలనఁ గలుగు పరితాపముచేఁ దప్తమగుచుండును. పరిచ్ఛిన్నవ్యక్తులముగా మనకు విధులు, లక్ష్యములు నున్నవి. ప్రతి వ్యక్తియుఁ దానుచేయు కర్మకు బాధ్యుఁడై, ప్రవర్తింపవలసి యుండును.[2]

శంకరుని ధర్మసూత్రము బుద్ధిసంబంధమైనది, ఏలన నవిద్య లేక అవివేకము బంధకారణము.[3] సర్వవ్యాపారానుభవములకు నాధారము జీవుని మిథ్యాజ్ఞానము సమ్యగ్జ్ఞానము మోక్షకారణము.[4] జీవబ్రహ్మభేదజ్ఞానము మిథ్యాజ్ఞానమగుటచే యథార్థమైనజ్ఞానము దానినిఁదొలంగించును. దీనివలనఁ దెలియునదేమన, మోక్షసంపాదనమునకు వలయునది ధర్మశీల సంసిద్ధికాదనియుఁ, గేవల తాత్త్వికజ్ఞానమనియు స్పష్టము, అద్వైత వేదాంతముయొక్క మూలభూతమగు లోపమిదియే యని డ్యూసెస్ తలఁచినాఁడు, "సత్స్వరూపముయొక్క సమ్యగ్జ్ఞానమును సంపాదించుటకు మూలాధారమైన మనలోని 'నేను'ను నదియని వేదాం

1) ఎక్‌హార్టు అడిగినాఁడు "నానాత్వ ప్రవర్తిష్ణు యుండినచోఁ, దాను చక్రవర్తినని యెఱుంగకున్నచో నేమి లాభము?" స్వర్గరాజ్యము నష్టరాజ్యమే

2, శాం॥భా॥ 3,3,53, మహాభారతము 3,2,9

3) శాం॥భా॥ 2,3,48

4) శాం॥భా॥ 1,2,8:3,2,26, 4,28: 1,3,19

తము యుక్తముగాదే చెప్పినది.[1] కాని బుద్ధ్యుపకరణ సామగ్రియునాత్మ కవఁగా మిథ్యాప్రపంచములోని దని కొట్టివేసియు, జ్ఞాతయైన వ్యక్తి యొక్క విజ్ఞానమున కీయద్వైతతత్త్వమును ప్రకటించి, యంతటితో నాగిపోయిన పొరపాటు చేసినది; పరమాత్మకు నిలయము దేహార్థపతి బుద్ధియని చెప్పక హృదయమని చెప్పుటలో వేదాంతము శ్రేష్ఠతరమై నదీ."[2] ఏకమునద్వితీయమునగు బ్రహ్మమిదిపఱకే పరిపూర్ణతగలదైనదో, దాని యాథార్థ్యము నప్రతిహతముగాఁ బ్రకటించుటే మనము చేయవలసిన కర్తవ్యమును, దాని కితరమైనదెల్ల నసత్యమనుటే మన ధర్మము నైనచో, ధార్మికప్రవృత్తికిఁ జోదకశక్తియే లోపించును. మనకుఁగల పరిచ్ఛిన్నతాదోషనివృత్తికి దానినిఁ గాదనుటే చేయవలయు కార్యమైనచో నైతికదీక్ష కవకాశమేలేదు. ద్వేషమును జయించుటకుఁగాని, మన స్వభావపరివర్తనమునకుఁగాని మనము కృషి చేయునవసరములేదు. అవిద్య, ప్రధానముగాఁ దార్కికభావమేయైనను, శంకరుని తత్త్వములో నది సంపూర్ణమగు జీవితదృక్పథమే యగును. "దేహమే ఆత్మ యను నభిమానమే అవిద్య, అందుచే దేహమున కాధార ముదయించును, దాని స్వరూపమే రాగము, దానిని దూషించునది ద్వేషము, శరీరమునకు బాధ కలుఁగనోపు ననుభావములచే భయాదికము తల చూపును."[3] మిథ్యాజ్ఞానమే స్వార్థపరములగు నమరాగప్రవృత్తుల కాధారము.[4] పరిచ్ఛిన్నవ్యక్తియొక్క పరిచ్ఛిన్నతయే అవిద్య. దానిమూలముననే మానవుఁడు తన నిజస్వరూపము బ్రహ్మత్వ మని యెఱుఁగక, రాగద్వేషమయ జీవితమును గడపయత్నించును. మన

---

1) మిథ్యాజ్ఞానకృతఏవ జీవపరమేశ్వరయో ర్భేదోనవస్తు కృతః (శం॥భా॥1,3, 19)చూ॥ శం॥భా॥ గౌడపాదకారిక ఉపోద్ఘాతము చో॥ "జ్ఞానం వినా మోక్షో నసిధ్యతి" (ఆత్మబోధ) వివేకానందేశ మూర్తి జైవః (శం॥భా॥ 1,3, 19) చూ॥ అపరోక్షానుభూతి శ్లో 14

2) డా టీవ్, సిస్టమ్ ఆవ్ వేదాంత, పు॥ 59

3) దేహాదిష్వ నాత్మస్వహ మస్మీతి ఆత్మబుద్ధిరవిద్యా తత స్తత్పూజనే రాగః తత్పరిభవాదౌ ద్వేషః తదుచ్ఛేద దర్శనాద్భయమ్ శం॥భా॥ 1,3,2

4) శం॥భా॥ కేన ఉప॥ ఉపోద్ఘాతము సంసారబీజ మజ్ఞానమ్ కామకర్మ ప్రవృత్తి కారణం; మఱియు "అవిద్యా కామకర్మ లక్షణం సంసారబీజం,, శం॥భా॥ కేన ఉ॥ 4,9

శీలములోని దోషములు కేవలలోపములే కావు. అవి యాత్మస్వరూప వికల్పరూపములు. శంకరుఁడు తఱచుగా 'అవిద్యా కామకర్మ' [1] సమాసము నుపయోగించును. జీవనానాత్వము నిజమని నమ్ము దృష్టిదోషమవిద్య,[2] కామ మనిత్యవిషయానురాగము, అనఁగా దానిని సంపాదించుటకుఁగాను చేయు ప్రయత్నము ఇట్టి యవిద్యాప్రేరితమగు సహకారముచేయు కర్మయే సంసారకారణము.[3] అవిద్యవలనఁ గామము, కామమువలనఁ గర్మయు నుదయించును. మిథ్యాదృష్టిని భగ్గమొనర్చి, స్వార్థపరత నణఁచివైచి, సత్యకామము నుదయింపఁ జేయుటయే మోక్షసాధనమగును.[4] స్వార్థప్రవృత్తినణఁగఁద్రొక్కి, సత్కామముల నభివృద్ధినంది, అహంభావభరితమైన వ్యక్తిత్వమును నిగ్రహించుట ధార్మిక ప్రవృత్తి కవసరమగు శిక్షణలోనిది. అహంభావ వ్యక్తిత్వము నశించనిదే, మనకుఁ బరిపూర్ణత సిద్ధించదు. మనవ కామమును బయింది లోకకళ్యాణముకొఱకే పనిచేయవచ్చును; క మన జీవితములో నేదో సందర్భములో దుష్కామమునకు వశులమై స్వార్థపరులము గాకుండ నుండఁజాలము. కావున మన మవిద్యారూపమలైన మమాహంకర్తృత్వ భావములను బూర్తిగా నశింపఁజేసినఁగాని సమ్యక్జ్ఞాన విలసితమగు స్వచ్ఛ నిరహంకారదృష్టిని గలిగియుండఁజాలము. ధర్మనియమానుష్ఠాన తత్పరుఁడు యాదృచ్ఛికముగా నిష్కాముఁడగును. సమ్యక్జ్ఞానబలముచే మహర్షి నిష్కాముఁడగును.[5]

---

1) శాం।భా।బృ।ఉ। 3,1,1

2) అవిద్యాకల్పితం లోకప్రసిద్ధం జీవభేదం శాం।భా। 2, 1, 14; 3, 19

3) అనాత్మ దర్శినోహి అనాత్మవిషయః కామః కామయ మానశ్చ కరోతి కర్మ, తత స్తత్ఫలోపభోగాయ శరీరా ద్యుపాదాన లక్షణస్సంసారః శాం।భా।తై।ఉ। 1,11

4) సర్వవాసనాక్షయం సర్వకామనాశం సర్వకర్మప్రవిలయమ్

5) చూ। ఈ భావమును బాగుగా సూచించిన హిరియణ్ణ పండితుని వ్యా। ఇండియన్ ఓరియంటల్ కాన్ఫరెన్సు ప్రొసీడింగ్సు వాల్యూము 2 విశదమైన అద్వైత జ్ఞానమునకుఁ, గేవల తార్కిక జ్ఞానమునకుఁ భేదమును దెల్పుచు నాతఁడిట్లు చెప్పె "శంకరుని మాటలలో, నిత్యనూతనసృష్టి నందుచున్న కామకర్మ పరంపరచే జీవిత కామకర్మములు పోయినను, వాని కారణమగు నవిద్య బీజరూపముగ నున్నచో నది గనుపడదు; అవిద్యయు నిర్మూలనమైనచో, బ్రహ్మానందము" పు। 241

శంకరుఁడు పరోక్షాపరోక్ష జ్ఞానభేదమును వివరించినాఁడు. బ్రహ్మైక్యభావము యథార్థమని గురు,గ్రంథ వాక్యావళి వలన గ్రహింతర్క జ్ఞానము పరోక్షజ్ఞానము. తాను పృథగ్వ్యక్తినను భావము విడిచిపుచ్చి, బ్రహ్మైకత్వము ననుభవ పూర్వకముగా సాధించిన దపరోక్షజ్ఞానము లేక అనుభవజ్ఞానము.[1] పరోక్షజ్ఞానమువలన మోక్షసిద్ధి కల దని శంకరుఁడు చెప్పినాఁడు. బృహదారణ్య కోపనిష ద్భాష్యము శంకరుఁ డీవిషయమునుగూర్చి చెప్పినాఁడు.[2] సాధకుఁడు తాను పఠుఁడ నను భావమును విడిచి, క్రమముగా, బాలుని నిష్కల్మషమును గాంచి, దానినుండి మౌనిభావము నార్జించి, తుదకు, బ్రహ్మములగు సర్వార్థకామములను విసర్జించి, బంధరహితమగు బ్రాహ్మణసిద్ధిని బొందవలె నని శంకరుఁడు వివరించెను. అందుచే నద్వైతః తత్త్వము, మతముకూడనై యున్నది. బ్రహ్మవిద్యవలన నిశ్చయ బ్రహ్మానుభవము సద్యస్సంపాదిత మగును.[3] కాలాంతరమం దెప్ప ఫలితముఁజూపునది బ్రహ్మవిద్య కాదు.

ఇదే విధముగా, బ్రహ్మానుభవసిద్ధికిఁ జిత్తశుద్ధి ముఖ్యమైన సామని చెప్పఁబడెను. రజస్తమోగుణముల నణఁచి సత్త్వగుణమును పెంపఁజేయుటే చిత్తశుద్ధి.[4] ఇదితపస్సాధనలవలనను, నిష్కామ వలనను లభించును. ఇందు ధర్మప్రవర్తన మతిక్రమింపఁబడ ఇమిడియుండును. "ఎవనికెన్నఁడహంకారమమకారము లసత్యమ

---

1) చూ : పరాపూజోపనిషత్తు

"అత్రిబ్రహ్మేతి ద్వైత పరోక్షజ్ఞానమేవతత్,
అహం బ్రహ్మేతి దేవదాసాక్షాత్కారస్య ఉచ్యతే

2) 3,8,10 మరియు చూ: బృం: ఉ: 4,1,7

3) చూ: సెయింట్ మాథ్యూ 18,3.

4) శరుధయారూఢమేవచ విద్యాభవం పత్రియాఘం పఠ్యాలాంతర భవి 3,4 15)

తెలియునో, వాఁడప్పు డాత్మవిదుఁడగును"[1] కామము నణఁచివైచినఁ గాని, అవిద్య నశింపదు. జ్ఞానమనఁగా నాంగ్లభాషలోని జ్ఞానపదార్థమే కాదు. జ్ఞానమనఁగా నిజమైన విద్య, సంపూర్తిగా సుస్థిరతనొందిన జీవితలక్షణము.[2] జ్ఞానమనఁగా నొకసిద్ధాంతము నంగీకరించుటగాదు జ్ఞానమనఁగా నసుభవసిద్ధి; బుద్ధిజ్ఞానము దానికి బాహ్యచిహ్నమే. శంకరుఁడు కేవల ప్రజ్ఞాసామర్థ్యమున కెక్కుడు విలువనీయలేదు. సత్యమును దెలిసికొనుటకు బుద్ధిజ్ఞాన మసమర్థమని తెలియు బుద్ధిజ్ఞానమే శ్రేష్ఠమైనదని యాతఁ డభిప్రాయపడెను. మోక్ష మనఁగా నవిద్యానాశనమే; కాని యవిద్యా నిరసనమాత్రముచే నది లభింపదు. బ్రహ్మాస్తిత్వమును మనబుద్ధిశక్తిచే గ్రహించినంత మాత్రమున మనము బ్రహ్మవేత్తలము కాఁజాలము. బ్రహ్మజ్ఞాన మనఁగా, మన మూలస్వరూపము బ్రహ్మమని, విశ్వసించుటే గాక, నిజముగా జీవితమును బ్రహ్మమయ మొనర్చుటే యగును

శంకరుని తత్త్వములో నింకొకదౌర్బల్య మేమనఁగా నాతఁడు ప్రతిపాదించు నైతికధర్మము పారమార్థికముగా సత్యముగాదని చెప్పఁబడెను. మన 'అహం' వ్యక్తిత్వము లోకములో నితరవస్తువులనుండి భిన్నమైనదనియు, దేశకాలములలో దానికి పృథక్స్థితి గలదనియుఁ దలఁచినంతకాలము నీతినియమముల కర్థమున్నది నైతికప్రపంచము తనయందలి వ్యక్తులకు పృథక్త్వమున్నదని నిశ్చయించుటచే, నసత్యజగత్సంబంధమైనది. నీతివిధులు, తత్ఫలితములైన వాంఛాసిద్ధులు, వ్యక్తిగతము లైనవే, పరిచ్ఛిన్న జీవుల పృథగ్వ్యక్తిత్వముల పైనవే, కర్మయుఁగర్మ ఫలములు నాధారపడి యున్నవి. మన మెంతవఱకు వ్యక్తిగత మగు ధర్మసూత్రముల దృక్పథములను గలిగి యుందుమో, భ్రమ ప్రమాదములతోఁ గూడిన సంసారమందంతకాలము ముందుమనియు చెప్పవలెను వ్యక్తిగతమైన దృక్పథమును క్రమముగా విడిచి, తాను బ్రహ్మము నను భావమును బొందుటే, నైతికాభి

---

1) సవదేశ సాహ్న 14,29, చూ: 14, 141; శం: భా: కేన ఉ. ఉపోద్ఘాతము

2) చూ: ప్లేటో టిమేస్, పు 90; అరిస్టోటిల్ నికోమకియాన్ ఎథిక్స్ 10 7

వృత్తిలక్షణము, వ్యక్తిగతభావము నశించి, బ్రహ్మభావము సంపూర్ణముగాఁ గలుగుటతోడనే, నీతిప్రవర్తనావసరము తొలఁగిపోవును. ధార్మిక ప్రవృత్తి కవసర మున్నంత కాలము బ్రహ్మసంసిద్ధి లక్ష్యము దూరస్థమే యగును. ధర్మానుష్ఠానమునకు లక్ష్యము మన సంకుచిత వ్యక్తిత్వము నతిక్రమించి విశ్వాత్మ భావములో లీనమగుటే, కాని యీ ధార్మిక వ్యక్తికిఁజెందిన పృథగ్వ్యక్తిత్వభావలేశము మిగిలియున్నంత కాలము, మన యూర్ధ్వగమన మసంపూర్ణమై యుండును. కాని, పరిచ్ఛిన్న వ్యక్తిత్వము విడువకుండ, నపరిచ్ఛిన్నాత్మసంసిద్ధిని గాంచుట దుస్సాధ్యమను విషయము స్పష్టము. ఈ లక్ష్యసిద్ధికి మన నైతిక వ్యక్తిత్వము నతిక్రమించి, తత్సంబంధమగు దీక్షా నియమముల నధిగమించిన తత్త్వ సాక్షాత్కారసిద్ధి నొందవలెను అందుచేఁ బరిపూర్ణజ్ఞానసంసిద్ధి నార్జించు విషయములో, మన వ్యక్తిగత మగు కృషియు, ధర్మానుష్ఠాన ఫలితమును సరిపోవని శంకరుఁడు తఱచుగా నుద్ఘాటించి యున్నాఁడు. కర్మవలన మోక్షములేదు. పరిచ్ఛిన్నతను మన మతిక్రమింపవలెను. పరిచ్ఛిన్న జీవిత మూలబీజమగు నవిద్యను నిగ్రహింపవలెను నిజస్వరూపము బ్రహ్మమని తెలియుటకును మన మవిద్యా కామకర్మమూలమగు సంసార బంధములను ఛేదింపవలెను. మన మెంత ధర్మవర్తనులమైనను, మనయోగ్యత మన పరిచ్ఛిన్నతను బోఁగొట్టి అవిద్యా సంబంధములను భగ్నమొనర్ప లేనంతకాలము, మోక్షము మనకు దూరమైయుండును. అందుచే నెట్టి కృషిచేసినను మోక్షసిద్ధి లేదని శంకరుఁడు వాదించును; ఏలన, నే కర్మయైనను, వైదికవిధి నిర్వహణమైనను, లేక యీశ్వరారాధనమైనను, మనవ్యక్తిత్వమునంటిపట్టుకొనియుండు పరిచ్ఛిన్నతనట్లే యుంచుటచే, మన సంసార పరిభ్రమణము సాగుచునేయుండును ఈ సంసారచక్రము నుండి విముక్తి నిచ్చునది జ్ఞానమొక్కటే, జ్ఞానమే మన పరిచ్ఛిన్నావధులను దాటించి, బ్రహ్మైక్యసిద్ధి నిచ్చును[1] పరిణామస్వభావముగలది

1) ఈ విషయములో శంకరునిభావములో బొసాంకె సం[illegible] [illegible] సామ్యమున్నది మోక్షమునకు శంకరుని జ్ఞానము వలెనే, బొసాంకె [illegible] [illegible] నాఁడు వోల్చు: "కర్మవలనఁగాక, శక్తిచే మనము పరిపూ[illegible] దానిలో నేకము

ధర్మానుష్ఠానము, స్వయంసమృద్ధమైన సత్యము నది సంపాదింప జాలదు. మానవజీవితమునకు నైతికాభివృద్ధియే ప్రధానమైన దైనచో మనము శుద్ధులమై స్వస్వరూపసంసిద్ధిని బొందుదశ మన కెన్నటికి రాదు. మానవుని సహజరూప మీశ్వరుఁడే యైనచో నీశ్వరుఁడవని మానవుఁడు చెప్పుస్థితి నందినచో నప్పుడింక నైతిక ప్రవర్తనావసరమే లేదు. నీతినియమముల ననుష్ఠించుటచేఁ దృప్తిగాంచు వాఁడాత్మ సాక్షాత్కారమువలని సంతృప్తినిఁ గాంచఁజాలఁడు. నైతికజీవితమే సర్వమ నైనచో, ధర్మానుష్ఠానముచే ముఖ్యమైన జీవితముగూడ వ్యర్థమ యగును; ప్రేమభక్తికమే యగును; ఆనంద మందరానిఫలముగాఁ బరిమించును. నీతినియమములచే ముక్తిగాంచుట దుర్లభమని సెయింట్ పాల్ నుడివియున్నాఁడు.[1] మన మేమిచేసినను, మనస్వార్థము విసర్జించినఁగాని, మనము తరింపఁజాలము. స్వార్థపరులమై మనము ధర్మోపదిష్టవిధులను నెరవేర్పవచ్చును గాని, యుక్తి విధి నిర్వహణమ ధర్మప్రయోజనము గలది కాఁజాలదు. మనలోని పాప స్వభావమ నున్మూలించుటకు, శంకరుని మాటలలో నవిద్యానివృత్తికి, భక్తిసాధమని పాల్‌ను, జ్ఞానమని శంకరుఁడును వచించిరి. ఆత్మజ్ఞానమే మ పరిచ్ఛిన్నతను భేదించి, పాపమునతిక్రమింపఁ దోడ్పడును. మోనుఁగా నొకమాత్మ నిర్మాణముగాని, కల్పనముగాని కాదు, అ లోనున్నదాని నావిష్కరించుటే. ధర్మఫలము బాహ్యమైనది. జ్ఞానమ స్వయంసంపూర్ణమైనది. జ్ఞానమునకు లోపముగాని, లక్ష్యముగాని యుద్దేశ్యముగాని లేదు శాశ్వతమై స్వయంసంపూర్ణమైన మోక్షమ

---

ఇతడు మనలోపలను పూరింపఁజాలడు తరింపఁజేయునటువంటి కిరియేసుర్థన విశ్వాత్మకుఁడగు పరమేశ్వరుని కృపచే మనము దానముంచి, యాశ రై శక్యమును మనః గాంచి, మన పరిచ్ఛిన్న బుద్ధి కది విరుద్ధముగాఁ దోచుచుఁగాంతుము.,, (ది మీటింగ్ ఆ ఎక్స్ట్రీమ్స్ ఇన్ కాంటెంపరరి ఫిలాసఫీ పు. 173) చూ. హైంద. సం. చూ. వాల్యూ 30; పు. 98)

1) ఎపిసిల్ టు ది రోమన్సు 3,8,10; ఎపిసిల్ టు గాలేషియన్సు 2, 3

కర్మవలన లభింపదని శ్రుతి చెప్పుచున్నది [1] కాను నిరసింపవలయు మత విద్రోహభావములను మనసులోనుంచుకొని యొక మత సిద్ధాంతముయొక్క అర్థనిర్ణయము చేయుటే సిద్ధాంత తాత్పర్యనిర్ణయమునకు నిర్దుష్టమైన సూత్రమని మనము జ్ఞాపక ముంచుకొన్నచో, మోక్షసిద్ధికి సాధనముగాఁ గర్మమార్గము నిరుపయోగమని శంకరుఁ డుద్ఘాటించుటలోని అతిశయోక్తి కర్థము సువిదితము కాఁగలదు. మోక్షసంపాదనమునకుఁ గేవల కర్మకలాప నిర్వహణమే సామర్థ్యము గలదను వాదమును మీమాంసకు లతిశయోద్ఘాటన మొనర్చిరని శంకరుఁడు భావించినాఁడు. మీమాంసకులు వైదిక కర్మకాండ కిచ్చిన విపరీత ప్రాముఖ్యమునకుఁ బ్రతిగా శంకరుని కర్మ నిరసనము నర్థము చేసికొనవలెను. అజ్ఞాన నిర్మూలనమే మోక్షము "అవిద్యా నాశనమే పరమార్థ సిద్ధి." [2] "బ్రహ్మస్వభావమును గూర్చిన అవిద్యా నిర్మూలనముతో, స్వాత్మ సంస్థితుఁడై, మానవుఁ డుత్తమస్థితి నొందును," [3] బ్రహ్మము నెఱుఁగుట యనఁగా మన కిదివఱకు లేనిదానిని సంపాదించుట గాదు, మన మజ్ఞానవశమున మఱచిపోయిన మన నిజ స్వభావమును గుర్తించుటే. అది సర్పమను భ్రాంతి తొలఁగినంతనే, రజ్జుజ్ఞాన మెట్లు ప్రకాశించునో, [4]

---

1) నాస్త్యకృతః కృతేన శంకరుఁ డిట్లు వివరించెను: అకృతో మోక్షః కృతేన కర్మణా నాస్తి। మూ। శం। భా। ౧।౨।౧౨। ఈ ఉద్ఘాతము నుండియు, "కర్మయనఁగా మున్న సర్వవస్తు స్వభావములను వేరై, యొకవ్యక్తి మానిన శక్తిపై నాధారపడునది జ్ఞానము ప్రమాణజన్యము వస్తుతంత్రము ప్రమాణము; అది వేదవాక్యములపైఁగాని, మానవ మానసముపైఁగా యాధారపడదు" (శం। భా। 1,1 4) (మూ। శం। భా। 1,4,22) మాధ్యమికుల జ్ఞాన సంభారములవలన ధర్మకాయమును, పుణ్యసంభారముల వలన సంభోగ కాయమును లభించునని చెప్పిరి (మాధ్యమికావతారము, 3,12) చూ। శీర్ వ. తీరుని బౌద్ధతత్త్వము, పు। 277.

2) శం। భా। ముం। ఉ। 1 5 అవిద్యాస్తమయో హి పరప్రాప్తిః అవిద్యా నివృత్తి రేవ మోక్షః।

3) శం। భా। తై। ఉ। ఉద్ఘాతము, 'అవిద్యా నివృత్తౌ స్వాత్మన్యవస్థానం పరప్రాప్తిః,,

4) శం। భా। 3,2,21

అజ్ఞే, అవిద్యా నిర్మూలనముతో విద్య ప్రకాశించును.[1] కాలాంతరిక ఫలితముల నిచ్చుకర్మ, నిత్యము నిరామయమునైన మోక్షము నీయఁజాలదు. కర్మ అవిద్యను దొలగింపఁజాలదు, ఏలనఁ గర్మ విద్యలు పరస్పర విరుద్ధములుగాన. కర్మ పూర్వమైనది జ్ఞానమని చెప్పఁబడినపుడు, జ్ఞానమనఁగా బాహ్యవస్తుజ్ఞానమేగాని బ్రహ్మజ్ఞానమని యర్థము కాదు ఒక కామమునుసాధించుటకే కర్మచేయుదురు. మోక్షము కర్మతో నన్వయింపదు. కర్త, తనకుఁ బ్రత్యేక వ్యక్తిత్వముగలదనియుఁ, దానార్జింపవలయువస్తువు తనకువేరై యున్నదనియు నమ్మకున్నచోఁ గర్మకర్తృములేదు.[2] కాని యీ విభేదము లున్నంతకాలము మోక్షప్రాప్తి లేదు. "భిన్నత్వ దర్శనముతో మోక్షముండదు; భిన్నత్వదర్శనము లేనిదే కర్మలేదు."[3] చేయఁబడిన కర్మలవలన నీ దిగువ వానిలో నేదో యొకఫలితము సంభవించును, "నూతన వస్తువు (ఉత్పత్తి), వికారము, సంస్కారము, ఆప్తి" మోక్ష మిందేదియును గాదు.[4] కర్మకుఁ జిత్తశుద్ధి నిచ్చు బలము గలదు, కాని, యది అసంపూర్ణదృష్టిపై నాధారపడునదగుటచేఁ, బరప్రాప్తిసాధనము కాఁజాలదు. జ్ఞానమే మోక్షసాధనము.[5] కొన్నిచోటుల శంకరుఁడు దీని నతిశయముగా నుగ్గడించినాఁడు. "కర్తృకర్మఫలాదిభేద విరహితమైన బ్రహ్మజ్ఞానమునకు బాహ్యమైన సహకారశక్తిగాని సహాయసంపత్తిగాని యవసరమని తలఁచుట సహేతుకము గాఁజాలదు, బ్రహ్మజ్ఞాన ఫలమైన మోక్షమునకుఁ గూడ నెట్టి బాహ్య సహకారము నవసరములేదు; కావున, జ్ఞానము, స్వభావముచే నెట్టికర్మ రూపమగు పరసహకారసంపత్తినిఁ గోరదు."[6] నిత్యకర్మానుష్ఠానమువలన జన్మాంతరపాపములు నశించుననియు గామ్యకర్మములవలన వాంఛితార్థసిద్ధి యగుననియు శంకరుఁడంగీకరించును. నిత్యనైమిత్తిక కర్మ

1) శం॥ భా॥ 2,1,14
2) శం॥ భా॥ ఛాం॥ ఉ॥ ఉపోద్ఘాతము
3) శం॥ భా॥ ఈశ ఉ॥ ఉపోద్ఘాతము
4) శం॥ భా॥ తై॥ ఉ॥ 2, 11
5) ఆత్మబోధ శ్లో॥ 203.
6) చూ॥ శం॥ భా॥ ఈశ ఉ॥

ఫలములు తాత్కాలిక కామపరితృప్తి నిచ్చునేగాని, నిత్యమగు పరమార్థ సంపత్తినీయఁజాలవు. కామ్యకర్మలను, నిషిద్ధకర్మలను చేయుట మాని, ప్రారబ్ధ కర్మఫలముల ననుభవించుటచే నశింపఁజేసి, విధి కర్మాచరణముచే నాగామి కర్మఫలక్షయమును సాధించినచో, నే యితరసాధనముతో నిమిత్తము లేకుండ మోక్షము సాధ్యమని మీమాంసకులు చెప్పుదురు. ప్రారబ్ధములు కాని కర్మ లనంతములుగా నున్నవి. వాని ఫలితము లొక జన్మములోఁ బూర్తికావు, వీనివలన ననేక జన్మములు, జన్మములలో తిరిగి యనేక కర్మలు పెరుగుచునేయుండును. కర్మమూలమగు కామమునశింపఁజేసినఁగాని మనకుపాయాంతరములేదు. అవిద్యయే కామములకుఁ గారణమగుటచే, విద్యయే మనలఁ గర్మబంధములనుండి విడిపింపగలదు.[1] అందుచే బాహ్యకర్మలను మూలాధారముని బ్రహ్మవిద్యనిర్మూలించును.[2] బాహ్యప్రవర్తనముకంటెఁ బ్రధానమైన దాంతరంగికజీవితము. అంతరంగమునఁ జెలరేగు విషమ సనస్యలు బాహ్యసూత్రములచేఁ బరిష్కృతములుగావు. మన యేకాంత హృదయములు, ధ్యానప్రార్థనములు జీవితసమస్యా పరిష్కారములోఁ దోడ్పడును. అందుచే సముచిత దృష్టిని సంపాదించుటే సర్వోత్తమ ధర్మము. మన చిత్తము నాత్మాయత్త మొనర్చుటలోనే ధార్మికప్రజ్ఞా రహస్య మిమిడియున్నది. ఆత్మజ్ఞానఫలితమే ధర్మజీవనము. ఆత్మజ్ఞానములేని ధర్మజీవనము బాహ్యనియమాచరణమే యగును.

ఇంకొక యర్థములో మానవుని భిన్నదశల ననుసరించి యుండునవే ధర్మవిధులు. సాంఘికప్రయోజన ప్రదములైనవే ధర్మనియమము లను నభిప్రాయము నేటి ప్రపంచములో నంగీకరింపఁబడినది. సంఘ

1) శాం॥భా 1,1,4 పోల్చు॥ ప్లేటో: "తత్త్వజ్ఞానులగువారు కేవల మంచికొరకే సత్కార్యములు చేయుటవలన, జన్మాంతరపరిభ్రమణమును మాని యనుభవించెదరు. వారికిదా దోషము దీరువరకును, గొప్ప జ్ఞానవంతులైనను తిరిగి జన్మించుచున్నప్పటికిని ములగదుపుదురు. మరియుఁ గొందరుత్తములైనవారు గావచ్చును. కాని పరిశుద్ధుండగు తత్త్వవేత్త యనఁగా జ్ఞాని తన్ను మరల్చుకొనుటకు మనసుంచినచెనుక దేవతాసర్గములో జన్మింపఁజాలఁడు" (ఫేడో పు 82)

2) ఇదానీం కర్మోపాదానహేతు పరిహారాయ బ్రహ్మవిద్యా ప్రస్తూయతే। (శాం॥భా॥ తై॥ ఉ॥ ఉపోద్ఘాతము)

ములను గూర్చిన మన భావములకే కాక, భగవంతునిగూర్చిన మన భావములకుఁగూడ భిన్నమై యున్నది.

ఆత్మజ్ఞానము కర్మకు వ్యతిరేకమైన దనియు, రెంటికి స్వప్న ముందైనను సంబంధములేదనియు శంకరుని నిశ్చితభావము. కర్మనిష్ఠులైన గృహస్థు లయ్యు, జ్ఞానసిద్ధులై, శిష్యులకు బ్రహ్మజ్ఞానదాన మొనర్చినవారుగలరని శ్రుతులు పేర్కొన్నవను విషయమునకు సమాధానము చెప్పుచు, ప్రత్యక్షముగా సత్యమగుదాని నెట్టి విషయమును నిరసింపఁజాల దనియు, "వేయి సూత్రములైనను వెలుతురును చీఁకటి గాఁజేయునట్లు చేయఁజాలవు; ఇంక మనమాట ప్రసక్తి యేల" యనియు శంకరుఁడు పలికినాఁడు.[1] ఈ వివాదమంతయును "కర్మ" పదమును నిశ్చితార్థములో నుపయోగింపక పోవుటచేఁ దటస్థించినది. స్వార్థపర మగు ఫలాకాంక్షతోఁ జేయబడినచోఁ గర్మ కాత్మజ్ఞాన విరోధ మేర్పడుట నిజమే. ఆత్మజ్ఞానము నార్జించిన వెనుక నొక వ్యక్తి లోకసంగ్రహార్థమై చేయు కర్మ, యాతని బంధించి సంసారమున్ను నొనర్పఁజాలదు. కామ్యకర్మయు నాత్మజ్ఞానమును గలిసి యుండఁజాలవు.[2] జ్ఞానకర్మలు రెండును, కాంతితమస్సులవలె నసంగతము లైనచోఁ, గర్మయనఁగా, గామ్య కర్మయనియు, జ్ఞానమనఁగా స్వార్థరహితమగు జ్ఞాన మనియు మన మర్థము చేసికొనవలెను. ముక్తపురుషుఁడు చేయు లోకసంగ్రహార్థమైన కర్మప్రవృత్తి యనరాదు. శంకరు ననుసరించి ముక్తపురుషుఁడు చేయు దానినిఁ గర్మ యనరాదు. "ఆత్మరతుఁడై, తాను జేయు నిత్యకర్మలలో నానందమును గాంచుచు విలసిల్లు వాఁడుత్తమ బ్రహ్మవేత్త"[3] యని చెప్పిన ముండకోపనిష ద్వాక్యమునకు భాష్యము వ్రాయుచు శంకరుఁడిట్లు వ్యాఖ్యానించెను.

---

1) విద్యాకర్మవిరోధాచ్చ నహి బ్రహ్మాత్మైకత్వదర్శనేన సహ కర్మ స్వప్నేఽపి సంపాదయితుం శక్యం యత్తు గృహస్థేషు బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృత్వాది లింగం న తత్ స్థితం న్యాయం బాధితుం ఉత్సహతే నహి విధిశతేనాపి తమఃప్రకాశయోరేకత్ర సద్భావః శక్యతే కర్తుం, కిముత లింగైః కేవలైరితి, (శం। భా। ముం। ఉపోద్ఘాతము)

2) శం। భా। భగ। అ॥ 18 3) 3, 1, 4

"ఈవాక్యము కర్మజ్ఞానసంబంధము నంగీకరించెనని తలఁచుట మూర్ఖుల ప్రలాపము"[1] కొంత ప్రవృత్తి యంగీకరింపఁబడిన మాట నిశ్చయము. శంకరుఁడు చెప్పున దేమన, ముక్తపురుషుని ప్రవృత్తి, అహంకారముపై నాధారపడిన కర్మ యునరాదు[2] ఇంకొక వాక్యములో నాతఁ డిట్లు చెప్పెను: "జ్ఞానియైనవానికి, జీవితమంతయు నాతఁ డెట్టి కర్మచేసినను, కర్మసంగమములేదు, ఏలన జ్ఞానమహత్త్వమట్టిది."[3] సంసారమునకు బంధించు జన్మాంతరముల నిచ్చు ప్రవృత్తికే కర్మయని పేరు; ఏలన నిట్టి కర్మ జ్ఞానమున కవరోధమును గల్పించును. కాని ముక్త పురుషుని కర్మ యిట్టిదికాదు, ఏలన నది కామకలుషితము గాదు. ముక్తపురుషుఁడు సర్వకామములను జయించినాఁడు, ముక్తపురుషుని కెట్టి సంసారబంధములేని దివ్యావస్థ నుగ్గడింపఁ దలఁచినప్పు డాతఁడు కొన్ని చోటులలో సర్వ కర్మలు దుఃఖహేతువులగుటచే ముక్తపురుషుఁ డెట్టికర్మయుఁ జేయఁజాలఁడని చెప్పినాఁడు[4]

సన్న్యాస ధర్మమునకే ప్రాధాన్య మిచ్చెనని శంకరుని తత్త్వ మును గూర్చి యింకొక యాక్షేపణము కలదు. వ్యావహారికజగత్తులో నిజముగా సంపాదింపఁదగిన దేదియును లేదని శంకరుఁడు వేనోళ్ళఁ జాటినాఁడు.[5] మనకును మన ప్రేమపాత్రులగువారందరకును, నేఁడు గాకున్న రేపైనను జరామృత్యువులుగలవనియు, మనకుఁ బ్రియములైన సర్వవస్తువులు శ్మశానభస్మముగా మారిపోవు ననియు నిశ్చయము. ఆత్మ నిలుచుటకు సరియగు స్థిరమైనతావు లోకమున లేదు. సంసార

1) అనన్తృంలపిం ప్రేమైంత్, మరియుఁ జూడు శం. భా. దాం. ఉపోద్ఘాతము

2) కర్మహేతుః కామస్స్యాత్ (శ్రీ, ఉ, శం, భా, ఉపోద్ఘాతము)

3) శంభా 3,4,14; చూ: శంకర గీతా భాష్య 2,23,1.

4) శం, భా, 2, 3, 40

5) బోల్సు: తావ్ 2,15-17 "ప్రపంచమునుగాని, దానియందలి దేనిని గాని ప్రేమింపకుము ప్రపంచవ్యామోహముగల వానికి జగత్పితపైఁ బ్రేమయుండదు. దేహేంద్రియ కామవస్తువులంతయు లోకమునకుఁ జెందినదేకాని, దేవునికిఁ జెందదు. లోకము, కామవస్తు సహితముగా నశించిపోవును గాని, యీశ్వరేచ్ఛ ననుసరించు వాని నాశనము లేదు."

సంగత్వముయొక్క వ్యర్థత నొక సుప్రసిద్ధమైన యుపాఖ్యానము చెప్పుచున్నది. తన్నుఁ దరుముకొని వచ్చుచున్న యొకవ్యాఘ్రమునుండి కాపాడుకొనునిమిత్త మొకప్రయాణికుఁడు పరుపెత్తి యెదుటనున్న యొక పాడుబావిలో దుమికెను. కానిబావిలో నడుగున నొక దారుణ విషసర్పము నోరు తెఱచి, కోరలుసాచి, విషానల జ్వాలలను గ్రక్కుచున్నది. అతఁడు వ్యాఘ్రభయముచేఁ బై కిరాఁజాలఁడు, సర్పభీతిచేఁ గ్రిందికిఁ బోఁజాలఁడు, నూతిగోడనుండి బయటికిఁ బెరిగియున్న యొక చిన్నమొక్కను బట్టుకొని నిలిచియున్నాఁడు. అట్లు నిలిచియుండుటచే నాతఁ డలసటఁజెంది, మరణము తప్పదనిశ్చయించినాఁడు అన్ని వైపులనుండియు మృత్యువు ముసురుకొని వచ్చుచున్నను, నాతఁడా మొక్కనుబట్టుకొని ప్రాణశక్తిచే వ్రేలాడుచున్నాఁడు, కాని, సితాసిత మూషకద్వయ మామొక్క మొదలును విసుగు విరామములేకుండఁ గొఱికివేయుచున్నది. క్షణములో నాతనికాధారమైన మొక్క తెగి పడిపోవుటచే నాతఁడు మృత్యువునోటఁ బడవలసియున్నది అట్లే సంసార యాత్రికులమగు మనము, జీవితములోని దుఃఖముల నెఱుఁగుదుము. మనము మమకారముతోఁబట్టుకొని యూగిసలాడు వస్తువులన్నియు క్షణికములని యెఱుఁగుదుము. కాని సుఖలేశమునిచ్చు నీ యడవిమొక్క యాకులలోనున్న తేనెచుక్కలకై యాశించి, నాలుకలుసాచి నాకుచున్నాము. దారుణ సర్పరూపమున మృత్యువునోరు తెఱచుకొని యున్నదని యెఱిఁగియు, మనమువట్టుకొనినకొమ్మలను, సితాసితమూషకములను నహోరాత్రములు కొరికివేయుచున్నవని తెలిసియు జీవితమును వ్యక్తిభ్రాంతి తొలఁగి పోవుటలేదు, విషసర్ప మెదుటనున్నది. కాని మధుబిందువులు తియ్యగానున్నవి. ఈ సంసారవృక్షమే పరమార్థమని నమ్మి, మనలో నంతర్వర్తియైయున్న యాత్మకు సంతృప్తి కలుగఁ జేయున దెద్దియు నీసంసారమునలేదను ఘోరసత్యాంశమునెదుర్కొనుట కిచ్ఛగింపము. పరమార్థసంసిద్ధి, నిర్విశేష సర్వసంగ త్యాగముల ఫలితమని శంకరుఁడుద్ఘోషించినాఁడు. కామము సంపూర్ణ వినాశమంది, సుఖదుఃఖములను రెంటిని విడిచిపెట్టుటచే మోక్షసిద్ధి కలుగును. పరమార్థ ధర్మాచరణముకాని, మహోజ్జ్వల ప్రజ్ఞా సామర్థ్యముగాని, పరమార్థ సంసిద్ధి నిచ్చుటకుఁ జాలవు దేహాభిమానమునువిడిచి, త్యాగ

మరియు జీవితమును గడపుమని శంకరుమపదేశము. ఆత్మకు శత్రువు కేవల దేహముకాదు. "నేను" "నాది" యను దేహాభిమానపాశమే ప్రబల శత్రువు. [1] జీవన్ముక్తునికి దేహ మున్నది, కాని యాతని మోక్ష మున కది యాటంకముగాదు అజ్ఞానిదేహ మాత్మజ్ఞాన వికాసమున కవ రోధసహ్రమును గలుగఁజేయును గావున దేహసంసర్గముచే నాత్మశక్తి యణఁగిపోవునని శంకరుఁడు వాదించినాఁడు. దేహసంబంధమైన కామ మోహములను దహనముచేయుఁడని శంకరుఁ డనేకరీతుల ఘోషించి యున్నాఁడు.

శంకరుని జగన్మిథ్యావాదము ననుసరించి, సాంఘిక జీవితమున కవకాశము లేదని యింకొక యాక్షేపణము గలదు ప్రపంచ మసత్య మైనచో దాని విషయములో నెట్టి ప్రసక్తియు మన కుండనవసరము లేదు జగత్తు మనలను బంధింపకుండఁ జూచుకొమ్మనలేదు. జగత్తునే విసర్జింపుమని శంకరుని భావము శంకరునివాదము జగ ద్బహిష్కారముగాని జగత్సంస్కారముగాదు. సాంఘిక వ్యవస్థలను సంస్కరించు ప్రోత్సాహ మాతని తత్త్వ ముపదేశించుటలేదు. కాని యిది శంకరుని భావము కాదని శంకరునిజీవితమే ముక్తకంఠముతోఁ జాటుచున్నది. వ్యక్తిత్వ మనఁగా, వ్యక్తిపరమైన స్వార్థపరత కాదని శంకరుని తత్త్వ మంతయు ఘోషించుచున్నది మానవుఁడు తనలోఁజేరిన జగ త్కాలు ష్యములను గడిగివేసి, పరిశుద్ధుఁడు గావలెను. అహంకారమునకు, కామ ములకు, నింద్రియసుఖాపేక్షకు నీచదాస్యమునుండి యాతఁడు విముక్తి బొందవలెను. "నేను" "నాది" యను భావములను మానవుఁడు విడిచి, మమకారమూలకములగు సర్వసంబంధములను విచ్ఛేదమొనర్చి "ఏకాకియై ఏకాకియగు బ్రహ్మముకొద్దకుఁబయనించుట"వలననే శాశ్వత జీవితము కలుగును. శంకరుఁ డుపదేశించినది లోకమునువిడిచి పారి పోవుటకాదు, అహంకారత్యాగము. లోకమునుండి పారిపోవుట సులభమే కాని, మమత్వమునుండి విడివడు టంతసులభ కార్యము కాదు. స్వార్థ మునణఁచివేయుటకు మనకవసరమైనచో నేకాంతవాసము నిర్జనప్రదేశ

1) శంశ్లో॥ ను 15

ముకు సాధనముగాఁ దీసికొమ్మని యాతఁ డుపదేశించెను. స్వార్థ శృంఖలములనుండి పూర్తిగా విముక్తుఁడైనయాతఁడు లోకములో నెట్టి కార్యభారమునైన వహించుట కధికారముగలఁడు. శంకరునితత్త్వము, లోకముతోడి సంసర్గము కాని, లోకమునుండి పలాయనముకాని కాక, లోకసంరక్షణమేయగును. సిద్ధపురుషుఁడు తనకొఱకుఁగాక, మానవ కల్యాణము కొఱకే జీవించును. తామరాకుపై జలబిందువు వలె, మనము నిస్సంగులమై లోకములో విహరింపవలెనని శంకరుని బోధయైయున్నది జ్ఞాననేత్రములఁ దెఱచియుంచుకొని, మన కర్తవ్యములను నెరవేర్ప వలయుననియు నిస్సంగ బుద్ధితోఁ జూచుచేకాని ప్రపంచమును ద్వేషింప నవసరము లేదనియు శంకరుని మతము [1]

మోక్షమనఁగా బరమ శాంతియనియు, నపుడు మన విజ్ఞానవ్యక్తిత్వము అదృశ్యము అగుననియు నర్థమైనచో, మన మట్టి దానినిఁ బొందుటకు మానవత్వమునే కోల్పోవుదు మను శాక్షేపణము, ధర్మము పరిచ్ఛిన్న జగత్సంబంధి కావునఁ, బరిచ్ఛిన్నా పరిచ్ఛిన్న వస్తుసంబంధమును గూర్చిన మహోన్నత సమస్యకుఁ దోడ్కొనిపోవును. తార్కికముగాఁ జూచినచో, ననుభవజ్ఞానమునకు బుద్ధిజ్ఞానమునకుఁ గల సంబంధ సమస్యయే యిది. పరిచ్ఛిన్న ప్రపంచ మపరిచ్ఛిన్న బ్రహ్మముపై నాధార పడియున్నదని మన మెఱుఁగుదుము కాని, యెట్లాధారపడి

1) ఉపనిషచ్ఛ్రవణము నా జీవితమునకు శాంతినిచ్చినది; నా మరణానంతరముగూడ శాంతినీయఁగలదని చెప్పిన షోపెన్‌హోయరు వాక్యమును స్మరించి, మాక్సుమ్యుల్లర్ చెప్పినాఁడు: 'షోపెన్‌హోయరు వంటి తాత్కాలికముగాఁదోఁచిన వానిని రచించువాఁ డెవ్వఁడుగాఁడు. యోగుల రహస్యానుభవములను విని సమచిత్తతగోల్పోయి, యుద్రేకపడఁదగువాఁడును గాఁడు వేదాంతము విషయములో నాతఁడు చూపిన యావేశము నాకును గలిగినదనియు, నాజీవయాత్రలో వేదాంతము మహోపకార మొనర్చెననియు బహిరంగముగా నంగీకరించుటవలన నాకెట్టి యవమానమునుగాని భయమునుగాని లేదు. ఒక దేశమును సంరక్షించుటలోఁగాని పాలించుటలోఁగాని, ధనమార్జించుటలోఁగాని, ఘనవిర్మాణములలోఁగాని పాల్గొనుటకుఁ బ్రతివ్యక్తికి నవకాశముండదు. ప్రశాంతమైన ధ్యానజీవితమును గడపుటకు వేదాంతమునకంటె శ్రేష్ఠతరమైన సహకారి యింకొకటిలేదు. ఒకఁడు ప్లేటోమతవాది యయ్యు, యోగ్యుఁడగు క్రైస్తవుఁడై, పూజ్యుఁడగు సాధుఁడు గావచ్చును; వేదాంత విషయమట్లే చెప్పవలెను." (యస్, యస్: పు 193)

యున్నదో మనకుఁ దెలియదు. అదేరీతిగా ధర్మజీవనమునకు మోక్షమునకు సంబంధ మున్నది. కారణరూపము మనకుఁ దెలియదు. అనుభవ జ్ఞానమును, ధర్మజ్ఞానమును, బ్రహ్మమును, జగత్తును, ఆత్మసాక్షాత్కారమును ధర్మవర్తనము నొకదానినుండి యొకటి వేరుపఱచుట వలన, శంకరు లనుసరించి, ప్రపంచము మిథ్యయనియు, మనజ్ఞాన మసత్యమనియు, మన ధర్మ జీవనము మోసమనియు, శంకరునిగూర్చి చేసినయాక్షేపణమును సమర్థించినవార మగుదుము. కాని శంకరుఁ డెన్నియోసారులు ప్రపంచము బ్రహ్మమూలమై యున్నదని చెప్పి యున్నాఁడు. వ్యవహార ప్రపంచము నతిగమించి పోవుట కదియే మార్గము. పరమార్థసిద్ధికి మార్గము వ్యవహార జగత్తు ద్వారముననే కల్పితమై యున్నరీతినే ముక్తిమార్గము ధర్మజీవనము ద్వారముననే కల్పితమై యున్నది. మోక్షావస్థలో ధర్మ మతిక్రమింపఁ బడినను, మోక్షమునకు ధర్మమునకు సంబంధము లేదనరాదు. తన విధి నిర్వహణమునుగాని, యీశ్వరభక్తినిగాని సాధకుఁడు విడిచిపెట్టవలెనని యెచటను బోధింపఁబడలేదు. ధర్మజీవనముయొక్క మిథ్యాత్వము, ధర్మ మనుష్ఠాన సిద్ధి పొందిన వెనుకనే సంభవించు విషయము. ఇహలోకమున ధర్మజీవన కృషి, లోపావకాశసమన్వితము; కాని నిశ్శ్రేయస మెచటనో లోకాంతరమున లభించునది కాదు. అది ఇప్పటి యిప్పుడే లభింపఁగలదు. ధర్మకృషి వ్యావహారికము మాత్రమే యనుటలో దాని యంతర్గర్భితమైన పారమార్థికాంశమున్నదనియే యర్థము. పుణ్యపాపభేదము పరిచ్ఛిన్నతా దశకుఁ జెందినదే యనఁగా, వ్యవహార జగత్తులో ధర్మాచరణము నిషేధింపఁబడినదని యర్థముగాదు. పుణ్యపాపభేద మసత్యమను విషయము, స్వార్థపరతాశృంఖలములచేఁ దమ్ముఁ దామే బంధించుకొని పరిచ్ఛిన్న జీవితక్లేశము ననుభవింపఁజేసికొను వారికి వర్తించునని తలఁపరాదు. శంకరుఁడు నీతి ధర్మములను నిరసింపలేదు, మోక్షద్వారమునకు నీతి ధర్మములే కవాటములని చెప్పినాఁడు. అనుభవజ్ఞానముపై లౌకికజ్ఞానమును, బ్రహ్మజ్ఞానముపై నీతివర్తనము నాధారపడియున్నవి. ధర్మజీవనమను బీజము మొలకెత్తి, బ్రహ్మజ్ఞానమును బుష్పించును.

## 12 - కర్మ

శంకరుఁడు కర్మసూత్రము నంగీకరించినాఁడు. అవిద్యానం మైన కర్మయే వ్యక్తిత్వమునకు హేతువు.[1] మనము జన్మిం ప్రపంచము మన కర్మఫలానుగుణమే.[2] వ్యక్తియొక్క దేహము పు చేసినపూర్వకర్మయొక్క సుఖదుఃఖరూపములగు ఫలితముల న వించుట కనుగుణమై నిర్మింపఁ బడినది[3] ఒక్కొక్కప్పు డొక ములోఁ జేసిన కర్మఫలము ననుభవించుట కనేక జన్మము లవసర లగును. ప్రారబ్ధకర్మానుభవము పూర్తియగు లోపున, నూతన లారంభించి, ప్రారబ్ధానుభవ చక్రము శాశ్వతముగా విరతిలేకుండఁ గుచునేయుండును[4] ధర్మజీవన ప్రవృత్తి, తుదిలేని పరిశ్రమ నడచుచునేయుండును. మానవ జీవితావస్థా వైవిధ్యముచే, ధర్మసూ రూప వైవిధ్యము ననంతముగా నుండును. ఈ పరిశ్రమ, బ్రహ్మజ్ఞాన లభించి, కర్మను సబీజముగా నాశమొనర్చి, పునర్జన్మావసరములేకుం జేయునందాఁక నడచుచునేయుండును. కర్మసూత్ర సంబంధమును విముక్తియే మానవ జీవిత లక్ష్యము. కాని మానవుఁడు పరిచ్ఛిన్ను గానున్నంతకాల మాతఁడీలక్ష్యమును సాధింప యత్నించుచు యుండును, గాని కృతార్థుఁడు కాఁజాలఁడు. ధర్మజీవనము సాధన కాని సిద్ధికాదు కోరికతోఁ జేయఁబడిన కర్మ లన్నియుఁ గర్మసూత్ర ననుసరించి ఫలితముల నిచ్చును, స్వార్థరహితుఁడై మానవుఁ డీశ్వ రార్పణ బుద్ధితోఁ జేసిన కర్మ చిత్తశుద్ధిహేతు వగును.

పూర్వకర్మయను దారముచే నెటులాగఁబడిన పటుకదలకుం గాలిపడగలము మనము కామని తెలియవలెను. మానవుఁడు తనక లకుఁదానే బాధ్యుఁడనియు, నీశ్వరుఁడు కర్మ ఫలప్రదాతయై మాత్ర

---

1) శం॥ భా॥ 3,2,9 (2) క్రియాకారకఫలం

3) కార్యకారణ సంఘాతము

4) ద్యూసెన్సు సిస్టం ఆఫ్ వేదాంత, పు 354.

మనకు సాయపడు పనియు నిదివఱకే చెప్పియుంటిమి.[1] ఈ పని చేయుమని కాని వలదని కాని యీశ్వరుఁడెవ్వని బలవంతముచేయఁడు. సంకల్పబలముచేఁ బూర్వసంస్కారములను గూడ మనము జయింప వచ్చును.[2] "ప్రయత్నదీక్షవలన మనలను బంధించిన శృంఖలములను ద్రెంపివేయువలె"నని వసిష్ఠుఁడు యోగవాసిష్ఠములో రాముని కుపదేశించి నాఁడు.[3] మానవుఁ డుద్రేకవశుఁడగుటచే, నాతని కిష్టానిష్టములు గలవు.[4] మానవుఁడు పుట్టుకతోఁ దనకుఁగలిగిన యసంస్కృతస్వభావమునుబట్టి నడచినచో నుద్రేకములకు వశుఁడై పోవును. ఈ యుద్రేకవశుఁడైన మానవుని క్రియలు స్వతంత్రములుగావు. కాని మానవుఁ డుద్రేకసముచ్ఛయమే కాదు. మానవునిలో దైవత్వ మిమిడియున్నది. ఇంద్రియ వ్యాపార పరంపర కతీతమై యాత్మశక్తి దానికి మూలకారణమై నడపుచున్నది. మానవునిచరిత్ర మచేతన విగ్రహప్రదర్శనము కాదు, అది సృజనశక్తి యుక్తమైన పరిణామము.

## 43 _ మోక్షము

మన దృష్టికి గోచరించుచున్న సర్వకాలములయందు ఉపాధి నిర్మూలనముతో నాత్మకు మోక్షప్రాప్తి కలుగును. ఆత్మ సర్వకాలముల యం దెట్లున్నదో, అట్లే అప్పటనే యుండును. అదియే సర్వమున కాదికారణరూపము అది ప్రపంచ మెన్నఁడు మన కీయఁజాలనిది, మన మండి తొలఁగింపఁజాలనిదియు నైన పరమశాంతియుఁ బరమసుఖమునై యున్నది. "ఇది పారమార్థిక సత్యస్వరూపము, కూటస్థము, నిత్యము, నాకాశమువలె సర్వవ్యాపియు, నిర్వికారము, నిత్యతృప్తము, నిరవయ వము, స్వయంజ్యోతి స్వరూపము. పుణ్యపాపాది ఫలితములకుఁగాని, కాలత్రయ ప్రభావమునకుఁగాని యందుఁ దావులేనిదియు నశరీరమై

---

1) శం॥భా॥ 2, 3, 42.
2) శం॥గీ॥భా॥ 3, 3, 4
3) చూ॥ జీవన్ముక్తి వివేకము 1 అ॥
4) శం॥గీ॥భా॥ 8, 18। 3।33.

నదియు మోక్షస్వరూపము." [1] తన్నావరించిన యశుద్ధపదార్థములు భస్మమైపోఁగా సువర్ణము సహజకాంతితోఁ బ్రకాశించునట్లును, తమ్ముఁ గప్పివేయు పగలు పూర్తియై, నిర్మేఘమైన నిశాకాశమున స్వచ్ఛముగా విలసిల్లు నక్షత్రములవలె నవిద్యానాశనముతో నాత్మ సహజామల కాంతితోఁ బ్రకాశించును. [2] స్వయంకృతములైన సర్వబంధముల నుండియు సంపూర్ణ విముక్తియు, వాఙ్మనోఽతీతము సర్వమానవప్రయత్నములకుఁ బరమలక్ష్యమునైన మోక్షకాంతి, మన మనస్సుకంటెను మనకత్యంత సన్నిహితమై యున్నది. శంకరుఁడు చూపు స్వర్గము, మనలోకమునకు దూరస్థము, భిన్నమునైనది కాదు, చూడ నేర్చినవారి కెల్లప్పు డిచటనే యున్నది. మోక్ష మనఁగా నెప్పుడో, యీ జీవితాంతమున, నింకొక లోకములో సంభవించునది గాదు; మన యెదుటనే యిప్పుడే లభింపఁగల సత్యస్వరూపముతో నేకత్వమును బొందుటే. [3]

ముక్తాత్మ స్వకీయమైన సహజావస్థయే. [4] మోక్షమాత్మ నిర్మూలనము గాదు, ఆత్మయందుఁ బ్రకాశించు దివ్యజ్యోతి వలనఁ, బరమాత్మ తాదాత్మ్యము ననుభవించుటే. నిత్యానందప్రాప్తియే మోక్షమని చిత్సుఖాచార్యుఁడు చెప్పినాఁడు. [5] అజ్ఞాన సంవర్ధితమైన దుఃఖ మాత్మయొక్క సహజానందస్వభావము నాచ్ఛాదించినది; అజ్ఞాన నాశముతోఁ దుఃఖ మదృశ్యమై ఆత్మయొక్క దుఃఖ విరహితానందము బహిర్గత

---

1) ఇదంతు పారమార్థికం కూటస్థం, నిత్యం, వ్యోమవత్సర్వవ్యాపి, సర్వవిక్రియారహితం, నిత్యతృప్తం, నిరవయవం, స్వయంజ్యోతిస్స్వభావం, యత్ర ధర్మాధర్మౌ సహకార్యేణ కాలత్రయం చ నోపావర్తేతే తదశరీరం మోక్షాఖ్యం॥ (శంభా 1,1,4)

2) శంభా 1,3,19

3) దీనిని నాగార్జునుని నిర్వాణభావముతోఁ బోల్చుము నిర్వాణ మేకముగా దనేకము గాదు, ఆత్మలయములుగాని, చాంచల్య వైకల్యములుగాని లేనిది, నిత్యమును గాదనిత్యమునుగాదు, సంసారముతో నేకమైనది (మాధ్యమిక కారిక 25,19)

4) శంభా 4, 4, 1-3, పోల్చు: అద్వైత బ్రహ్మసిద్ధిః ఆత్మనోఽనాద్యవిద్యానివృత్తి

5) అనవచ్ఛిన్నానందప్రాప్తి.

మగును. ప్రపంచమును నశింపఁజేయు బాహ్య క్రియా విధానము మోక్షసంపాదనా విధానము గాదు. గట్టి తనమును బోఁగొట్టుటకు వెన్న నగ్ని కర్పించునట్లు గాదు [1] ప్రపంచ విధ్వంసన మను ఘోర కార్యము మానవమాత్రునకు సాధ్యముగాదు. మోక్ష మనఁగాఁ బ్రపంచానేకత్వమును నశింపఁ జేయుటే యగుచో, మొట్టమొదటిసారి మోక్షము బొందిన వ్యక్తితోడనే ప్రపంచ మంతయు నశించియుండెడిది [2] మోక్ష మనఁగా నానావస్తు నాశనము కాదు, వస్తునానాత్వ భావనిర్మూలనమే. [3] ప్రపంచ ముఖపై తెరిని మార్చి సర్వ వస్తువులలో నాత్మ తను దర్శించు జ్ఞానమే మోక్షము. జీవిత జగత్తులనుగూర్చిన యట్టి నూత్నదృష్టి వలనఁ గలిగిన అంతర్విజ్ఞానము మోక్షకారణము గాక, మోక్షరూపమే యని చెప్పవచ్చును. [4] పతనోత్పతనములతోఁ గూడిన యీ ప్రపంచగతి యనంతముగా సాఁగుచునేయుండును గాని, ముక్త పురుషునికి దానితో సాంగత్యము లేకుండఁ బోవును.

మోక్షము యొక్క నిజ స్వరూప మవిద్యా శబ్దముచే నిరూపింపఁబడుట. మోక్షప్రాప్తితోఁ బ్రపంచమున కేమియుఁ దటస్థించదు, ప్రపంచమును గూర్చిన మన భావములే మారును. వివేకహీను నాకర్షించి వశపఱచుకొను ప్రపంచములోని క్షణిక వస్తుజాలము ముక్త పురుషుని చిత్తమునకు వికారమును గలిగింపఁజాలవు. దుఃఖకారణము మిథ్యాజ్ఞానము, [5] తన్నాశముతో దుఃఖనివృత్తి యగును. ఈ రీతిగా మోక్ష మనఁగాఁ బ్రపంచవిలయము గాదు, ప్రపంచ స్వభావ

---

1) శాం॥భా॥ 4,4,6; బృ॥ఉ॥భా॥ 4,5,13.

2) ఏకేనవాది ముక్తేన పృథివ్యాది ప్రవిలయః కృతః ఇతి దానీం పృథివ్యాది శూన్యం జగదభవిష్యత్ శాం॥భా॥ 3,2,21.

3) జ్ఞాతే ద్వైతం నవిద్యతే.

4) చూ॥ల్యా॥ శుద్ధబ్రహ్మాశ్రయవిషయం ఏక మేవజ్ఞానం, తన్నాశ ఏవ తమోక్షః సిద్ధాంతలేశభాష్యకారుఁడగు కృష్ణానందుఁడిట్లు వ్రాసెను "చైతన్యస్యాజ్ఞానసంబంధో బంధః, తదసంబంధో మోక్షః నతు తన్నివృత్తిః మిథ్యాజ్ఞాననివృత్తియే మోక్షమని పద్మపాదుఁడు భావించెను మిథ్యాజ్ఞాననివృత్తిమాత్రం మోక్షః.

5) మిథ్యాభిమానభ్రమ నిమిత్త ఏవ దుఃఖానుభవః (శాం॥భా॥ 2,3,46

మునకు గూర్చిన యసత్యజ్ఞానదృష్టి మార్పు నొందుటే. ముక్త పురుషుఁడు తిరిగి యెన్నఁడు ప్రపంచసంగుఁడు కాఁజాలఁడని యుద్ఘటించునుద్దేశముతో, వ్యావహారిక ప్రమాణబద్ధమైన దృగ్దృశ్య భేదనాసమే మోక్షమని శంకరుఁడు బోధించినాఁడు.[1]

బ్రహ్మాత్మైక్యజ్ఞాన సిద్ధివలన, జీవవస్తు నానాత్వముతోఁ గూడిన యీశ్వరసహిత జగత్తంతయు నదృశ్యమగు నను భావముచే జగత్ మిథ్య యనునది శంకరుని మతమున విమర్శ కవకాశము కలుగుచున్నది. [2] సర్పభ్రాంతి, రజ్జు స్వస్వరూప దర్శనముతోఁ దొలఁగిన రీతిని మేల్కాంచినంతనే, స్వప్నదృశ్యము లన్నియు వినష్టమైనరీతిని, మోక్ష సిద్ధితో సంసారము విరమించునను భావములు గల వాక్యములు శంకరుని రచనలలో ననేకములు గలవు. జీవబ్రహ్మైక్య జ్ఞానసిద్ధి యగుటతోడనే, మన పరిచ్ఛిన్న దృష్టికిఁ గాన్పించు జగత్స్వరూపము మార్పు నొందును. మనచిత్తమునకు గోచరించు వస్తుజాలములు, నిర్గుణ బ్రహ్మమునం దారీతిగా గోచరించవు.[3] మనకుఁ గన్పట్టురీతిగాఁ బ్రపంచము బ్రహ్మముయొక్కదృష్టిలో నుండదని పెక్కురీతుల శంకరుఁడు చాటియున్నాఁడు. భిన్నరూపములు గల జగత్తు పరమ సత్యైక స్వరూపములో నిలువఁజాలదని బ్రాడ్లే తత్త్వజ్ఞుఁడును శంకరునితో నేకీభవించియున్నాఁడు. బ్రాడ్లేమాటలలో, దృశ్యము లన్నియు నిర్గుణైక రూపముగా నున్న సత్యములో నెట్లో నానాత్వమును గోల్పోవును. బ్రహ్మ మెన్నఁడును మార్పు లేనిది గావున బ్రాడ్లే ప్రయోగించిన 'వికార' శబ్దము కూడ నిచట దోషకలితమే యగును. తనకుఁగల తార్కిక ప్రమాణ నైశిత్య విలసితమగు బుద్ధిచేఁ బ్రపంచముమిథ్యయను నపార్థసూచకములగు వాక్యములను శంకరుఁ డుపయోగించినాఁడు. వస్తు దృశ్యములు పరమాత్మలో నానాత్వమును గోల్పోవు విచారమును

---

1) సురేశ్వరుఁడు చెప్పినాఁడు; "పరంజ్యోతి ర్జ్ఞానదృష్టిగోచరమైనప్పుడు బ్రహ్మకృతపర్యంతముగ సర్వము స్వప్నములోనివస్తువులవలె మిథ్యయగును(మానసోల్లాసము 1

2) గన్నహితేనాత్మైక్యబంధ మోక్షది నరః వ్యవహార పరిసమాప్తి రేవస్యాత్॥ (శ॥ 1, 26)

3) శం॥ భా॥ 1,2, 12; 1,2,1. 2, 20

బొందువనియు, శాశ్వత సామరస్య రూపమగు సత్యములో భిన్నసాధ
ములు లయమగు ననియుఁ జెప్పుటలో మనము వ్యావహారిక ప్రమాణ
ముల నుపయోగించి చెప్పువార మగుచున్నాము. శంకరుని భావములో
నివన్నియు, నేకము నద్వితీయము నగు బ్రహ్మస్వరూపములో భిన్నత
నూహించు దోషమునకుఁ బాల్పడుచున్నవి. సత్యము సర్వసంబంధాతీత
మైనది. సత్యము నిజముగా నవాఙ్మనో గోచరము. వ్యవహారప్రపంచ
మాస్వరూపములోఁ బారమార్థిక సత్యాంశము కాఁజాలదు. అద్వితీయ
బ్రహ్మమును జగద్రూపముగాఁ జూపునది నశించుటతోడనే మిగులునది
బ్రహ్మమే. జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలను మనము తురీయములో
లయింపఁ జేసినపుడే జ్ఞానసిద్ధియగునని మాండూక్యోపనిష ద్భాష్య
ములో శంకరుఁడు చెప్పియున్నాఁడు. పరబ్రహ్మమన్నిటి నధిగమించుచు
నన్నిటిని దనలోఁ గలిగి యుండును.[1] "ప్రపంచోపశమమ్" అనఁగాఁ,
ప్రపంచము బ్రహ్మమందు విలీన మగుననియేగాని, నాశన మగునని
యర్థముకాదు. భిన్నపరమార్థావస్థలను దర్శించుశక్తులు మన కున్నవి.
తురీయావస్థలో విలక్షణమగు కాంతిలో నింకొక దృష్టిగలిగి, సత్యమును
యథాస్థితిలో దర్శింతుము, ఈ కాంతియు నీ దృష్టియు నిర్వికారములు.
ఈ దృష్టితోఁ జూచినచో, మన మిదివరకుఁ జూచిన ప్రపంచము స్థాన
ములో బ్రహ్మమే గోచరించును.[2] మనము నిర్మూలించునది మిథ్యా
కల్పము, మిగులునది వస్తుస్వభావము.[3] ముక్తపురుషదృష్టి కవరోధము
కల్పించుశక్తి మాయకు లేదు. అనుభవ జ్ఞానముచే జీవబ్రహ్మైక్య సిద్ధి
యగుటతోడనే, మనకు దృశ్యవస్తు సంగపాశములు భగ్నమై యవి
మనల నిదివరకాకర్షించినరీతిగా వర్తింపవు. మన యింద్రియములు,
చిత్తము పనిచేసినంతకాల మాదృశ్య జగద్రూపములందే తిరుగు గాని,
అనుభవసిద్ధమగు బ్రహ్మ రూపముతో వానికిసంబంధముండదు. యుక్త
జ్ఞానముచే మరుమరీచికాభ్రాంతి నశించును కాని, మరుమరీచిక యుక్తి

1) త్రయాణాం విశ్వాదీనాం, పూర్వ పూర్వ ప్రవిలాపనేన తురీయస్య ప్రతిపత్తిః ప్రవిలయ మనఁగా లీన మగుటగాని, నిరాకరణము గాదని సూచన కలదు,

2) శం॥ భా॥ 1. 3, 1

3) శం॥ భా॥ మాండూక్య ఉ॥ 2, 3.

యుండి మనల నెన్నఁడుఁ మోసగించదు. ఆ దృశ్యమునేచూచి మనమింకొక భావమును గలిగియుందుము. మిథ్యారూపముయొక్క మిథ్యాత్వము తెలిసినవెనుక నది మిథ్య కాఁజాలదు. నామరూపములు నిర్గుణతత్త్వములోఁ గలిసిపోయినను, లేక నిర్గుణబ్రహ్మము యొక్క రూపాంతరములుగా గోచరించినను, జగత్తు మాత్రము మిథ్య గాదని స్పష్టమైనది.

మోక్షమనఁగ, జీవబ్రహ్మైక్య మనియు,[1] బ్రహ్మము సర్వ వ్యావహారిక ప్రమాణాతీతమైనట్లే, మోక్షమును వ్యావహారిక జ్ఞాన ప్రమాణములచే నిర్వచింపఁబడఁజాల దనియు శంకరుఁ డనేక వాక్యములలోఁ బ్రకటించి యున్నాఁడు. దేశ కాలములు కార్య కారణములు చేతనాచేతనములు, కర్మలు, కర్మానుభవములు మున్నగు వానిపై లౌకికజ్ఞాన మాధారపడి యున్నది; మోక్షావస్థకు వీనితో నెట్టిసంబంధమును లేదు. దేశమునకు సంబంధించినస్వర్గమనఁగాని, బ్రహ్మలోకమనఁగాని ముక్తపురుషులు నివసింతురనికాని, వారు శాశ్వతముగా జీవింతురని కాని చెప్పుటకు వీలులేదు, "అనంతకాలము శ్రేయము నధికతరశ్రేయము కానేరఁజాలదు; ధవళవస్తువును ధవళతరమునేరఁజాలద"ని[2] చెప్పిన అరిస్టాటల్ భావముతో శంకరుఁ డేకీభవించును. మోక్షావస్థ అవిచ్ఛిన్న క్రియాత్మక మనియుఁ జెప్పఁజాలము; మోక్షమత్యంత సమున్నతానుభవము, అందు బుద్ధి వ్యాపారమును, విజ్ఞాన వృత్తియు నతిక్రమింపఁబడినవి. ఆత్మ సంసారచక్రము నుండి నిర్ముక్తమై, వృద్ధిక్షయ జనన మరణాదుల నతిక్రమించి, "ఏక క్షణమునందే, యనంతజీవిత సమగ్రసంపాదన మొనర్చు నవస్థ"[3] యని బోధియస్ చెప్పినరీతిని నిత్యత్వానుభవసిద్ధి నొందును. వ్యావహారిక భేదముల కతీతమగు సర్వాత్మభావసిద్ధిలేక బ్రహ్మత్వ సిద్ధినంద.

---

1) బ్రహ్మైకత్వ ముక్త్యవస్థ

2) నికోమెకియన్ ఎథిక్స్ 1, 6

3) ఎవిలిన్ అండర్హిల్ గారి మిస్టిసిజమ్ పు 245 లో నుదాహృతము.

అయేమోక్షము.[1] మోక్ష మనఁగా, "బ్రహ్మస్వరూపమైన తన నిజస్థితి ననుభవపూర్వకముగా గ్రహించుటేగాని, స్వర్గాదులవలె సంపాదింపఁ బడునది కాదు. శ్రుతివాక్యము, హేతువాదముకూడ బ్రహ్మ మేక స్వభావ యుక్తమైనదని చెప్పుటచే మోక్షము నట్టి స్వభావము గలదే. కావున దాని యనుభవసిద్ధిలో బ్రహ్మకును సామాన్య మానవునకును భేదములేదు. సాలోక్య సామీప్యాదులు సంపాదింపఁబడిన పదవులు గావున, వాని మహిమకు దశాభేదమున్నది కాని, మోక్షమున కట్టి భేదము లేదు."[2] బ్రహ్మము "సర్వవ్యాపియు సర్వాంతర్గతము సర్వాత్మరూప మగు గావున నది రాకపోకలు గలిగినది కాఁజాలదు. మనలో నత్యంత సన్నిహితమై యున్నదాని యొద్దకుఁ బోవుట యనున దర్థరహితము. మానవుఁడు తనకు భిన్నమైన దానియొద్దకే పోవునని మనకందఱకుఁ దెలిసియే యున్నది."[3] పరమేశ్వరభక్తులు బ్రహ్మలోకప్రాప్తి నందుదురు కాని, మోక్షసిద్ధిగలవా రెచటకుఁ బో నవసరములేదు.

ఎచట నహోరాత్రములు లేవో, ఎచటఁ గాలప్రవాహ మాగిపోవునో, యెచట రవిచంద్రనక్షత్రాదు లాకసము నుండి యదృశ్యము లగునో అదియే మోక్షావస్థ యని వ్యతిరేక భావములచే సూచింపఁబడెను. లౌకిక జ్ఞాన భేదముల కందుఁ దావులేదు.[4] అది త్రైవిష్టపుల స్వర్గము వంటిదే; నిర్దుష్టమైన పరంపరాగత నిధానము, అది యక్షీణము. కాని యది శూన్య మని భావింపరాదు. ముక్తపురుషుఁ డన్యమును జూడక, సర్వములోఁ దన స్వరూపమునే చూచును.[5] లౌకిక దృష్టికి బ్రహ్మము శూన్యముగాఁ దోఁచినట్లే, మోక్షము నాత్మవినాశముగాను, విస్మృత భావముగాను, స్థితిరహిత శూన్య స్వరూపముగాను గోచరించును.

---

1) సమస్తాత్మ భావః సర్వసంసార ధర్మాతీత బ్రహ్మస్వరూపత్వం ఏవ (శాం।భా। తై। ఉ। 2, 1) (2) శాం।భా। 3,4,52

3) శాం।భా।4 3,3,8

4) దర్శనాది వ్యవహారాభావా (శాం।భా। 1, 3,9)

5) పూర్ణస్యైవ సర్వైకత్వాత్ సమాలో ద్వితీయాభావః॥ (శాం।భా। ఛాం।ఉ।8, 12,3।)

దీనిని జార్జి యెలియట్ కవి, "లెజెండ్ ఆఫ్ జుబాల్" యందు ఇట్లు ఊహించినాఁడు; మర్త్యత్వమును విడచినవాఁ డస్తమించిన రవి కిరణము సర్వజ్యోతి స్స్వరూపమగు రవి బింబమునఁ జేరినట్లే, పరమాత్మలోఁ బ్రవేశించునని యెఱుఁగక, శాశ్వతశ్మశానమునఁ జేరుచున్నాఁడని తలఁచును " దుర్బల మానవులకే బ్రహ్మము లేనట్లు తోఁచునని చెప్పినట్లే, శంకరుఁడు, లౌకికదృష్టికిఁ బరమాత్మానుసంధానము శూన్యస్థితియే యని గోచరించును గాని, యది నిజము గాదని వక్కాణించి యున్నాఁడు. మోక్షావస్థలోఁ గూడ స్వీయ వ్యక్తిత్వభావ ముండవచ్చునని కొన్నివాక్యములు చెప్పుచున్నవి. అట్టి వాక్యములకదానినిఁ దీసికొని, మోక్షావస్థలో విశేష విజ్ఞాన మదృశ్యమగును గాని, పూర్ణస్మృతినాశముగాదని నిరూపించినాఁడు. దానినే విజ్ఞాన ఘనాత్మ యందురు.[1] అట్టి మోక్షావస్థలో నుపాధి నాశనమగును గాని యాత్మ నాశనముగాదు.[2] వ్యక్తివినాశము మోక్షముగాదు. పరిచ్ఛిన్న దృష్టి గల మనకు దేహేంద్రియ చిత్తబుద్ధి సంయుక్తమైన జీవాత్మయే యథార్థ మైనది; పరమాత్మతో నైక్యమై, కాలావధుల నతిక్రమించి, నిత్యస్థితి నొందిన యాత్మస్థితి నిక్కము గాదని, తోఁచును. మన యిహలోకజీవిత మనంతముగాఁ బొడిగింపఁ బడుటే మోక్షమని మనము వాంఛింతుము. దేహేంద్రియ చిత్తములను దాఁటి పోవఁజాలని జీవాత్మ కవిచ్ఛిన్న వ్యక్తిత్వమును శంకరుఁ డంగీకరించును కాని జీవాత్మ యొక్క పరిచ్ఛిన్నత తొలఁగిపోయి, దేహము విచ్ఛిన్నమై, పరమాత్మ తాదాత్మ్యము నొందినప్పుడే మనము నిజమగు నిశ్శ్రేయసము నిచటనే యిప్పుడే సంపాదింపఁగలము. అట్టి స్థితియొక్క లక్షణములను నిర్వచించుట దుస్తరము అట్టి బ్రహ్మైక్య సిద్ధియందలి మహామహిమను ఎవరకన్ను చూడఁజాలదు, చెవి వినఁజాలదు, చిత్త మూహింపలేదు.

---

1) శం భా 1,4,22; అందు బృ ఆ ఉ 43,30 (శం భా 1,3 19 లోనిది) ఉదాహరించి, యిట్లు వ్యాఖ్య వ్రాసినాఁడు విశేష విజ్ఞాన వినాశాభిప్రాయమేవ, నవిజ్ఞాతురేవనాశాభిప్రాయమ్ "

2) ఉపాధిప్రలయ ఏవాయం నాత్మప్రలయః (2,1,14)

మనకు మోక్ష మర్థవంతము కావలెనన్నచో వ్యావహారికము లుపయోగించి, యది సర్వాత్మ భావమని చెప్పవలెను

అదేవిధముగా, పరమేశ్వరు నాత్మస్వరూపమే జీవుని సహజ స్వరూపము, దేహ యగుటకుఁ గారణ ముపాధిపాశబంధనమే"[2] యని పెక్కుతావుల శంకరుడు చెప్పియున్నాఁడు. అవిద్యానివృత్తివలన, మిథ్యాసర్పభ్రాంతితొలఁగి, నిజమగు రజ్జువే గోచరించురీతిని, కర్తృత్వ భోక్తృత్వములచేతను, రాగద్వేషములచేతను, మాలిన్యమునొందిన జీవాత్మ, జ్ఞానసిద్ధిచే, సర్వ వికారములు తొలఁగి, పూర్ణమై సత్యసిద్ధి నందును"[3] అప్పయదీక్షితు లీ శంకరవాక్యము నుదాహరించి, తాను సమర్థించిన జీవేశ్వరైక్య[4] భావమునే శంకరుఁడును ప్రతిపాదించెనని నిరూపించినాఁడు[5]

ముక్తిపొందిన యాత్మకుఁ బరమాత్మతో నభేదస్థితి గలదని చెప్పఁ బడెను ఈ యభేదస్థితి కనేకార్థములు చెప్పఁబడినవి. పావనిముక్తి సత్యశీలము, మున్నగునవే కాక, సర్వజ్ఞత్వసర్వశక్తిమత్త్వములు

1) సర్వాత్మభావో మోక్ష ఉక్తః (శం। భా। బృ। ఉ। 4,4,6)

2) పారమేశ్వరమేవహి శరీరస్య పారమార్థికం స్వరూపం ఉపాధికృతంతు శరీరత్వం, (3,4,8) ముండకః ఏవం మిథ్యాజ్ఞానకృత ఏవ జీవపరమేశ్వరయో ర్భేదః న వస్తుకృతః వ్యోమవ దసంగత్వ విశేషాత్ (శం। భా। 1 3,19। చూ శం। భా। ఈశా। ఉ।14)

3) యదవిద్యా ప్రత్యుపస్థాపితం అపారమార్థికం జైవంరూపం కర్తృత్వ భోక్తృత్వ రాగద్వేషాది దోషకలుషితం అనేకా నర్థయోగి, తద్విలయనేన తద్విపరీతం, అపహత పాప్మత్వాది గుణకం పరమేశ్వరం స్వరూపం విద్యయా ప్రతిపాద్యతే, సర్పాది విలయనేనేవ రజ్జ్వాదీన్ (శం।భా।1,3,19) చూ. దీనిపై కల్పతరువు, పరిమళ వ్యాఖ్యానములు

4) భాష్యకారోఽప్యత్ర స్పష్టం ముక్తస్య సగుణేశ్వరభావ ముక్తవాన్।

5) చూ. సిద్ధాంతలేశము, 4 అనేక జీవవాదము ననుసరించి, ముక్తియనగా ఉన్నజీవులు ముక్తిపొందువరకు నీశ్వరునితో నేకత్వము, ననంతరము బ్రహ్మతో నేకత్వ మనని సూచింపబడెను చూ: సిద్ధాంతలేశము 4. దానిపై కృష్ణానంద వ్యాఖ్య.

ముక్తాత్మకుఁగలవని జైమిని తలంచినాఁడు [1] దీనికి వ్యతిరేకముగా ఔడులోమి, పాపవిముక్తియుఁ జైతన్యమునూత్రమే ముక్తాత్మ లక్షణములని పలికినాఁడు. [2] జైమినిచెప్పిన యితరలక్షణము ఉపాధివలన జనించునవేయని యాతఁడభిప్రాయపడెను. బాదరాయణుని దృష్టిలో నీ రెండు భావములకు విరోధములేదు [3] శంకరుఁడు బాదరాయణునితో నేకీభవించెను. ఔడులోమి చెప్పిన పారమార్థిక సత్యము, వ్యావహారిక ప్రమాణసిద్ధము కాఁజాలదు, కాని వ్యావహారిక ప్రమాణసిద్ధమగు సత్యమే వలయుచో జైమినీయభావము యుక్తమైన దగును. ఒకే మోక్షావస్థను గూర్చి జైమిని బుద్ధిపరికల్పిత భావమును, ఔడులోమి పారమార్థిక భావమును ప్రకటించిరి. ముక్తపురుషున కనంతజ్ఞానశక్తులు కలుగునని బాదరాయణుఁడుచెప్పి, యీశ్వరవిశిష్టలక్షణములైన సృష్టిస్థితి లయ సామర్థ్యములు మాత్రము లభింపవని ప్రకటించెను [4] జీవుల కీశ్వరునికిఁగల స్వాతంత్ర్యము, ననంతశక్తియుఁగలుగుట దుర్లభమని చెప్పిన మాధ్వుని భావమున కిది సరిపోవును. బ్రహ్మమునందు స్వగతభేదము, జీవేశ్వరులకు నిత్య భేదములను చెప్పు రామానుజుని కెట్టి కష్టమును లేదు. "శుద్ధ బ్రహ్మ సమానత్వము" సంపూర్ణముగా ముక్తపురుషునికి లభించునని చెప్పు నుపనిషద్వాక్యముల కిది విరుద్ధముగానున్నదని శంకరుఁడు వాదించినాఁడు. "ముక్తపురుషుఁడు సృష్టికర్తయగును." మున్నగు నుపనిషద్వాక్యము లున్నను, బాదరాయణుఁడు ముక్తపురుషుఁడు లోకపాలకుఁడు కాఁజాలడని వచించినాఁడు శుద్ధ మోక్షావస్థలో విషయీ విషయములు గాని, జీవజగత్తులుగాని లేవు; అందుచే సృష్టి చేయుట, పాలించుట మున్నగు వ్యాపారముల కవకాశమేలేదు; కాని యీశ్వరజగత్తు లున్నంతకాలము నీ దశలో ముక్తిఁబొందుటయఁగా నది సంపూర్ణముక్తి కాఁజాలదు; ఇట్టిస్థితిలో ముక్తజీవుని కీశ్వరలక్షణము

1) శం॰భా॥ 4,4,5 చూ॥ ఛాం॥ 8,1,6; 8,7,1

2) శం॰భా॥ 4,4,6 బృ॥ 4,5,13

3) శం॰భా॥ 4,4,7

4) బ్ర॥సూ॥ 4,4,17

లబ్ధియు లభించునుగాని, యీశ్వరుని సృజనాది శక్తులు మాత్రము లోపించునని శంకరుఁడు వివరించినాఁడు.[1] శంకరు ననుసరించి బ్రహ్మవేత్త బ్రహ్మైక్యము నొందును. దానినే యీశ్వర సమానత్వమని మనము చెప్పవచ్చును బ్రహ్మవేత్తలు కాక, యీశ్వరారాధకులైన భక్తులు బ్రహ్మలోకస్థితులై యనేకశక్తులను బొందుదురుగాని, వారి యవిద్య పూర్తిగాఁ దొలఁగని కారణముచే సృష్టికర్తృత్వపాలకత్వాది శక్తులు మాత్రము లభింపవు. వారీశ్వరభిన్నమైన పృథగ్వ్యక్తిత్వముగలిగి యీశ్వర శక్తిధరితులై యుందురు.

సంసారవిముక్తి లేక మోక్షావస్థ లోకసంగ్రహార్థమగు కర్మతో పన్వ యించునా? అట్టిసమన్వయము లేదనియే శంకరునిసమాధానము; ఏలన, సర్వకర్మలు ద్వైతముపై నాధారపడియున్నవి, సత్య మద్వైత మగుటచే దీనికి విరుద్ధమగును కాని, జీవన్ముక్తుల విషయములలోఁ గర్మ యంగీకరింపఁబడినది. అనఁగా, సద్వైతమునకుఁ గేవల ప్రవృత్తితో విరోధములేదు. జీవన్ముక్తుల పనివులై యుండఁగానే, అహంకార కర్మమాత్రముల రహితులై బ్రహ్మ సాక్షాత్కారమును గాంతురు. అందుచేఁ గర్మ మోక్షములకు సహజమగు విరోధ మెద్దియును లేదు.

ఈ సందర్భములో ముక్తపురుషుఁడు తిరిగి యీ లోకమున జన్మించువిషయము చర్చింపఁబడెను.[1] బ్రహ్మవేత్తలైన అపాంతరతమస్సు మున్నగువా రీలోకమున మరల జన్మించిరి. వారు లోకసంగ్రహార్థ మాధికారికులై జన్మించిరని శంకరుఁడు పలికినాఁడు. వారి జగత్కల్యాణ కర్మ పూర్తి యగుటతోడనే వారి జీవయాత్ర ముగిసి, వారికిఁకఁ బునర్జన్మముండదు. బ్రహ్మవేత్తలమైన మనకుఁ గూడ లోకకల్యాణ కాంక్ష కలిగి, మన మీ లోకమున నివసించుట జ్ఞానపూర్వకమై యుండునే కాని, కర్మఫలితమై యుండదు. కాని మోక్షమునకు సంసారము విరుద్ధమని

1) బాదరాయణ తత్త్వమునకు మపనిషత్తులకును, బాదరాయణ సూత్రములలోనే (3,2,13,16,4,413,21) కన్పట్టు పరస్పర వైరుధ్యముల నీ విధముగా శంకరుఁడు పరిష్కరించినాఁడు.

1) శంభా 3,3,32.

శంకరుని నిశ్చయము; కర్మ సంసారసంబంధియే కాని మోక్షసంబంధి గాదు.

అనంతరాద్వైతమున మోక్షమునుగూర్చి భిన్నభావములు కాన చూపెను.[1] మోక్షమనఁగా బ్రహ్మైక్య మనియుఁ, దత్సిద్ధితో ద్వైతమూలవస్తుసహితమగు లోకమంతయు నదృశ్యమగు ననియు నేకజీవ సిద్ధాంతవాదులు చెప్పుదురు.[2] ప్రపంచమునకుఁ గారణము జీవుల యవిద్యయే యని యనేకజీవవాదులు భావింతురు. అవిద్యానాశనముతోఁ బ్రపంచమదృశ్యమయ్యు నింకను మిగిలిన బద్ధజీవుల దృష్టికి గోచరమగుచుండును. జీవేశ్వరులు బ్రహ్మ ప్రతిబింబములని తలఁచువారి ననుసరించి, మోక్షమనఁగా నీప్రతిబింబ హేతువగు ముకురభగ్నతయే, అప్పుడు మూలబ్రహ్మమే ప్రకాశించును. జీవేశ్వరులకు బ్రహ్మమే యేకాధార మయినను, నొక విధముగా నీశ్వరప్రతిబింబమే జీవుఁడు. ఈ భావము ననుసరించి, మోక్ష మనఁగా నింకను బద్ధజీవు లున్నంతకాల మీశ్వరైక్యమే కాని బ్రహ్మైక్యము గాదని చెప్పుదురు. ఒకేముఖ మనేకముకురములలోఁ బ్రతిబింబించునప్పు డేదేనొక యద్దమును దొలఁగించినచోఁ దత్సంబంధ ప్రతిబింబము మూలబింబములోఁ గలిసిపోవును. కాని యితరములగు నద్దములన్నియు నిర్మూలములగునంతకు ముఖలక్షణము యథారీతిని యుండును. కావునఁ బద్ధజీవు లున్నంతకాలము మోక్షమనఁగా నీశ్వరైక్యమే; కాని సర్వజీవ మోక్షమైనప్పు డీశ్వరుఁడు తన మూలబింబ భావమును కోల్పోయి, బ్రహ్మమందుఁ గలిసిపోవుటచే సర్వజీవులకును బ్రహ్మైక్యసిద్ధి లభించును. కాని సంప్రదాయసిద్ధమగు నద్వైతము ననుసరించి, సంసార మనంతము గావున మోక్షమనఁగా నీశ్వరైక్యానుసంధానమే.

బ్రహ్మజ్ఞాన స్వరూపమునుగూర్చి విచిత్రమగు ప్రశ్న యొకటి యుదయించినది, జ్ఞాన మున్నంతకాలము మోక్షములేదు, కాని బ్రహ్మజ్ఞానసిద్ధి

1) సిద్ధాంతలేశము 4 అ.

2) ఏకజీవవాదే తదేకాజ్ఞాన కల్పితత్వే జీవేశ్వర విభాగాదికృత్స్నభేదప్రపంచస్య తద్విద్యోదయే విలయాన్నిర్విశేష చైతన్యరూపేణైవాఽవస్థానమ్.

లేనిదే మోక్షము దుర్లభము. కాని బ్రహ్మజ్ఞానము పరమమోక్షసిద్ధికి వ్యతిరేకము గాదా? పరమముక్త్యవస్థలో జ్ఞానముండదు, అందుచే ముక్త్యవస్థలో జ్ఞాన మెట్లు నిర్మూలింపఁబడునను విషయము ననేకోపమానములలోఁ జెప్పిరి. ఒక కాలకఫలము నశుద్ధ జలప్రవాహములోఁ బడవేసినచో దానికాలుష్యములన్నియుఁగొట్టుకొనిపోయి యదిమాత్ర మడుగునకు మునిగిపోయినరీతిని, ఎఱ్ఱగాఁగాలిన యినుపపెనముపై నొక నీటిబిందువును వేసినచో, నా పెనము యొక్క వేడిమిని గొంతదీసికొని తానదృశ్యమైనరీతిని, గడ్డిమోపులోఁ బడవైచిన నిప్పాగడ్డినంతను గాల్చివేసి తా నారిపోవు విధమునను, బ్రహ్మజ్ఞానము మన యజ్ఞానమును నాశనమొనర్చి, దానితో నదియు నశించిపోవును.[1] క్రమముక్తి వాదమును శంకరుఁ డంగీకరించెను. ప్రణవజపమును గూర్చి ప్రశ్నోపనిషత్తులో నొకవాక్యమునకు భాష్యము వ్రాయుచు నట్టి జపమువలన బ్రహ్మలోకప్రాప్తియు ననంతరము క్రమముగా ముక్తియు లభించునని యాతఁడు చెప్పినాఁడు.[2] ఇంకొకచోట నీశ్వరారాధనమువలన దురితక్షయమై, యీశ్వరత్వము లేక క్రమముక్తి సిద్ధించునని నుడివినాఁడు.[3] బ్రహ్మలోకమున నాత్మ తన ప్రత్యేక వ్యక్తిత్వమును గలిగియుండును. ఇతరయోగుల దృష్టిలోవలెనే శంకరుని దృష్టిలో స్వర్గమనఁగా జీవుఁడీశ్వరధ్యానమగ్నుఁడై యుండు నవస్థయే యను వాద ముత్తమలక్ష్యము కాఁజాలదు. జీవుని కీశ్వర సాక్షాత్కారము గలిగి, యీశ్వర దివ్యతేజః ప్రకాశములో నుండుస్థితి కలుగ వచ్చును గాని, జీవాత్మకును దల్లక్ష్యమునకును భేద మింకను నిలిచియేయుండును. జీవాత్మ స్వస్వరూప సందర్శనము నింకను బొందనిదై తనపరిచ్ఛిన్నతచేఁ బరమాత్మలో లీనము గాలేక యుండును.

శంకరుఁడు చెప్పిన జీవన్ముక్తి వివరణమువలన, మరణించిన వెంటనే యాత్మకు నిత్యావస్థ సిద్ధించు నని తలఁపరాదు. బ్రహ్మజ్ఞానము

1) చూః సిద్ధాంతలేశము, అ, 3
2) శం। భా। 1,3,13
3) శం। భా। 3,2,21

లభించినచో ప్రతికియుండగనే మోక్షసిద్ధి యున్నది. మరణప్రాప్తి
వఱకు దేహమున్నను, బ్రహ్మవేత్తను మోహగింపదు. కుండచేయుట
పూర్తియైనను గుమ్మరివాని చక్రము కొంతసేపు తిరుగుచుండురీతిని,
మోక్షమువచ్చినను జీవితము కొంతకాలము నడచుచునే యుండును;
ఏలన, నిదివఱకే జన్మకారణమై యున్నశక్తి నడ్డుపెట్టనవసరము లేదు. [1]
శంకరుఁడింకొక యుపమానము నిచ్చినాఁడు. చంద్రుఁడొక్కఁడే యని
యెఱిఁగియు నేత్రదోషముచే రెండు చంద్రబింబములఁజూచు నాతఁడు,
చేయునదిలేక నిజమును దెలిసికొని యూరకుండును. [2] సర్వవ్యాపార
ములు బ్రహ్మమందే జరుగుచున్నవని బ్రహ్మజ్ఞాని తెలిసికొనును. [3]

## 44 - భవిష్యజ్జన్మము

బ్రహ్మవేత్త యొక్కఁడే మోక్షమును బొందును, మిగిలిన జీవు
లందఱు జన్మాంతరముల నందుదురు [4] మోక్షకాలమువఱకు మన
జీవితములు సంసారచక్రమందుఁ బరిభ్రమించుచుండును. సంసారము
కాలగతి స్వరూపము, ఈ యనంతసంసార చక్రములో జీవులకు భావి
దశ కవకాశము కల్పితమైయున్నది. జ్ఞానమువలననే జీవులు కాలము
నుండి నిత్యస్థితిని బొందుదురు కాలగతిలోఁ "గాలాతీత నిత్యత్వమున్న
దని యవిచ్ఛిన్న పరిణామమే చూపుచున్నది. టిమోస్‌నందు ప్లేటో
సుప్రసిద్ధ వాక్యములలో, "కాలము శాశ్వతత్వముయొక్కగతిగల ప్రతి
బింబమే" జన్మాంతరముయొక్క యాథార్థ్యమును నిరూపించుటకు

---

1) శం। భా। 4, 1, 15

2) శం। భా। 4,1,15

3) అర్వాచీనాద్వైతమున భిన్న భావములు ప్రకటితములైనవి: (1) జీవన్ముక్త్య వస్థలో మూలావిద్య కొంతవఱకుఁ దనశక్తిని నిలుపుకొనును (2) అవిద్యా వాసన, అవిద్యా నాశనమైన వెనుకఁ గొంతదినముల యుండును (3) మూలావిద్య దగ్ధ వస్త్రశేషమువలె నుండును (4) జీవన్ముక్తునికి [illegible], దేహము మున్నగునవి కల్పితములు, చూ. సిద్ధాంతలేశము 4 ప.

4) శం। భా। బృ। ఉ। 1,1,1 సర్వజ్ఞాత్మముని యొక్కఁడే జీవన్ముక్తి నంగీకరింపఁడు మిగిలిన యద్వైతులందరు నంగీకరించిరి.

శంకరుఁడు క్రొత్తకారణములను జూపియుండలేదు. భౌతికదేహము నశించినపుడు తనస్వభావము ననుసరించి యొక నూతనదేహకల్పనము చేయు బీజమొకటి మిగిలియుండు నని విశ్వసింపఁబడెను. జీవాత్మ యనఁగా దేహమే యనియు, దేహనాశముతో నాత్మయునశించు ననియుఁజెప్పు నాస్తికవాదమును శంకరుడు ఖండించినాఁడు.[1] ఆత్మ దేహభిన్నము; ఆత్మకు భిన్నజన్మములలో నేకత్వముండుటవలననే స్మరణాదికమున కవకాశము కలుగుచున్నది.[2] మన శరీరములు భిన్నమైనను, మనలో నవినాశియగునదేదో యున్నది. దీనివలననే జన్మాంతరమున కవకాశము కలుగుచున్నది. మనము సంపాదించిన జ్ఞానమును, మనము నిర్మించుకొనిన శీలమును మనతో జన్మాంతరములలోఁ గూడి వచ్చును.[3] పుణ్యాత్ములు పాపచరితులు సున్నత జన్మములను, నధర్మపరులు పాపులు హీనజన్మములను గాంతురు. భవిష్యజ్జన్మ స్వరూపము భూతజన్మములోని శీలసంపదపై నాధారపడియుండును.

---

1) దేహ మున్నంతకాల మాత్మ గుణములు గోచరాపులు గావున నని దేహ గుణములే యనవచ్చు ననుట యుక్తమేలన, మరణానంతరము దేహమున్నను నాత్మ గుణములు చూపట్టుటలేదు. దీపకళికలోఁ జూచుటకొఱకు దీపము కావలెను గానఁ జూపు దీపగుణమని చెప్పరాదు, దీపమువలెనే దేహ మొక యుపకరణము. మఱియు దేహా వసరము కూడ నెల్లప్పుడుండదు; దేహము నిద్రలో విశ్రాంతమైయుండఁగా మన మెన్నియో వస్తువులను జూచుచున్నాము. మనకు గోచరములగు రూపాదిదేహగుణములకును, మనకగోచరములగు నాత్మగుణములకును భేదమున్నది. దేహాస్తిత్వమువలన జీవగుణా స్తిత్వము ఋజువగును గాని, దేహము లేనిదే కాదనుమాట నిజమే. జీవి దేహాంతర మునఁ జేరి యుండవచ్చును. జీవము భౌతికవస్తులక్షణమైనచో, ఏ భౌతికవస్తు వులు జీవ దృగ్విషయములు కావలెను. భూతములు, వానివలన నుత్పత్తియైన వస్తు జాలమును మనము దర్శించి, వాని యస్తిత్వమును నిర్ధారించుచున్నారము కావున, దర్శనము వానికి భిన్నమైనదని విశ్వసింపవలెను.

2) శం|భా| 3,3.54.

3) శం|భా| 3,4,11 బృ|ఆ|ఉ|4,4,2|ఛా.శం|భా| 3,1,5-6.
భా. 9—12

జన్మమరణములు జీవాత్మకు దేహసంయోగ వియోగములనే ప్రవర్తించును [1]

శంకరు ననుసరించి, వైదికదేవతలు నమర్త్యులు గారు, ఏలన, "దేవతల యమరత్వమునకర్థము వారెక్కువ కాలము జీవింతురనియు, వారియైశ్వర్యము స్వీయఫలముపై నాధారపడినది కాక యీశ్వర ప్రసాదమే" యనియుఁ దెలియవలెను. [2]

మరణానంతర జీవప్రయాణమును శంకరుఁడు సవివరముగా వర్ణించినాఁడు. సుకృతజీవులు మరణించిన వెనుక యముని కిరణమయ స్వర్గమునకుఁబోయి, పితృదేవతల[3] తోఁ గలిసి సుఖజీవితముల గడపుదురు, దుష్కృతులైన వా రంధ తమస్సహిత హీనలోకములలోఁ బడుదుర[4]ని ఋగ్వేదము చెప్పినది. జ్ఞానులు దేవయానమున నుత్తమలోకముల ద్వారమునఁబోయి, పునరావృత్తిరహిత బ్రహ్మలోకప్రాప్తి నొందుదురు. కర్మనిష్ఠాపరులైనవారు పితృయానమునఁ జంద్రమండలవర్తులై పుణ్యఫలము ననుభవించి, తిరిగి తమ పూర్వకర్మానుగుణములైన జన్మముల నొందుదురు. జ్ఞానకర్మలు లేనివారు, క్రిమికీటకాదులు, వృక్షలతాదులునై, చంద్రమండలబాహ్యలోకమైన లేని హీనప్రదేశములలో జన్మింతురు.[5] ఈ మూఁడుమార్గములను సంసారచక్రములో భిన్నఘట్టములని శంకరుఁడు నిశ్చయించినాఁడు. మోక్షమువీనికన్నిటికిభిన్నమైనది. పితృయానమువలనఁ దిరిగి యిహలోక జన్మము సంభవించును. దేవయానమువలనఁ బునరావృత్తిలేనిబ్రహ్మలోకప్రాప్తిగలదు. ఛాందోగ్యోప

1) శంభా 2,3, 16-17

2) శంభా 1,2,17.

3) 10, 14, 10

4) 10, 152, 4

5) బృహదా 6,2,16

నిషత్తు[1] నందు దేవయాన పితృయానములు రెండువర్ణింపఁబడినవి, జ్ఞానహీనులందఱు పితృయానమునకే పోదురు వైదికోపనిషద్వాక్య సమన్వయముచేయు నుద్దేశముతో శంకరుఁడు లోకాంతరములందును, జన్మాంతరములందును రెండు విధములుగాఁ గర్మఫలముల ననుభవింతు రని చెప్పినాఁడు.[2] వైదికకర్మలవలనఁ బుణ్యలోక సుఖప్రాప్తియు, నైతికజీవితమువలన నిహలోకమున జన్మాంతర ఫలితములు గలుగునని వివరింపఁబడినది.[3] సంప్రదాయసిద్ధ ధర్మముల ననుసరించి, వైదిక కర్మలు చేసినవారు, సమ్యక్ జ్ఞానశూన్యులై, పితృయానమున ధూమావృతములైన ప్రదేశముల ద్వారమునఁ జంద్రలోకములో సత్కర్మ ఫలము ననుభవించి, తిరిగి వచ్చి యిహలోకమున జన్మింతురు. ఈశ్వ రారాధనము చేయుచు జ్ఞానయుక్తపుణ్యకర్మల నాచరించినవారు దేవ యానమున నున్నతోన్నత లోకములనొంది సూర్యమండల ద్వారమున బ్రహ్మలోకసిద్ధి నొందుదురు.[4] ఈశ్వరు నారాధించినయాతఁ డీశ్వర శక్తులను బొందునుగాని, "ఆతని యజ్ఞానమింకను తొలఁగి పోలేదు." అవిద్యా నివృత్తి కాలేదు. హీనదేవతల నారాధించినవారు నుచితఫల సిద్ధిని గాంతురుగాని మోక్షమార్గము నెన్నఁడు పట్టఁజాలరు.[5] అవినీతి పరు లధోలోకపతనము నొందుదురు.[6] కాని యీశ్వరదర్శనావకాశము లేని శాశ్వత నరక మెవ్వరికిని లేదు.[7]

1) 5,3,10; శాం॥ భా॥ 3,1,12-21

2) శాం॥ భా॥ 3,1,8

3) శాం॥ భా॥ 3,1,9-11

4) శాం॥ భా॥ 4,3,1-6

5) శాం॥ భా॥ 4,1,4; 4,3, 15,16.

6) శాం॥ ఛాందోగ్య॥ ఉపోద్ఘాతము; చూ॥ 4.1,1-7,18

7) దేవయానమున బ్రహ్మలోకమునకుఁ బ్రవేశించిన వారిస్థితినిగూర్చి యొక సమస్య బయలుదేఱినది. వారికి దేహములుండవని బాదరియు, నుండునని జైమినియు భావించిరి. రెంటిని సమన్వయించి యావశ్యకము గల వీరు తమ విలాసము ననుసరించి, దేహములు గలిగియు లేకుండియుఁగూడ నుండఁగలరని బాదరాయణుఁడు వచించెను. (శాం॥ భా॥ 4,4,8,22.)

మరణకాలమున నింద్రియములు మనస్సునందును మనస్సు ముఖ్యప్రాణమందును, ముఖ్యప్రాణము జీవుని శీలవాహనరూపమైన సూక్ష్మ శరీరమునందును ప్రవేశించును. అవిద్యయు, పూర్వ సంస్కార సహిత సూక్ష్మదేహమును జీవోపాధులు; ఇవి దేహమును విడచి పోవును.[1] ఈ సూక్ష్మదేహము సూక్ష్మనాడుల ద్వారమున బయటికిఁ బోవుటచే నట్లు చెప్పఁబడినది. ఈ సూక్ష్మదేహము తనుత్వము, సంచార శక్తియుఁ గలిగి తనగమనమున కే యాటంకమునుండక, యెవ్వరికి గోచరింపని స్వచ్ఛతను గలిగి యుండును.[2] మోక్షకాలమువఱకు నీ సూక్ష్మశరీరము నాశము గాదు.

## 15 — మతము

శంకరు నద్వైతవాద మఖండప్రజ్ఞాఫలితమైనను, మతనిష్ఠ నాసంగఁజాలదని యాక్షేపణగలదు. ఆతని నిర్గుణబ్రహ్మ మనహృదయములో నుజ్జ్వలప్రేమనుగాని భక్తినిగాని జనింపఁజేయఁజాలదు. ఎవ్వఁడు నెన్నఁడు జూచి యుండనట్టియుఁ జూడరానట్టియు, నెవ్వఁడు సమీపించుట కవకాశములేని జ్యోతిర్మయస్వరూపముగలట్టియు నిర్గుణబ్రహ్మమును మన మారాధింపఁజాలము. నిరాకారబ్రహ్మము మన యారాధన కనుకూలమగు రీతిని సాకారమయ్యెనని చెప్పఁబడెను. ఈశ్వరారాధన మనఁగా జ్ఞానపూర్వకముగా మిథ్యాభావముతోడి సాంగత్యము కాదు. పరిచ్ఛిన్నమానవమున కీశ్వర రూపమువనే నిర్గుణ బ్రహ్మరూపము గోచరించును. పరమాత్మతో నేకత్వము గాంచనివ్యక్తికి పరమాత్మ అనంతకల్యాణ గుణ పరిపూర్ణుఁడుగాఁ గన్పట్టును.[3] ఈశ్వర భావ మత్యున్నత తర్కసిద్ధమైన సత్యమై యత్యంత నిగూఢమత విశ్వాసముతో మేళవించునది. ఈ సగుణ బ్రహ్మము స్వచ్ఛ భక్తిపూజా పాత్రుఁడు, ఆతడు మానవకోటి భయభక్తుల నుదాసీనతవహించు ధర్మ

1) 2 2,1-5
2) 4,2, 9-11
3) శాం॥భా॥ 3,3,12

సంబంధములేని దైవము కాఁడు. ఆతడు రజస్సత్త్వపరిపూర్ణుఁడై, ధర్మ దయానిధియై, సర్వజ్ఞత్వ సర్వవ్యాపిత్వ సర్వశక్తిమత్వములు గలిగి జగత్కర్తయు భర్తయు ధర్మాధ్యక్షుఁడునై వ్యవహరించును. శంకరుఁడుచెప్పిన యీశ్వరునకు స్వచ్ఛసంపూర్ణ పావనశీలమును, ధార్మిక సౌందర్యమును ముఖ్య లక్షణములు. జీవేశ్వర సంబంధము, ప్రేయసీ ప్రియ సంబంధముగా, భృత్యస్వామి సంబంధముగా, పితృపుత్ర సంబంధముగా మిత్రసంబంధముగాఁ జెప్పఁబడెను. తన సంతానమును దన వైపాకర్షించు కార్యములో నీశ్వరు ననంతకల్యాణ గుణములను శంకరుఁడు వర్ణించునప్పు డాతని తత్త్వసిద్ధాంతములోని కావ్యమువడ లును. శంకరుని దృష్టిలో మతమనఁగా సిద్ధాంత నిర్వచనముగాని, కర్మకలాపముగాని కాదు, దైనికజీవితానుభూతియే. నిర్గుణ బ్రహ్మ స్వరూపమునెడ నాత్మగౌరవభావముతో మత మారంభమై పరమాత్మ తత్వసిద్ధితో నంతమగును. పరబ్రహ్మ సాక్షాత్కారమే మతసిద్ధి. ఆత్మ సహజ స్వభావము నెఱుఁగుటయే నిక్కమగు భక్తివిధానము.[1] వివిధ ధ్యానమార్గము లుపనిషత్తులలోఁ[2] జెప్పఁబడినవి; సాధకులు తమస్వభా వోచిత మార్గము నొకదానినెంచుకొని తరింపవలెను.[3] ధ్యేయ మందఱికొక్కటే, ధ్యానసాధనలలో వైవిధ్యముగలదు. మతారాధనము స్థూలముగా ద్వివిధము: సగుణ బ్రహ్మోపాసనము, ప్రతీకోపాసనము.[4] సాధకుఁడు తన కీశ్వరుఁడు బాహ్యముగ నున్నాఁడని విశ్వసించునపుడు ప్రతీకో పాసన కవకాశ మున్నది.

ఉపాస్యకోపాసక సంబంధమువలన రెంటికిభేదమున్నదని వ్యక్త మగుచున్నది.[5] ఈ తత్త్వోపాసనవలన బ్రహ్మలోకప్రాప్తి కలుగును గాని, యచట జీవేశ్వరభేదము మిగిలియున్నది. ఆ స్థితినుండి ముక్తి

1) స్వస్వరూపాను సంధానం భక్తిరిత్యభిధీయతే (వివేకచూడామణి శ్లో 31)
2) 3,3,5
3) శాం॥ భా॥ 3,3 59
4) శాం॥భా॥ 4,1,3,
5) ఉపాస్యోపాసకభావోఽపి భేదాధిష్ఠానఏవ (శాం॥భా॥1,2,4)

క్రమముగానే కలుగును. మతమనఁగా జనసామాన్యభావములో సతీత మైనదని భావింపఁబడును. ఇది యసంపూర్ణమగు ననుభవము మాత్రమే. సమగ్రముగా సత్యము తెలియునంతవఱ కిదియుండును. కాని యిట్టి యనుభవ మతిక్రమింపఁ బడుటకు సందేహము లేదు, ఏలన, "పరిపూర్ణ తత్త్వసిద్ధి ప్రాప్తింపగనే, తదంశా మాత్రమగు ననుభూతి తొలఁగి పోవును" జీవాత్మైకత్వమును నిరూపించు బ్రహ్మవిద్వరేణ్యుల వాక్యములను శంకరుఁ డుదాహరించినాఁడు. "భగవాన్! నీవే నేను, నేనే నీవు"[1] "అహం బ్రహ్మాస్మి" మున్నగు మహావాక్యముల కర్థవివరణముచేయుట ప్రతిమతతత్త్వమునకు ముఖ్యకర్తవ్యమై యున్నది. "తత్త్వమసి" వాక్యములలో నీశ్వరునికి వానిసృష్టియైనజీవునికి భేద మతిక్రమింపఁబడినది. మహానుభూతిలోని భేదములన్నియు సిద్ధికలుగుటతోఁ దొలఁగిపోవునని శంకరుఁడు వచించినాఁడు సాకారమగు నీశ్వర భావము మహానుష్ఠానదశలో మాత్రమే యర్థవంతమగును; బ్రహ్మజ్ఞాన దృష్టిలో దానికర్థములేదు[2] అవిద్యావరణముచే సంధుఁడగు పరిచ్ఛిన్న మానవుఁడు నిర్గుణబ్రహ్మము సవికల్పకమనియుఁ, దనకు భిన్నమైన దనియుఁ దలఁచును, బాహ్య ప్రకృతిచే నాచ్ఛాదితమైన మానవుని బుద్ధికి మాత్రమే బంధమోక్షము లర్థవంతములై తోఁచును. మానవునకు వేఱుగానున్న యీశ్వరత్వమే పరమ సత్యమైనచో, యోగుల దివ్యానుభవము లర్థరహితము లగును, మన మొకపరిపూర్ణతలేని దైవముతోఁ దృప్తిపొందవలసియుండును. పరిపూర్ణత లేనివాఁడు దేవుఁడు కాఁజాలఁడు, అతఁడే పరిపూర్ణుఁడైనచో మహానుభూతియే సర్వోత్తమ

---

1) త్వంవా అహమస్మి భగవోదేవతే అహంవై త్వమసి భగవో దేవతే (శం॥భా॥ 4,1,30)

2) పోల్చు: బ్రాడ్లే "నా దృష్టిలో నిర్గుణతత్త్వ మీశ్వరుఁడుగాఁడు ఆరాధన దృష్టి నధిగమించినచో నీశ్వరత్వమున కర్థము లేదు ఈ దృష్టి కేవల వ్యావహారికమే. నిర్గుణతత్త్వ మీశ్వరుఁడే కాఁదనఁగా, నిర్గుణ తత్త్వము సర్వసంబంధ విరహితము అందుచేఁ బరిచ్ఛిన్న బుద్ధికి దానితో సంబంధము లేదు అనిర్గుణతత్త్వమును మనమారాధించుటకుఁ బూనుకొని మనారాధన వస్తువునుగా నంగీకరించినచో దాని నప్పుడే మనము మార్చినవార మగుదుము (అపి. అండ్ రియాలిటి పు 428)

మైనది కాఁజాలదు. [1] ఈశ్వరత్వమే పరిపూర్ణత్వము కాఁజాల దేలన మానవుని యపరిపూర్ణతచేతనే మిగిలియుండును. అదిపరిపూర్ణతలేని దైనచో నీశ్వరత్వభావ విరుద్ధమగును. అందుచే మాతామహాతిలో మూల మై యుద్భవమున్నది కావున నది యవిద్యావరణమునకుఁ జెందినదని స్పష్ట మగుచున్నది.

వైదికదేవతలనంగీకరించనిదే కర్మకాండకవకాశములేదు. సంప్ర దాయము నంగీకరించు శంకరుఁడు దేవతలనఁగా భూతాది పతులనియు, ప్రకృతిశక్తుల రూపములేయని నిర్వచించెను. ఆదిత్యుఁడు మున్నగు దేవతలు తేజస్సు మున్నగు లక్షణములకు సంబంధించి యున్నను శ్రుతులు చెప్పురీతిగాఁ బంచభూతముల గుణములైన దివ్యస్వరూప ములనుగలిగి యీశ్వరశక్తి సమన్వితములై యున్నవి. మఱియు నవి బ్రాహ్మణమంత్రములలో నుపయోగింపఁ బడినవి. [2] భిన్న ప్రాణికర్మలకీ దేవత లధిష్ఠాతలు. [3] అగ్ని వాక్కునకు, వాయువు ప్రాణములకు, నాదిత్యుఁడు నేత్రమునకు నధిష్ఠానదైవములు. జీవుల సుఖదుఃఖములతో నీ దేవతలకు సంబంధములేదు. [4] మరణకాలమం దీ దేవతలు తమక్రియాశక్తి నుపసంహరించుకొందురే కాని ప్రాణశక్తు లతోఁ గలిసి, దేహాంతరమునకుఁబోవు. వాని పుణ్యపాపముల ననుస రించి, పరమేశ్వరుఁడు దేవతలను, మనుష్యులను, పశువులను సృజిం చును. దేవతల అమరత్వ మాపేక్షికము. దేవతలును సంసార బద్ధులు: వారికిని నిత్యస్థితిలేదు. [5] వారికిఁదరణోపాయము బ్రహ్మజ్ఞానమే. వారిందు కీశ్వరునిపై నాధారపడి జీవింతురు. దేవతలు బ్రహ్మవిద్యకై కృషిచేసిన గాథలు శ్రుతులలోఁ గలవు. ఈ దేవతలు సామాన్యులవలె జన్మమరణవశులైనచో వేదములనిత్యతకు లోపమగునను నాక్షేపణము

---

1) చూ. బ్రాడ్లే: ప్రూఫ్ అండ్ రియాలిటి పు 436
2) చూ. డ్యూసెన్ సిస్టమ్ ఆఫ్ వేదాంత పు 65-66
3) బృహ. ఉపనిషత్తు, 1,2,4
4) అది యొక్కటే శోక్త: దేవతలు భోగోపకరణ భూతములు
5) శాం: భా: 1-3-28

నిలువఁజాలదు, ఏలన వేదవాక్యములు స్థానవిశేషముల లక్షణములక
వర్తించునేగాని వ్యక్తులకు వర్తించవు. "ఇంద్ర" శబ్దము స్థానవిశేషమే
కాని వ్యక్తికిఁ జెందినది కాదు. ఆ స్థానము నెవరాక్రమించిన వారావ
ముతోఁ బిలువఁబడుదురు. దేవతలవ్యక్తిత్వము నిజముగాదు, ఏలఁ
వారుయజ్ఞములలోఁ బ్రత్యక్షమగుట లేదు, అట్లు ప్రత్యక్షమగుట కవకా
ములేదు, ఏలన అనేక స్థలములలో నొకేమారు వా రెట్లుండఁగలర
యాక్షేపింపఁబడెను. దీనికి సమాధానముగా శంకరుడు దేవతలకు
గనపడకుండ నుండు శక్తి కలదనియు, యోగులవలె వారికి నానారూ
ధారణ శక్తి కలదనియుఁ జెప్పినాఁడు.

శంకరుని తత్త్వమున కాలయములు, కర్మలు నవసరము లేకున్న ను
సంప్రదాయ విశ్వాసబలము నెఱిఁగి యున్నవాఁడు కావున, వానియంద
నమ్మకముండుట దోషముకాదని వచించినాఁడు [1] మతార్థవివరణమ
విషయములో శంకరుఁడితరవేదాంత వ్యాఖ్యాతలవలె సంప్రదాయ వా
ముగాక, శాస్త్రీకవాద పద్ధతి నుపయోగించినాఁడు. ఆస్తికవాది సాధ
రణముగానాక మతశాఖావాదముపై నాధారపడును తనమతశాఖక
జెందిన సిద్ధాంతముల నాతఁడు క్రోడీకరించి, వివరించి, సమర్థింప
జూచును. తనతత్త్వము చెప్పఁదగినమాత్రమే సత్యమని యాతఁడు విశ
సించును. వానిపై నాధారపడి యాతని మతము నిలుచుటయో క్రుంగ
టయో జరుగును. నిక్కముగాఁ దత్త్వవేత్తయైనవాఁడు తాను జన్మి
చిన మతమునుగాని ప్రధానముగాఁ దీసికొనఁడు. అతఁడు మతము
విషయమునుగూర్చి నిర్దుష్ట పరిశీలనము చేయును. ఎల్లవేళల నన
మత భావములఁ దనలో నిముడ్చుకొను విశ్వవిశాల సర్వసహనభావన
గల తత్త్వోపదేశకులలో శంకరు డగ్రస్థానమును వహించును. ఈ న
మతాదరభావము, మూర్ఖవిశ్వాసజన్యమునుగాదు, సంధిమార్గమున
గాదు; ఆదిశంకరుని తత్త్వమతవిధానమున కత్యంత సహజమైన

1) నా నానేక దేవాలయములు దర్శించినందుకు క్షమింపుమని శంకరుఁడు పర
కాలమునం దీశ్వరునిఁ బ్రార్థించెనని చెప్పుదురు ఏలన నీశ్వరుని సర్వవ్యాపిత్వమున
భంగము కలుగుట కాతఁ డంగీకరించినట్లయినది

సకలసిద్ధాంతములకుఁ గల లోపముల నాతఁడు గుర్తించి, పరమేశ్వర తత్త్వము నే యొక సిద్ధాంతమునకును బంధింపుట కాతఁ డిచ్చగింప లేదు. వివేకముగలవాఁ డెవ్వఁడును తనమత శాఖయే యీశ్వరుని బరిపూర్ణముగాఁ దూఁచి గ్రహించి, తన తత్త్వమును లిఖించెనని చెప్ప సాహసింపఁడు. ప్రతి మతశాఖాతత్త్వమును దైవవిశ్వాస రంగమునకొక పరిశోధనము; పనుష్ఠానదశలో నొకఘట్టము నగును. మహానుభూతి యిదియే సాధనము. ఏయొకమతము ననుసరించినదైన నొక వ్యక్తి యీశ్వరు నన్వేషించి, తనసాధనము వ్యర్థముగలదని విశ్వసించినచో నట్టి పద్ధతి విసర్జింపఁదగినదని యుపదేశింపఁబూనుట గర్హింపఁదగినది. భక్తివిశ్వాసములతో నీశ్వరు నారాధించి, తన్మూలమునఁ దమకు దివ్యానుభూతికలిగినదని తృప్తిచెందువారలను ఖండించు మతోన్మాదము శంకరునికిలేదు. పరస్పర వ్యతిరేక విశ్వాసములు గల్గినను, ధార్మికోత్సాహము, చిత్తశాంతి, పరమాత్మసాంగత్యము, భిన్నవర్గములకు సమానఫలితములైనప్పుడు, శంకరుఁడు వారి భావములను ఖండింపఁబూనుకొనలేదు ప్రపంచములోని మతప్రవక్తలలో నుత్తమప్రతిభావంతులలో నొక్కఁడు వచించినరీతిని, "వారి విశ్వాసముల వలనఁగాక, ఫలితముల మూలముననే, జనులసంగతి తెలియఁగలదు" దైవారాధన తత్పరతయు, లోక సేవాభిరతియుఁ గలిగి యున్నచో లోకు లేనామముతో నీశ్వరు నర్చించిన నిబ్బందిలేదు. మతభేదము ననుసరించి, యొకే సత్యమును భిన్ననామములతో భావించిరి.[1] ప్రకృతి వెనుకనున్న సత్యమును బ్రకటించు నిమిత్తము, మన యవసరమునను సరించి, పెక్కుచిహ్నముల నుపయోగింతుము. ప్రత్యేకమతశాఖా దురభిమానము లేనివాఁ డగుటచేతను, మానవకోటియందవ్యాజకరుణగలవాఁ డగుటచేతను, శంకరుఁడీమాయాకల్పితజగత్తులో మానవుల పశ్చాత్తాప సంకల్పములే ప్రధానములైనవని గుర్తించినాఁడు. శంకరుఁడు కేవల ప్రచారముకొఱకుఁ దన శాస్త్రీయసిద్ధాంతములను సవరింపఁబూనుకొనలేదు. శంకరుని దృష్టిలో హిందూమత మనఁగాఁ దనలో భిన్న మనస్తత్త్వములకు భిన్న భావములకుఁ దావొసఁగునది. అందుచే నాతని షణ్మతస్థాపనకాచార్య

1) హరివంశము పు 18

డనిరి.[1] మతవిషయములలో, వ్యవహార ప్రపంచమునకు సంబంధము లేని గగనసమోన్నత లక్ష్యములను బ్రకటించుట సులభమే, లేక, మతొక పంక నున్న కాదర్శములని విడిచి, కేవల వ్యావహారిక భావమార్గములం బట్టుటయు సులభమే కావచ్చును, గాని, విస్పష్టమగు వ్యవహారజ్ఞానమును, మహోన్నత లక్ష్యనిష్ఠతో సమన్వయమొనర్చుట కష్టసాధ్యమైన కార్యము. ఇట్టి కర్తవ్యమును నెరవేర్చుటకే శంకరుడు పూనుకొనెను. ఒకే మతప్రవక్త, భిన్నములగు వారు మతతత్త్వములను సమర్థింపం జూచుకొనుట పరమాద్భుత దృశ్యము! అట్టి యద్భుత దృశ్యము హిందూదేశములోనే చూడ సాధ్యమగును విద్యారణ్యుడు పచించిన రీతిగా మానవులు భగవంతునికి నానావస్తురూపము లిచ్చిరి. సర్వాంతర్యామియు, దారుశిలా విగ్రహరూపియు వాడేయని ప్రజలునమ్మిరి,[2] వైష్ణవశాక్తేయాది మతశాఖలవారు పరస్పరము కలహించుచుండగా, నీ మతతత్త్వములను నికృష్టవాద సీమనుండి సత్యస్వరూప సీమకు లేవనెత్తి, శంకరుడు వానికి సమున్నతస్థాయిని గూర్చెను. ప్రచారములోనున్న భిన్నమత రూపముల కేక మూలాధారమును సూచించి, మహోన్నత పరమార్థ లక్ష్యమునకు వీని ననుసంధించెను. మానవ హృదయాభ్యంతరమున నిగూఢమై నిలిచియున్న సత్యమే మతాధారమని యాతడుగ్గడించెను ఆత్మదర్శనమే సర్వమతపరమావధి; జీవాత్మ పరిచ్ఛిన్నరూప భావముకతీతమగు పరమాత్మతో తాదాత్మ్యము గాంచునందాక సంసారచక్రమునం బరిభ్రమణము తప్పదని యాతడు బోధించెను. తాత్త్వికదృష్టికి బరమాత్మ యేకము నద్వితీయమే యయ్యును, భిన్నరూపముల భావింపబడుచున్నది. సత్యస్వరూపములో సోపానభేదము లేదు సత్యస్వరూపముగూర్చిన మనభావములలోనే సోపానభేదము లేదు సత్యమునుగూర్చిన మనభావములలోని సోపానక్రమ తారతమ్యమున్నది. దేవుడేలేడను నిశ్చయమున కాతడు దుముకలేదు; దేవు

1) శైవవైష్ణవ, సౌరశాక్త, గాణాపత్య కాపాలికములు

2) అంతర్యామి సమారభ్య స్థావరాంతేశ వాదినః
(పంచదశి 6-121; చూ 6-206-209)

డున్నదో, వాతనిఁగూర్చి మనము లోకరీతి భావములను వెల్లడింతురు. భావమై విధ్యమునకుఁగారణ ముపాధివై విధ్యమే.[1] ఈరీతిగా శంకరుఁడు నాస్తికవాద మూర్ఖవాదములకు స్పష్టముగా దూరస్థుఁడు. తన మహోదార నిశ్చయముల కనుగుణముగా, నాతఁడు భిన్న దేవతా స్తవములను రచించినాఁడు, భక్తిరసపారవశ్యమున నాతని స్తోత్ర గీతావళిని మించునదిలేదు. కాని దీని యర్థము శంకరుఁడు మూఢ విశ్వాసములను నీచారాధన విధానములను సమర్థించెనని తలఁపరాదు. మతముపేరఁజరుగుచున్న కొన్ని నీచోపాసనకలాపములనాతఁడు నిరసించినాఁడు. తనయద్వైతసిద్ధాంతము ననుసరించి, యీశ్వర తత్త్వము వర్థముచేసికొనుటలో సమున్నతాశయముల నెఱుగునట్లు ప్రజల కాతఁడుపకృతిచేసెను. చిత్తశుద్ధితో మనము సత్యము నెఱుఁగ యత్నించినచో మన మానవమునకు సత్యము నెఱుఁగ యత్నించినచో మన మానవ

1) శం। భా. 1,1,20 పేరవ్వ్యాన్ హాప్కిన్స్ వ్రాసిన యొక గ్రంథములో నొక వ్యాసమున్నది. దానిభావము శంకరుని తత్త్వమునకు సరిగానరిపోవును: పూర్తిగా వేరువిషయముగూర్చి యొకమతమునకు వేరొకమతమునకును, బాహ్యదృష్టితోఁ జూచినచో ననేక భేదము లున్నవి. అట్లే ఒక మనుష్యునకు వేరొక మనుష్యునకేకాక యొకే మతమునందు, నొకే మనుష్యునందుఁగూడఁ గాలభేదముతో భావభేదములున్నవి. కాలమునందు వ్యక్తులు, మతములు చెప్పుకొనుచున్న తమ యనుభవములు, వానిపుట్టించిన విషయముల విశదముగాఁజూచినచో నేమియు సంస్కారము లేని బాల్యప్రసంగము లనియే చెప్పవచ్చును. గాని, భిన్నరూపములలో, నెంతస్వల్పముగానైనను, సనాతనమగు పరమైకసత్యమున భాగస్వాములగుచున్న వనుటలో సందేహములేదు. మానవమానవమునకు బాహ్యమునందుండియు, మానసాంతర్గతమైయుండియుఁగూడఁ బనిచేయుచున్న సత్యస్వరూపమే, సత్యాన్వేషణమునకు మానవునిఁ బురికొల్పుచున్న కారణము, సందర్భము, విషయమునకై యున్నది. అందుచేతనే మానవుఁడు నిత్యము పీల్చుచుని పునస్సందర్శనకై యత్నించుచున్నాఁడు. మానవుని మతభావముల క్రమ వికాస గాంభీర్యములకు, ప్రత్యక్ష మహానుభూతియందే నిత్యశాంతి సౌఖ్యము లున్నవని మానవుఁడు నిశ్చయించుటకును, పరమ సత్యమునింతను సమగ్రముగానమభవించవలెనను కాంక్షయు, మానవబుద్ధి భ్రమలనిర్వర్తనము లావలనెర వేర్పుట కసమర్థములనియు నేక కాలమున గ్రహించుటకుఁ, బరమసత్య మనుభవైకవేద్యమే యని తెలియుటకు సర్వత్ర నిండి యుండి మానవునిఁ బురికొల్పుచున్న తత్సత్యమే కారణము," (ఫిలాసఫీ ఆండ్ రిలిజియన్ పు 44-45 )

ములకు సత్యము స్ఫురించునని యాతఁడు నమ్మినాఁడు. ఆవరణలో మన్న మతములనుగూర్చి యాతని కాదరబుద్ధియు, విచక్షణ దృష్టియుఁ గూడఁ గలవు. పురాతనమైన హిందూమత విశిష్టసందేశము నీ నూత్న యుగావసరముల ననుగుణముగా నాతఁ డుగ్గడించుటకు యత్నించి దానిలోని శ్రేష్ఠత కిదివఱకంటె నెక్కుడువిస్పష్టతనుగూర్చెను. ఈ యుద్దేశములో జాతిజీవనై కత్యమును సుప్రతిష్ఠిత మొనర్చు నుదార భావముగర్భితమై బోధచూపుచున్నది. కేవలబాహ్యవ్యవస్థా నిర్మాణము వలనఁగాని, నియమితములగునాంతరంగిక విశ్వాసములవలనఁగాని, యీ యేకత్వమునుసాధించుట శాతఁడు పూనలేదు. విశాల విజ్ఞానప్రచార ముచే నీ పనిసాధింప నాతఁ డుద్యమించెను, వ్యక్తిగతమైన మహాను భూతియొక్కలక్షణమునకే ప్రాధాన్యమిచ్చి హిందూమతము నాతఁ డాధ్యాత్మిక ప్రాతిపదిక నిచ్చి పోషించెను. హిందూవిజ్ఞానమును వివరించుటలోనాతఁడు తనకు వ్యతిరేకములైన భావములకుఁగూడ నప్పు డప్పుడు స్థాన మీయవలసి వచ్చెను.

భిన్నమతశాఖా వాదోపవాద ఝంఝామారుతాళ్ళను లఱఁగి పరిశుద్ధ వాదసిద్ధాంత ప్రశాంతిరూపముగా శంకరాద్వైతము ప్రకాశించెను. అది వితండవాదముకాని, బాహ్యశాసనముగానికాదు, పరిణతినందిన రాజ మర్యాదతోఁ గూడిన భావవైభవము. దాని తాత్త్వికమైన బుజు ప్రయ త్నమును, సమున్నతజ్ఞానమును ప్రదర్శించుచు మహానుభూతికి మానవహృదయాంతరము నిలయమగుటచే, దానినెన్నఁడును దొలగింపఁ జాలము. మానవు నాధ్యాత్మిక కృషియంతయు సత్యసాక్షాత్కారసిద్ధి గావించుటకొఱకుద్దేశింపఁబడినది కాని తాత్కాలిక లాభసంపాదనము కొఱకుఁగాదు. స్వీయపరిచ్ఛిన్న వ్యక్తిత్వగౌరవ గర్వములను, నహం కార మమకార దృక్పథములను బరిత్యజించినచో గాని సత్యసాక్షాత్కార మున కవకాశములేదు. మన పరిచ్ఛిన్నమగు జ్ఞానప్రమాణములచేఁ బరమేశ్వరునిఁ గొలుచుటకు యత్నింపరాదు. భగవంతుఁడు తనకొఱకే స్వయంస్థితి గలిగియున్నాఁడు, కాని కేవలము మనకొఱ కాతఁడున్నాఁ డని తలఁపరాదు. మన తర్కము, మనధర్మము ననుసరించి, మన కోర్కెల దీర్పులక్షణములుగల వానిగా దేవుని మన మూహింతుము.

దుర్బలమానసుఁడగు మానవుఁడు తన యల్పకాంక్షల నెరవేర్చుకొనుటకై యీశ్వరు నుపకరణముగా దలఁచు పద్ధతి మానవునికి గౌరవప్రదమగు నేమో కాని యీశ్వరునికిఁగాదు. నిజముగా దేవునిఁ బ్రేమించువాఁడు తన్నుఁదిరిగి దేవుఁడు ప్రేమింపవలెనని కోరఁడని యొకవిధముగా స్పైనోజా తత్త్వవేత్త చెప్పిన భావముతో శంకరుఁ డేకీభవించును

శంకరుని యద్వైత మూహాతీతముగా గోచరించుటకుఁ గారణ మేమనఁగా, మనము గ్రహించుటకు సాధ్యమగు దానికంటెఁ గ్రింది మెట్టులో నుండుటలోనే మనము తృప్తినిగాంచుచున్నాము. మనుష్య లక్షణము లంటగట్టఁబడిన దైవతత్త్వమును శంకరుఁడు నిరసించిన కారణమున నాతనిమతము కొంత నిరాశాజనకముగా నుండును కాని, పర మాత్మకు మనము జ్ఞానము సంకల్పము లేవనుట లోపముకాదు, వీని లోపము పరమాత్మయొక్క పరిపూర్ణతాలక్షణమే యగును. ఇంతమాత్ర ముచే శంకరునికి మతదృష్టి లేదనరాదు. అతని రచనలలో నీ మతదృష్టి మహోత్సాహపూరితముగాను గొన్ని తావులలో మితిమీఱియుఁ బ్రకటింపఁ బడి యున్నది కాని మన సామాన్యమతభావము లాతని తర్కాసి ధారకు గుఱియైనవి, ఈశ్వరుని గూర్చిన భావములు మనవలెనే యస్థిర ములు నసంగతములు నని యాతని నిశ్చయము.

ఏదియెట్లున్నను, దైవవిషయములను బరీక్షించుటలో యోగ దృష్టితో సునిశితమైన ప్రజ్ఞాప్రభావమును మేళవించిన శంకరునిమూర్తి మనకు గోచరించును, ధ్యానసాధనమునకు శేముషీప్రతిభా వివేకము లాటంకములు గాఁజాలవని చెప్పుటకు శంకరుని జీవితమే మనకు సాక్ష్యము. మఱియు ధ్యానజీవితమునకు బాహ్యప్రపంచ ప్రవృత్తిని విసర్జింప నవసరములేదనియు నాతని జీవితము ప్రదర్శించినది వ్యక్తి గతానుభవమును, శ్రుతివాక్యమును, తాత్త్విక సమాలోచనమును శంక రుఁడు సమన్వయించినాఁడు.

## 46 _ తుదివాక్యము

ఉపనిషత్తుల మతమును గూర్చియుఁ, దత్త్వమును గూర్చియు నేకకంఠమునఁ బలుకును. పరమసత్యమునుగూర్చి యవి బ్రహ్మ

మనియుఁ బరమేశ్వరుఁ డనియుఁ దెలుపును. మోక్షమనఁగా బ్రహ్మైక్యమనియుఁ, గైలాసవాసమనియుఁగూడ నవి వచించును. మన కుపనిషత్తులలో గోచరించు బ్రహ్మమును గూర్చిన భావాత్మక వర్ణనములు, నీతి వాక్యములు సర్వ మత సారస్వతములకు సామాన్య విషయములే. క్రైస్తవ, మహమ్మదీయ, యూదుమతములకుఁ జెందిన యోగులందరు వాగతీతమగు సత్యమును గూర్చి మనకు వార్తలందించి యున్నారు. ఇతరు లీశ్వర పరిపూర్ణతా మహిమను గూర్చి పలికి యున్నారు యోగులను దత్త్వవేత్తలును భగవానుననంత తత్త్వమును గూర్చి వచింపఁగా, భక్తు లాతని మిత్రునిగా, రక్షకునిగాఁ జూతురు. ప్రతి మతతత్త్వము నీ ద్వివిధ దృక్పథములను గమనించి సమన్వయించి సమర్థింపవలసియున్నది. ఉపనిషత్తు లుపదేశించిన మహానుభవార్థమును గూర్చిన యీ సమన్వయము శంకరుఁడు లేవనెత్తెను. ఇది యొక ప్రత్యేక ప్రకరణమునకుఁ జెందినదేయైనను, దార్శనికాంశములన్నిటికి సముచ్చయము గావలెనన్నచో శంకరుఁడు చూపినపరిష్కారము, విశ్వవిశాలమగు సర్వముకలిగి, సంతృప్తికరమై యున్నదనిచెప్పనగును. ఇది ముఖ్యముగాఁ దార్శనికపరిష్కారమే; వివిధ భిన్న జీవిత దృక్పథముల మత్తైజమొనర్చి సమన్వయించి, శాంత్యానందముల నిర్మింపఁగల సామర్థ్యము సమ్యక్‌జ్ఞాన శక్తిదేయైయున్నది. బుద్ధి సర్వసమస్యలను బరిష్కరింపఁజాలదనియు, ననుభవజ్ఞానము దానికి సహాయభూతము కావలెననియు నాతఁడు చెప్పినమాట నిజమే. జీవితరహస్య సమస్యలకు శంకరుఁడు శిరమువంచునుగాని, యన్నిటిని రహస్యములని యాతఁ డంగీకరించఁడు. శంకరుని తత్త్వగర్భమందు సృష్టిరహస్యసమస్య సుప్రతిష్ఠితమైయున్నది. అందు సర్వజీవగతులు, సర్వానుభవస్పందనములు లగ్నములై యున్నవి.

ప్రపంచోత్పత్తికిఁ గారణ మనిర్వచనీయమని చెప్పుటకు బదులుగా నర్వాచీనాద్వైతులగు కొందరమార్గము ననుసరించి దుష్ప్రజ్ఞ దూషితులగు మానవులను మోసగించుటకు జగత్తు మిథ్యామాత్రమని కొట్టివేయుట శంకరుని తత్త్వమున కపచారమే యగును.

శంకరుని వేదాంతము చూపు తాత్త్విక గాంభీర్యము, తార్కిక సౌసుర్ధ్యము నిరుపమానములు. ఒక భావము ననుసరించి దాని కనుగుణముగా నింకొక భావ ముదయించి, అద్వైతములో నంతమై, సర్వభావసిద్ధి చేకూరును. అది యొక గొప్పయేకత్వతత్త్వవాదము, దానిని కేవల తాత్త్విక విమర్శనలచే ఖండింపఁ జూచుట దుస్సాధ్యము. మత, కవితానుభూతిలో సాధ్యములగు మహోన్నత క్షణములలో స్ఫురించు జీవజ్జ్యోతిని శంకరుఁడు మనకుఁ బ్రదర్శించును; అప్పుడు మనము బ్రహ్మవాదమును విడనాడి, యోగదృష్టి ననుసరించిన శంకరునితో నేకీభవింతుము. శంకరుఁ డీ మహోన్నతసీమ నిలిచి యున్నంత కాలమాతని మన మెదుర్కొనఁజాలము. ఇట్టి యుత్కృష్టానుభవ సీమ కెగఁబ్రాకలేని మానవులలో నధిక సంఖ్యాకులకు హృదంతరమున నొక విధమగు సంశయక్రిమి కొఱుకుచునేయుండును. అట్టివారు మనము పుట్టి, పెరిగి, జీవించుచున్న ప్రపంచ మజ్ఞానదృశ్య మని కొట్టివేయుటెట్లును సమంజసము కాదని భావింపఁగోరుదురు. ఆ పరంజ్యోతిలో నన్యోన్యవైరుద్ధ్య వైషమ్యములతోఁగూడిన యీ దృశ్యములన్నియు నెట్లొనసమన్వయ సిద్ధిగాంచునని చెప్పినను వారికది తృప్తికాఁగఁ జాలదు. అట్టి వారిదృష్టిలో సర్వవస్తువ్యక్తిత్వములఁదీర్చు పరంజ్యోతిత్వస్థిత్వము సంశయాస్పదము; ఎదుటనున్న యథార్థజగత్తు నెట్టి యోగిదృష్టితో నిరసించినను శంకరుని భావమును వారంగీకరింపరు. మానవుల క్లేశములన్నియు నుపశమించుననియు, జగమంతయు నిర్దాక్షిణ్యముగా మరుమరీచిక వలె నదృశ్యమై పోవుననియు, మనదుఃఖములకు మనమే కారకులమనియు, జగత్ప్రళయవేళ, మనకుఁగల దుఃఖదోషాద్యనర్థజాల మంతయునశించి, సంపూర్ణసంతుష్టి నీయఁగల బ్రహ్మైక్యము మనకుఁ జేకూరు ననియుఁ జెప్పు నీ భావము అనేకుల కూహామాత్రము అని తోఁచును. అంతర్ముఖత్వమును, సమాధి మగ్నతను జేపట్టి, వానినే స్వతః ప్రమాణములని పలుకుచు, వ్యావహారికజీవితము నెడ నిష్కరుణాత్మకమైన యౌదాసీన్యమును వహించుట సామాన్య బుద్ధికి గ్రాహ్యవిషయము కాఁజాలదు. ఈ సంగతి నెఱిఁగియుండియే శంకరుఁడు మనకు హేతుబద్ధమగు ఆస్తికత నొసఁగినాఁడు. అది మన బుద్ధిశక్తిని నిరసింపదు, అనుశ్రుతముగావచ్చిన పూర్వవిజ్ఞానమును

దూషించదు; మఱియు సత్యమునుగూర్చి నయుత్తమ ప్రజ్ఞా ప్రకటనము నిచ్చును.[1] ఆత్మదృష్టి లభ్యమగు బ్రహ్మైకత్వమునకు తర్కప్రజ్ఞా సిద్ధమగు వ్యావహారికాస్తిక్యమునకు నెట్టి సంబంధమున్నదో శంకరుఁడు మనకుఁ జెప్పలేదు. ఏలన, గథే వివేకయుక్తముగాఁ జెప్పినట్లు, "మానవుఁడు జగద్రహస్య సమస్యను బరిష్కరించుటకుఁ బుట్టలేదు, ఈ సమస్య యెచట నారంభించునో గ్రహించి, జ్ఞానవిష యావధుల నతిక్రమింపకుండ నుండవేర్పుటకే యాతని కధికారమున్నది." మనము చేరరానిసీమ యొకటున్నదని శంకరుఁడు గుర్తించినాఁడు. దానినిఁ గూర్చి వివేకసహితమగు సజ్జత్వమే యుక్తమైనపద్ధతి, అత్యద్భుతము లగు భావనైదగ్ధ్యనైశిత్యములతో నాతఁడుజరిపిన సత్యాన్వేషణము, క్లిష్టములగు జీవిత సమస్యల సాధింప నాతఁడుపయోగించిన మహోన్నత శాస్త్రీకదృష్టియు, నట్టిదృష్టివలన నెట్టి యాస్తికసిద్ధాంతము బాద యించునో యను శంకలేని మనో విశృంఖలత్వము, మానవత్వములో నిజముగాఁ బరబ్రహ్మత్వ మిమిడియున్నదను దివ్యదృష్టి, వీనిపై శంకరునికృషియొక్క ఘనత నిలిచియున్నది.

మహాతార్కికుఁడై, పోటిలేనితత్త్వవేత్తయై, విశాల సహన భావము గలిగి ప్రశాంత చిత్తుఁడై నిశ్చయించు లక్షణ పరిపూర్ణుఁడై సత్యమును ప్రేమింపుఁడని హేతువును గౌరవింపుఁడని, జీవితపరమార్థమును గ్రహింపుఁడని శంకరుఁడు మన కుపదేశించినాఁడు పదిరెండు శతాబ్దములు గతించినవి కాని, యీతని ప్రభావము నేటికిని సజీవమై యున్నది. ఆతఁడనేక హేతువిరుద్ధ వాదములను నిర్మూల మొనర్చెను వాని నాతఁడు ఖండింపలేదు. వానికంటె నెక్కువ యుక్తియుక్తమై

---

1 పోల్చు: ప్లేటో—"దేవతలను గూర్చియు, జగదుత్పత్తినిగూర్చియు మనకు గల భావములకుఁ బరస్పర వైరుధ్యములను తొలఁగించి, నిర్దుష్ట నిశ్చితార్థములఁ గూర్పలేకుండుట వలన నెవరుఁ దాశ్చర్యము నొందనవసరములేదు యుక్తమని తోఁచిన యొక భావమునకు దీనికొక విధమున మనము మన నిర్ణయమును నిర్మించినచో సంతోషింతుము। ఏలనఁ జెప్పు నేనును, వేఁగెవ్వనది, పరీక్షించువారును మనుష్యమాత్రుల మను సంగతి మఱవరాదు అందుచే మనము రచించు గాథయుక్తియుక్తమైన దంతియు చాలు; అధికము గోరుట వ్యర్థము," (టిమేయస్, పు 27 ఆ)

వానికంటె శ్రేష్ఠతరాత్మజ్ఞానము నిచ్చు విషయముల నాతఁడు సౌమ్యుఁడై చూపెను ఉపనిషత్తులందున్నను ప్రజానీకము మఱచిపోయిన విపుల భావజాలము నాతఁడు లోకములో వ్యాప్తికిఁ దెచ్చుటచే గతించినజ్ఞానము నాతఁడు పునరుజ్జీవింపఁ జేసెను అతఁ డూహాకల్పనములపై నాధార పడు తత్త్వజ్ఞుఁడు కాఁడు; ఆచరణకు సాధ్యమగు దివ్యదృష్టిగలిగిన తత్త్వ వేత్త, మఱియు నాతఁ డుజ్జ్వల క్రియాకారుఁడు, సముత్తుంగాదార్య సమన్వితుఁ డగు సామాజిక తత్త్వజ్ఞుఁడని యాతనినిబేర్కొనవగుచు. జీవితమునుగూర్చిన యాతని దృష్టితో వేళీభవింపని వారైన నాతని సమరజీవులలో లెక్కించుటకు వెనుకాడరు.

## ఉదాహృత గ్రంథములు


1. కార్పెంటర్:- దియిజమ్ ఇన్‌మెడీవల్ ఇండియా. లెక్చర్ 6.
2. దాస్‌గుప్త:- భారతీయతత్త్వచరిత్ర, 10-అధ్యాయము.
3. డ్యూసేన్:- ది సిస్టమ్ ఆఫ్ ది వేదాంత
4. ద్వివేది:- గౌడపాదకారికా సహిత మాండూక్యోపనిషత్తు.
5. మహాదేవశాస్త్రి:- శంకరభాష్య సహిత భగవద్గీతా.
6. మ్యాక్సుముల్లర్:- సిక్సు సిస్టమ్స్ ఆఫ్ ఇండియన్ ఫిలాసఫీ. అ. 6.
7. పి. నరసింహము:- ది వేదాంతిక్ అబ్సల్యూట్ అండ్ ది వేదాంతిక్ గుడ్ మైండ్. యస్. యస్. 82, 83.
8. థిబో:- శంకరభాష్య సహిత వేదాంతసూత్రములు. (యస్. బి. ఇ.)
9. విద్యారణ్య పంచదశి:- శ్రీనివాసరావు, కృష్ణస్వామిఅయ్యరు ముద్రణము.

# భారతీయ తత్త్వశాస్త్రము

## నవమాధ్యాయము

### రామానుజుని ఆస్తికతత్త్వము

#### 1 - ఆరంభ వాక్యము

తత్త్వశాస్త్రమునకు మూలములు మానవుని జీవితానుభవములయందే గలవు. మానవుని జన్మసహజములగు మూల కాంక్షలను సమర్థింపక, మతములోని నిగూఢతత్త్వమును వ్యక్తీకరింపని యే తత్త్వమును జనాంగీకారము బడయజాలదు. మన దుర్దశాదుఃఖములందు నుపశాంతి యొసంగజాలని, తత్త్వశాస్త్రజ్ఞుల భావకల్పనములు కేవలశేముషీ వినోదకము లగునేకాని, నిశ్చయ విజ్ఞాన హేతువులు కాజాలవు. నిశ్చలము నిర్వికారము నగు శంకరుని నిర్గుణబ్రహ్మమెట్టి కర్తృత్వప్రభావములు లేనిదగుటచే, మనకుఁ బూజ్యభావము నుదయింపఁజేయదు. తన్నుగూర్చి చూపరులు చేయుప్రశంసను నెఱుఁగఁజాలని తాజ్‌మహల్ వలె, శంకరుని నిర్గుణబ్రహ్మము, తదారాధకుల భయరాగముల నుదాసీనత వహించును. మతలక్ష్యమే తత్త్వలక్ష్యమనియు, దేవు నెఱుఁగుటే సత్యము నెఱుఁగుట యని తలఁచువారికి శంకరునిభావమొక పాండిత్యబలముతోఁ గూడిన తప్పునకుఁ బూర్ణోదాహరణమువలె గోచరించును. అది సహజ మానవ ప్రకృతి విరుద్ధ మగుటయే కాక, పరిణత బుద్ధికిఁ గూడ నట్లే తోఁచును. ప్రపంచ మొక మిథ్యాదృశ్యము, పరమేశ్వరుఁడు స్వీయాతిశయ శాంతిచే నంధీభూతుఁడైన నిర్గుణబ్రహ్మము. దౌర్బల్యాజ్ఞాన దూషితులగుమానవులు తమ హృదయకుహరములనుండి మొఱపెట్టినప్పుడు మనకుఁదెలియనితావునుండి కృపాభయహస్తము చూపెట్టి రక్షించునను ప్రత్యక్షానుభవ విషయము విడిచిపెట్టఁబడినది. భక్తులు తమకష్టకాలములలో భగవానునితోఁబొందు సజీవసాన్నిధ్యమున

కుచితస్థానమును శంకరుఁ డొపఁగలేదు. ఆత్మోద్ధరణమనఁగా, సవిశ్లే
షమగు నిర్గుణ బ్రహ్మసాగరములో మునిఁగిపోవుటయని శంకరుఁడు పఠి
ఉంచుము. వ్యక్తిగతము లై పలక్ష్యముల నిర్గుణ నియమావళికి వ
మొనర్చుటచే, సత్యశివసౌందర్యములు వ్యక్తులతో సంబంధములే
రూపరహిత నియమములుగావని ద్వైవారాధకుఁడు వాదించును. వ్య
క్తిగా అనుభవముండు సమట స్వవిఘాతవచనము. సత్యము, పరిపూ
ర్ణత్వము, సౌందర్యముగాక యాదిపురుషుని హృదయములో సమ్మ
సిద్ధిని గాంచెనని సూచించును. భగవంతుఁడే పరమార్థమగుసత్యమ
పరమప్రయోజనమునై యున్నాఁడు. భగవంతుని హృదయమున
మూలమందుఁ బ్రధానముగానున్నది కేవలసత్య సంసిద్ధియులే
సౌందర్యానుభూతియుఁగాక, ప్రాణికోటికొఱకు నిత్యముప్రవరిం
చుండు పరిపూర్ణ ప్రేమామృతమైయున్నది. పరిచ్ఛిన్న జగత్ప్రవ
జన మేమనఁగా పందలి జీవకోటికి భగవంతుఁడు తనతోసాయుజ్యః
గాంచుట కవకాశముగాఁగల్పించియున్నాఁడు. దేవునిదృష్టిలో జీవులః
గేవల జీవత్వముచేతనే విలువ యున్నది, కేవలము జీవులార్జించిన ప్ర
ధర్మ పరిణతి చేతనేగాదు, జీవులను గల్పించి, వాని సదృశ్య మొసఁ
టకే దేవుఁడు వానిని సృజించి యుండలేదు.

రామానుజుఁ డీశ్వరప్రపంచ సంబంధముపైఁ దన దృష్టిని గేం
ద్రీకరించి, యీశ్వరాస్తిత్వము యథార్థమనియు, నాతఁడు స్వతంత్ర
డనియు, జీవాస్తిత్వమును సత్యమేకాని, వానియస్తిత్వము పరిష
ముగా నీశ్వరాధీనమై యున్నదనియు వాదించును. జగత్తు
మూలాధారమై యొకతత్త్వమున్నదనియు నది మిథ్యకాదనిఁ
నాతఁడువచించును. ముక్తజీవులు తమ ప్రత్యేక వ్యక్తిత్వము
నవిచ్ఛిన్నముగా నుండునని యాతఁడు వక్కాణించును. జడజగత్
జీవులును దమప్రత్యేకాస్తిత్వమును గలిగియున్నను, నందేదిఁ
బ్రహ్మస్వరూపముగాదు. ఏలన బ్రహ్మ మెట్టిలోపములులేని నిత్య
పూర్ణుఁడు, జగత్పదార్థము జడము, జీవు లవిద్యాదుఃఖదూషిత
కాని వీనికన్నిటి కేకత్వమున్నది, జడజగత్తును, జీవులును దే
శరీరము, దేవుని దేహముగానే వాని కునికిగల దేలన, దేవుఁడే ı

కాత్మయు, యజమానియునగును[1] బ్రహ్మమునకు వేఱుగా వాని కస్తిత్వములేదు జీవాత్మయు, జడజగత్తు నీశ్వర భిన్నములేకాని, యీశ్వరాధీనములై, యీశ్వరసేవార్థములుగాక వానికి వేఱె ప్రయోజన ములులేదు. కావున రామానుజుని సిద్ధాంత మద్వైతమేకాని, యొక విశేషముతోఁ గూడియున్నది. ఏకమైన పరమాత్మ యనేకత్వము నంగీకరించును, అది జీవ జగత్తులతోఁ గలిసియుండును. అందుచే నది విశిష్టాద్వైత మైనది.

ధర్మవిషయములోఁ గూడ మీమాంసకుల కర్మవాదమును, శంక రానుయాయుల ప్రజ్ఞావైపుణ్యమును గూర్చి ప్రతిఘటనలు బయలు దేఱినవి. మిక్కిలి ప్రాచీనమైన ఋగ్వేద కాలమునందును, దేవతలు కొన్నివేళలందుఁ బ్రార్థనములకును గొన్నివేళలఁ గర్మకును స్వాధీను లైరని మనము చూచి యుంటిమి. క్రతువిధానమెల్లప్పుడును, మొదట నరణ్యములలోఁ దరువాత నాలయములలో జరిగిన పరమేశ్వరుని ప్రతి కారాధన విధానముతోఁ బోరాడవలసివచ్చినది; వైదికక్రతు మతమందుఁ దా మారాధించు దేవతకంటె యజ్ఞాధ్వర్యము వహించు పురోహితునకే యెక్కుడు ప్రాముఖ్య మున్నది. మఱియు బౌద్ధము శిథిలతనొందిన యరాజక పరిస్థితులలో సుస్థిరసంఘ నిర్మాణము చేయఁబూనిన బ్రాహ్మణ శిల్పిశేఖరుఁడగు కుమారిలుఁడు యజ్ఞాధికారమును పై మూఁడువర్ణ ముల ద్విజులకే యొసఁగి, వర్ణనియమములకుఁ గట్టుదిట్టముగాఁ బునాది వేసెను, మిగిలిన ప్రజాసామాన్యమునకు భక్తిమార్గమే యాధార మైనది, ఈ కారణముచేతనే, మీమాంసా వాదమునకుఁ బ్రతీకారముగా ఆస్తికమతములైన వైష్ణవ, శైవ, శాక్తేయము లుద్భవించి పెంపొంది నవి. వీనిదృష్టిలో వర్ణజాతి పదవీభేదములకు ప్రాముఖ్యములేదు. ఆస్తికతత్త్వములో సాంఘికోద్ధరణాశయ మిమిడియున్నది. ఒకే

1) ఈ లోకములోని సర్వమును, జీవులుగాని, జడపదార్థములుగాని, పరమాత్ముని దేహరూపములే; అందుచేతనే పరమాత్మ నిరుపాధిక శరీరుఁడని చెప్పుదురు ఈ కారణముచేతనే బ్రహ్మవిషయముగాఁగల శాస్త్రము శారీరకశాస్త్రమని కొందఱు పల్కిరి.

తల్లిదండ్రులైన దేవునిబిడ్డల మగుటచే మనమందఱము సమానులమే అధికులు నల్పులు నందఱు బిడ్డలు తండ్రికి సమానాదర పాత్రులే.

శంకరుఁడు జ్ఞానమునఁగాఁ గేవలసిద్ధాంతజ్ఞానమని చెప్పి యుండ లేదు కాని, శంకరునిశిష్యులలో గొందఱు మతమునఁగా హృదయమునకు నిచ్చకు సంబంధించినది కాక, బుద్ధికిమాత్రమే సంబంధించినదని చెప్పు ధోరణిని ప్రదర్శించిరి.[1] శాశ్వతమైన పారమార్థికజీవితమునకు దోషక్రౌర్య దూషితమైన యాత్మకు వారు స్థానమీయలేదు, "అహం బ్రహ్మాస్మి" వాక్య పారాయణము వివేకవిహితమగు భక్తిస్థానము నాక్రమింపఁజాలదు. అందుచే వైష్ణవశాఖా చతుష్టయముతోఁగూడిన ఆస్తికమతము లన్నియు భక్తికి ప్రాముఖ్యము నిచ్చినవి.[2] ఏ భా. భేదము లున్నను నివన్నియు మాయా వాదమును నిరసించుటలోను సగుణుఁడగు నీశ్వరు నంగీకరించుటలోను, పరమాత్మలో సదృశ్యమై పోక, యీశ్వరునియందుజీవాత్మ తన యవిచ్ఛిన్నవ్యక్తిత్వమును పరిపూర్ణ మొనర్చుకొనునని నిశ్చయించుటలోను నేకాభిప్రాయమును గలిగి యున్నవి.

## 2 – ఆగమములు

క్రమముగా భారతవర్షములోని స్వదేశవాసు లార్యుల విజ్ఞాన ప్రభావ సంపర్కము కలిగినకొలఁదియు హిందూమతము మిక్కిలి వైశాల్యమును బొందినది, ఉన్నత సంస్కృతిగల ద్రవిడజాతియు వెనుకఁబడియున్న యాటవికజనవర్గములును వైదిక యజ్ఞమత విధానమును, దేవాలయార్చన విధానమును, బహిరంగోత్సవ పద్ధతులను బెంపొందుటకుఁ దోడ్పడినవి. క్రొత్తజాతులు వచ్చి చేరుచుండఁ గొలఁదియు, క్రొత్తశాఖ లేర్పడ నారంభించినవి. ప్రతిశాఖకు విశి

1) చోద్యు: శాబ్దార్థజ్ఞాన మాత్రాదమృతమితి (రత్నప్రభా శాంకరభాష్యము 2,45

2) రామానుజుని శ్రీసంప్రదాయము; మధ్వుని బ్రహ్మసంప్రదాయము; విష్ణుస్వామి రుద్రసంప్రదాయము, నింబార్కుని సనకాది సంప్రదాయము

మూర్తి తిలక, దీక్ష గురుమంత్ర శాస్త్రములు తెలిపినవి. అతిప్రాచీన దశయందే వైష్ణవశైవశాక్తేయములు వరుసగా, పాంచరాత్రసంహిత, శైవాగమము, తంత్రము అను ప్రత్యేక మత గ్రంథములతోఁ బెంపొందినవి.

ఆగమములు సామాన్యముగా నాలుగు భాగములుగా విభజింపఁ బడినవి. జ్ఞానభాగము, యోగభాగము, క్రియాభాగమనఁగా నాలయ నిర్మాణ విగ్రహప్రతిష్ఠావిధానము, చర్యాభాగమనఁగా నర్చనకాండ.[1] ప్రతిమారాధనమునందు విశ్వాసముగల మతములకు సంబంధించునవి యాగమము లనిరి, ఏలన నవి ఆలయ నిర్మాణ ప్రతిష్ఠాదులను గూర్చి మిక్కిలి విపులముగా నియమములను సూత్రములను వర్ణించినవి. శాక్తేయశైవము లించుమించుగా సమానధర్మములుగలవే కాని, శాక్తేయులు శివుని దేవియగు శక్తి నారాధించుటలోఁ గొన్ని యసంస్కృత పద్ధతుల ననుసరింతురు. దేవునికి భార్యయు బిడ్డలును గల రనునది సంస్కృతిలేని కాలపునాఁటి మానవ ధర్మానుకరణము. సాంఖ్యము చెప్పు పురుషప్రకృతి సిద్ధాంతము శక్త్యారాధనమునకుఁ దాత్త్విక సామర్థ్యమును గూర్చినది. శివుఁడు తెలియుటకు, సమీపించుటకు నతీతుఁడైనవాఁడు, నిష్క్రియుఁడు నగుటచే, నతనితోఁ గలిసి యుండియు నిత్యక్రియాశీలయగు శక్తివలన దైవానుగ్రహప్రాప్తి సాధ్యమగును.

తమిళ గ్రంథములగు నాలడియార్, శిలప్పదికారము, మణి మేఖలై, కురల్ మున్నగు వానివలన, క్రీస్తుశకారంభ శతాబ్దులలో దక్షిణ భారత వర్షమున జైన బౌద్ధమతముల ప్రభావము కొంతయుండెనని చూపట్టును. శిలప్పదికారము ననుసరించి, (క్రీ. వె. 1-వ శతాబ్దము) కావేరీ పట్టణమున విష్ణ్వాలయములు, జైన బౌద్ధ విహారములు నుండెను. క్రీ. పూ. 3 వ శతాబ్దిలో నశోకుఁడు తన మతప్రచారకుల నంపెను. ఇంచుమించుగా నా కాలముననే, మౌర్యచక్రవర్తియగు చంద్రగుప్తునితో భద్రబాహువు దక్షిణాపథమునకు జైనులను వలసనంపె

1) పద్మసంహితా 1 2,6,2,1,3; 3 1 6; 4,1,1;

నని చెప్పు సంప్రదాయచరిత్రమున్నది. తీవ్రభక్తివిశ్వాసము అంగీకరించి, కటాక్షించు పరమేశ్వరునిఁ గోరు ద్రవిడదృష్టికి జైనబౌద్ధ మతములు తృప్తినీయఁజాలవయ్యెను. ఏకేశ్వర మతములగు శైవ వైష్ణవములు ప్రబలినవి, వారి యాగమముల ననుసరించి తద్భక్తులు ప్రవర్తించిరి.

## 3-పురాణములు

పురాణములు తత్త్వశాఖల కాలమందలి మతకావ్యములు, కథలు గాథలురచించి తన్మూలమున, నవి దైవమానవలోక సంఘ తత్త్వమును సంప్రదాయము ననుసరించి ప్రకటించినవి. ఆ కాలమునందలి యవైదిక సిద్ధాంతములను వీలైనచో నిర్మూలించు నుద్దేశముతో నవి రచింపఁబడినవి. శాస్త్రీయ సిద్ధాంతములను, ప్రాకృతజన విశ్వాసములతో మేళవించి వర్ణించు నానాభావసమన్వితము లీ పురాణములు. పురాణకర్త వ్యాసుఁడని ప్రతీతి.[1] అవి వేదసంప్రదాయములనే యవిచ్ఛిన్నముగా వ్యక్తీకరించునట్లు ప్రకటించుకొన్నవి.[2] ఈ పురాణములు [3] తత్త్వసిద్ధాంతములను ప్రకటించుటగాని యొక సమన్వయపద్ధతి

---

1) కొన్ని పురాణములు విష్ణుకర్తృకములని చెప్పఁబడెను, చూ. పద్మపురాణము. 1,62,18

2) వాయుపురాణము 1,11,194,202

3) ముఖ్యపురాణము లష్టాదశ సంఖ్యగలవి విష్ణు, భాగవత, నారదీయ, గరుడ పద్మ, వరాహ పురాణములు, వైష్ణవములు శివ, లింగ, స్కాంద, అగ్ని లేక వాయు, మత్స్య, కూర్మ పురాణములు శైవములు ఇతరములగు, బ్రహ్మ లేక సౌర, బ్రహ్మాండ బ్రహ్మవైవర్త, మార్కండేయ, భవిష్య, వామన పురాణములు బ్రహ్మసంబంధములు. మఱియు నవి వరుసగా సాత్త్విక, తామస, రాజసములనియుఁ జెప్పఁబడెను చూ, మత్స్యపురాణము 52 ఇవి మహాపురాణము లనఁబడును మఱియు నుప పురాణములు గలవు. ప్రతిపురాణము సర్గ, ప్రతిసర్గ, వంశ, మన్వంతర, వంశానుచరితము లను పంచలక్షణములను గలిగియుండును. పురాణము లితిహాసముల కర్వాచీనములు. అతి ప్రాచీనములగు పురాణములు క్రీస్తు శకమునకుఁ బూర్వకాలమునకుఁ జెందునుగాని తరువాత కాలమునఁ గొన్నిమార్పులు చేయఁబడెను. "ఇవి క్రీ పూ 6 వ శతాబ్దారంభ కాల

అనుసరించ లేదు. ప్రాచీన విజ్ఞానవేత్తల యుపదేశముల నందు ముఖ్యముగా వేదాంతసాంఖ్యోపదేశములను విస్తరింపఁజేయుటే వానియాశయము. వానిని అనుసరించిరియే యని పురాతన సంప్రదాయములను గాపాడునని తెలియును ఇవన్నియు ఆస్తికములే; ఈశ్వర, జీవ, జడపదార్థ భేదముల నన్నియు నంగీకరించును. త్రిమూర్తిభావమున కొన్ని తత్త్వ మేర్పడెను, కాని ప్రతిపురాణమును విష్ణునకో, శివునకో పూర్ణాధిపత్యమిచ్చి వర్ణించును. విష్ణు ప్రాధాన్యముగా నున్న పురాణమున శివుఁడు బ్రహ్మయు విష్ణు నర్చించుట కాక విష్ణుభక్తుల నాదరింతురు.[1] భాగవతపురాణమున శివుఁడు ప్రాచేతసునితో నిట్లు పలికెను : "విష్ణుపదార్పితచిత్తుఁడై నవాఁడు నాకుఁ బ్రియుఁడు"[2] భగవానుఁ డీజగత్తున కేకైకాధారము, మూలము, గతియునై యున్నాఁడు.[3] ఏ పేరు పెట్టినను పరమేశ్వరునకు సకలకల్యాణ గుణములను పురాణము లారోపించును. "ఎవఁ డింద్రియాతీతుఁడో" సర్వ ద్రవ్యములలో నుత్తమ ద్రవ్యమో, ఎవఁడు పరమాత్మయు, స్వయంస్థితి గలవాఁడునై, రూపవర్ణాది లక్షణ విరహితుఁడై, జన్మజరామృత్యువులు కాని, వృద్ధిక్షీణతలు గాని లేక నిర్వికారుఁడై యుండునో, ఎవఁడద్వితీయుఁడు నిత్యుఁడునై, విభువై, విశ్వగర్భుఁడై ప్రకాశించునో యట్టి వాసుదేవుఁడనఁబడిన వాని నెవరు వర్ణింపఁగలరు!"[4] ప్రకృతి, తత్పరిణామమునుగూర్చి సాంఖ్యము

---

మునకైనఁ జెందియుండును అనన్తంబని కాలమింకను పూర్వతరమైనదని దఁజాపై నదో ఏ పురాణకాలము వింకొక, 150 లేక 200 యేండ్లు వెనుకకు జరుగవచ్చును " (పర్జిటర్ : ప్రాచీన భారతవర్ష చరిత్ర సంప్రదాయము పు. 91 ) ఇతరముల గాక, ఛాందో ఉ 3 4 1: శతపథ బ్రాహ్మణము 11 5,6,8: అర్థశాస్త్రము, 1,5—పురాణ మూలము స్మరించినవి

1) చూడు : విష్ణుపురాణము 1,2,2 కర్తయా యన్యదైకన్య బ్రహ్మ విష్ణు శివాత్మకః (1-9) చూ భాగవతము 1,2,23

2) భగవంతం వాసుదేవం ప్రపన్నః ప్రియోహి మే (4 24,28)
(చూ 4,24,30)

3) విష్ణుపురాణము 1,2.4

4) విష్ణుపురాణము 1,2,10
2,1,3,3 పద్మపురాణము 6,263,70

చెప్పఁబడె యంగీకరింపఁబడెను గాని, ప్రకృతి పరిణామ మీశ్వరాధీనమై నడచునని నిశ్చయింపఁబడెను. ప్రకృతియే యీశ్వరుని దేహిగా వర్ణింపఁబడెను. విష్ణుపురాణతృతీయాధ్యాయారంభమున మైత్రేయుఁడు పరాశరు నిట్లడుగఁగా, "శుద్ధబ్రహ్మమునకు సర్గాది కర్తృత్వమెట్లు చెప్పవీలగును?" అగ్నియం దుష్ణమువలె సర్వసృష్టియు నాతనియందే యున్నదని బదులు చెప్పఁబడెను. జగద్వ్యక్తవికత్వమును పురాణములంగీకరించును, జగన్నిరచనము నిమిత్తమే మాయా శబ్దము నుపయోగించును

మతవిషయములోఁ బ్రార్థనా యజ్ఞములతోఁ గూడిన వైదికారాధనము, భక్తి ప్రతిమారాధనములుగా మారిన సంగతి విస్పష్టము. పౌరాణికధర్మము సంప్రదాయ వ్యతిరేకము గాదు. కర్మ పునర్జన్మ సిద్ధాంతమును, ధర్మజ్ఞాన నిష్టవలన మోక్షావకాశము నంగీకరింపఁబడెను. ఏ యొక తత్త్వమునకో తలయూపుట కాక, యీశ్వరునియందు దృఢంపు భక్తియే కలియుగమం దుత్తమ మోక్షసాధనమని చెప్పఁబడెను.[1] సర్వతమునకై పఁ గడలించునదే భక్తి; భక్తికసాధ్యము లేదు.[1] ధ్రువుని, నత్పురుషుఁడై, పవిత్రుఁడై, సర్వజీవకోటికి శుభమును జేకూర్చుటకుంతచూపుమని యాతనితల్లి యుపదేశించెను[3] "ఎవఁడు తన వర్ణధర్మమును విడువక, మిత్రామిత్రభేదదృష్టి లేనివాఁడై, పరులధనము కాశింపక, యే ప్రాణి కెన్నఁడపకృతిచేయక, పరిశుద్ధచిత్తుఁడై యుండునో యాతఁడే విష్ణుభక్తుఁడని తెలిసికొనుము"[4] సంపదయే గౌరవకారణమై, ధనమే సచ్ఛీలమై, మోహమే స్త్రీపురుషైక సంబంధమాత్రమై, అసత్యమే జీవిత విజయహేతువై కాంతాసంగమమే యొకై

1) భాగవతము, 12, 3, 52 భాగవతము భక్తిబోధనకేవలమును వివరించును

శ్లో॥ శ్రవణం కీర్తనం విష్ణోస్స్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్ (7-5-23)

2) 1, 12, 3) విష్ణుపురాణము, 1,1,1

3) విష్ణుపురాణము 3 7

సుఖసాధనమై, బాహ్యోపాధివర్గమే, అంతరాత్మ యని యే సంఘమున వ్యాప్తిగాంచునో ఆ సంఘము శిథిలతగాంచును [1] అట్టి సంఘము నుద్ధరించుట కొరకక్షకుఁ డవసరము ఈశ్వర సాదృశ్యమే మోక్షము [2] రామానుజ మతము విశేషముగా విష్ణుభాగవత పురాణములకు ఋణపడి యున్నది.

## 4 – రామానుజ జీవితము

క్రీ. శ. 1027-వ సంవత్సరమున శ్రీపెరుంబుదూరులో రామానుజుఁడు జన్మించెను. చిన్నవాఁడే యాతని తండ్రి స్వర్గస్థుఁడయ్యెను. కులస్థులైన బాలుర కానాఁడు లభించు విద్యాశిక్షణ మైనవెనుక, కాంచీపురములోని యాదవప్రకాశువొద్ద రామానుజుఁడు వేదాంతమభ్యసించెను. కాని, గురువుగారి యర్థనిర్ణయము అన్నివిషయములలో వానికఁ డంగీకరించలేదు. సుప్రసిద్ధ శ్రీరంగమఠాధిపతియగు ఆళవందారు రామానుజునిపాండిత్యమున కచ్చెరువంది, శ్రీరంగమఠాధిపత్య మాతని కీయ నిశ్చయించెను. ఆలవందారు కవసానదశ వచ్చినప్పు డాతని శిష్యులు రామానుజునిఁ దోడ్కొనిరమ్మని పెరియనంబి నంపిరి. రామానుజుఁడు వచ్చులోపుననే గురువు మరణించెను. రామానుజుఁ డాలవందారు మృతదేహమును సమీపించఁగా నాతని కుడిచేతి మూఁడు వ్రేళ్ళు ముడుచుకొని యుండెను. మూఁడుకోరికలుమిగిలి పోయిన వనియు నందు ముఖ్యమైనది బ్రహ్మసూత్రముల కొక సులభమైన భాష్యరచన మనియు శిష్యులు దాని కర్థము చెప్పిరి. రామానుజుఁడు కాంచీపురమునకుఁ దిరిగి వచ్చి, తన దైనప్రార్థనములను యథారీతిగాఁ జేయుచుండెను. ఒకనాఁ

1. అర్థఏవాభిజనహేతుః, ధనమేవాశేషధర్మహేతుః, అభిరుచిరేవ దాంపత్య సంబంధహేతుః, అనృత మేవవ్యవహార జయహేతుః స్త్రీత్వమేవ ఉపభోగహేతుః బ్రహ్మసూత్రమేవ విప్రత్వహేతుః, లింగధారణమేవ ఆశ్రమ హేతుః

విష్ణుపురాణము 4,24,21-22

2) ఆ సమయములలో శక్తి యుగ్గడింపఁబడెను కామ సంతృప్తిగాంచక విశేష స్వేచ్ఛ నొసఁగఁబడెను మంత్ర, యంత్ర, యోగ సాధనల కధికస్థాన మీయఁబడెను

దుష్కృత విచారములో నాతఁడు తన భావికర్తవ్యమును గూర్చి దైవ సంకల్ప మెట్లున్నదో కనుఁగొనుమని తదాలయార్చకు నడిగెను. దైవ సంకల్ప మొకశ్లోకరూపకముగా నిట్లు చెప్పఁబడెను. 'నేనే పరతత్త్వము, భేదమేనామతము; ప్రపత్తియే నిరపాయ హేతువు, స్వప్రయత్న మనవసరము లేనందున అంత్యకాలమున, మోక్షము సిద్ధించును. పెరియనంబియే ఉత్తమ దేశికుఁడు"[1] దైవమిట్లు పలికెను; లేక రామానుజుఁడు దైవవాణి నిట్లువిని, దాని ననుసరింప నిశ్చయించెను మధురాంతకమందున్న పెరియనంబి నాతఁడు కలిసికొని వానివలన వేదాంతరహస్యోపదేశము నొందెను. మహాపురుషుల కన కులవతియగు సతీమణి లభించు టరుదు, తన లక్ష్యములకై కృషిచేసి యాతని కత్తుల పతికయుండఁజేయునట్టిది రామానుజునిభార్య కాకపోయెను. దాంపత్యమందు అననుకూలత దాచుటకు శక్యముకానిది; రామానుజుఁడు తన దురదృష్టమును గ్రహించినాఁడు బుద్ధశంకరులవలెన ప్లేటోపౌలుల వలెను, ఈశ్వర సామీప్యమును లేక మానవ పరిపూర్ణత శిఖరముల నందుకొనుటకు సర్వసంగపరిత్యాగమే సాధనమని నిశ్చయించెను. సన్న్యసించిన యాతనిని జనులందఱు మెచ్చి, యతిరాజ నుతించిరి. రామానుజుఁడు శ్రీరంగమున స్థిర నివాసియై తిరువాయ్మొళి నిగూఢార్థముల వ్యాఖ్యానించెను. బోధాయనవృత్తిని కంఠముగా నెఱిఁగిన శిష్యుఁడగు కూరత్తాళ్వారు సాయమున రామానుజుఁ వేదాంతసారమును, వేదార్థసంగ్రహమును, వేదాంతదీపమును, బ్రహ్మసూత్ర గీతాభాష్యములను రచించెను. వైష్ణవపండితు లెల్లరు రామానుజుని బ్రహ్మసూత్రార్థవివరణము నంగీకరించిరి. అదియే వైష్ణవుల శ్రీభాష్య మయ్యెను. దక్షిణాపథమెల్లెడ సంచారముచేసి, రామానుజుడనేక శిథిల దేవాలయములను పునర్నిర్మాణముచేసి, అసంఖ్యాకుల వైష్ణవులుగా మార్చెను. మహాజ్ఞాన సంపన్నుఁడు తన యుగమున

---

1) శ్రీమాన్పరం తత్త్వమహం, మతం మే భేదః, ప్రపత్తిర్నిరపాయహేతుః నావశ్యకీ చస్మృతిః అంత్యకాలే మోక్షో మహాపూర్ణ ఇహార్యవర్యః

శివాంతమందు సర్వమానవులు మోక్షమునొందుదు రనునది పాంచరాత్ర తేంద్ర లక్షణము [illegible] వేదాంత దేశికుని పాంచరాత్రరక్ష

ప్రవక్తయై తనకు లభించిన సంప్రదాయ సిద్ధమగు ప్రాచీన విజ్ఞానమును తన జీవితములోఁ బునరనుభూతికిఁ దెచ్చును రామానుజునికి సహవాసము నొసఁగిన భక్తులు జ్ఞానులు నిత్య జ్ఞాన వైరాగ్యములతోఁ దమ జీవితములఁ గడపిరి. ఆళ్వారుల గీతములు వారి హృదయములలోఁ బరమేశ్వరుఁడు నిండారి, పొంగిపొరలించిన మహత్తరావేశ భక్తిపూరితములు. ఏలన వారికి భగవానుఁ డనఁగా జగత్కర్తయే కాదు, సన్నిహిత మిత్రుఁడు, మార్గదర్శియు నైనవాఁడు. జన్మసహజమైన భక్తిభావము రామానుజునికిఁ బరమేశ్వరు నొక వ్యక్తిగాఁ బ్రదర్శించినది. శంకర రామానుజు లిరువురు వేదాంత మహాప్రవక్తలే. వారి చిత్తములలో సమానసమన్వయ ముదయించినవి. వారి కాధారములగు మూలగ్రంథములును సమానములే, వారి వివరణ పద్ధతు లించుమించుగా సమాన ప్రతిపాదనల పైననే సాఁగినవి, కాని ఫలితములు మాత్రము విస్పష్ట భిన్నత్వమును సూచించినవి. వారు చేసిన నిర్ణయములు, పరమార్థ సంగ్రహణములో వారి భిన్నములగు చూపులను ప్రదర్శించినవి. రామానుజుఁడు సహజ మతానుభూతిని గట్టిగా నమ్మి సృష్టిరచన వలనను నవతార ప్రవక్తలవలనను, సాక్షాత్కారముల వలనను, మానవునకు గోచరించు పరమేశ్వరునివ్యక్తీకరించు నిగూఢమగు సమష్టావభక్తిమార్గము నాతఁడు ప్రకటించినాఁడు. బ్రహ్మసూత్రములయందు నుపనిషత్తులయందు నవ్యక్త నిగూఢత్వము నందియున్న భావముల నాతఁ డాళ్వారులయొక్కయు నాచార్యులయొక్కయు సాంగత్యముచే బహిర్గతము లొనరింపఁ గలిగెను. అతఁ డెన్నఁడును దానొక స్వతంత్రమగు తత్త్వము నుపదేశించుచున్నట్లు భావింప లేదు. సార్వకాలికమైన బ్రహ్మజ్ఞానమునే యాతఁడు ప్రకటించుచున్నట్లు విశ్వసించెను.

## 5—చరిత్ర - సారస్వతము

ఇతిహాసారంభ యుగమునుండి యించుమించుగా వైష్ణవోద్యమ మవిచ్ఛిన్నముగాఁ బ్రబలిన చరిత్రమున్నది. ఋగ్వేదమునందు

విష్ణువు పరమపదనివాసియైన ఆదిత్య దేవతగా భావింపఁబడెను.[1] వరుణ దేవతా భావము బలవత్తరమగు నీశేశ్వరవాద లక్షణ లక్షితమైయున్నది. వేదములందు మనకు శుభాశీర్వచన ప్రదాతయగు భగదేవతా భావమున్నది. ఈ భగశబ్దమునకు శ్రేయశ్శక్తి యను భావము పెంపొంది, క్రమముగా షడ్గుణ శక్తిగలవాఁడే భగవానుఁ డని తలపఁబడెను భగవదారాధనతోఁ గూడిన మతమే భాగవతమతము. భాగవత మతమును గూర్చి మహాభారతము స్మరించినది. భాగవత మతమే వైష్ణవమతమై భగవానుని విష్ణువుగా గ్రహించెను. మహాభారతములోఁ జెప్పఁబడిన పంచరాత్రమతమున వైష్ణవమతలక్షణము లన్నియు నున్నవి. ఇతి హాసములలోఁ విష్ణువునకుఁ బ్రత్యర్థిగా శివుఁడు పేర్కొనఁబడెను. కాని విష్ణు పురాణమునందు విష్ణువు దేవదేవత్వ మప్రతిమానము. భాగవత పురాణము (క్రీ. శ. 900) కృష్ణుని ప్రధానముగా వర్ణించిన భాగవత మతమునే ప్రకటించినది. ఇందలి భక్తి మహదావేశ పూరితము, జీవే శ్వర సంబంధము నాయకీనాయక సంబంధముగాఁ బ్రదర్శింపఁబడెను. దక్షిణాపథమునకు భాగవతమతము క్రీ. ప్రథమ శకారంభమునకుఁ బూర్వ మెపుడో వచ్చి యుండెనని నానాఘాట్ శాసనమువలన స్పష్ట మగుచున్నది, కలియుగమందు నారాయణారాధకులసంఖ్య దక్షిణ దేశములో నధికముగా నుండునని భాగవతము చెప్పుచున్నది.[2] ప్రామాణ్యసిద్ధిని గాంచిన ద్వాదశాళ్వారుల గీతములు నాలాయిర ప్రబంధ మను[3] సామాన్య నామముతోఁ బిలువఁబడెను. ఈ యాళ్వారులలో

1) విష్ణోః పరమం పదం

2) 11,5-38-40.

3) ఈ గ్రంథము 4,000 పద్యములుగలది నాలుగు భాగములుగా విభజింపఁ బడెను మొదటిది ముదలాయిరము; ఇందు పెరియాళ్వారు, ఆండాళ్ మున్నగు వారి వాక్యము లున్నవి రెండవది తిరుమంగయాళ్వారునిదైన పెరియతిరు మొళి మూఁడవది సుప్రసిద్ధమైన నమ్మాళ్వారుని తిరువాయ్‌మొళి నాల్గవదగు "ఇయర్పా" మొదటి భాగమునందే యనేకాళ్వారుల వాక్య సంకలనము నమ్మాళ్వారుని తిరువాయిమొళి, తమిళ వేదస్వరూపమని చెప్పుదురు శ్లో॥ "వేదం తమిళయన్ద్రేయా మారన్ః మతియః—

నొకప్రియు, పెక్కురు శూద్రులు, నొక భూపాలుఁడును గలరు. వీరి యనంతరము సగుణారాధనము వలన నీశ్వరానుగ్రహము లభించుననను విశ్వాసమునకుఁ దాత్త్వికాధారమును నిర్మించు నాచార్యులు బయలు దేరిరి. రామానుజ పూర్వాచార్యపరంపరలో ముఖ్యులు నాథముని, ఆల వందారు - యామునాచార్యుఁడు, పన్నిద్దరాళ్వారులలోఁ జరమాళ్వారు శిష్యుఁడైన నాథముని (క్రీ. శ. 10-వ శతాబ్దము) ఆళ్వారుల యుపదేశ వాక్యముల నొక పద్ధతిలోనికిఁ దెచ్చెను. న్యాయతత్త్వమును యోగ రహస్యము నితఁడే వ్రాసె నందురు. వేదార్థమునే వైష్ణవాగమముల ప్రతిపాదించు నని సమర్థింప యామునాచార్యుఁడు మిక్కిలి శ్రమపడెను. ఆతని ముఖ్యరచనములివి: ఆగమ ప్రామాణ్యము, మహాపురుష నిర్ణ యము, సిద్ధిత్రయము గీతార్థ సంగ్రహము, చతుశ్శ్లోకి, స్తోత్రరత్నము వైష్ణవుల మతసారస్వతము నుభయ వేదాంతనామమునఁ బిలుతురు. ఏలన నందు సంస్కృత ప్రస్థానత్రయము, తమిళ ప్రబంధముకూడ నున్నవి. ఆళ్వారులగీతములు, శ్రుతి స్మృతివాక్యసారమునే ప్రకటించు నని చిరసంప్రదాయ విశ్వాస మున్నది. శంకరుని నిరంకుశమైన అద్వైతవాదమువలన, రామానుజుఁడు తిరిగి, వేదోక్తమైన యేకేశ్వర మతమును బునఃప్రకటనము చేయవలసి వచ్చినది. బోధాయనవృత్తి యందలి భావములనే తాను విస్తరింపఁజేసితిననియు, టంక, ద్రమిడ, గుహదేవ, కపర్ది, భారుచులు తనతో సమానభావములు గలవారే యనియుఁ జెప్పినాఁడు. రామానుజుఁ డుగ్గడించిన యేకేశ్వరవాదము యొక్క పురాతనత్వమును శంకరుఁ డంగీకరించును. అందుచే రామా నుజమతమునకుఁ బూర్వ మూలములుగా నేకేశ్వరప్రతిపాద కోపనిష

---

ఘోరే కలియుగేప్రాప్తే నాస్తికైః కలుషీకృతే,
భోగినాంశ సంభూతో వేదవేదార్థ తత్త్వవిత్
స్తోత్రం వేదమయం కర్తుం ద్రావిడ్యాపిచ భాషయా
జనిష్యతి వరాంశ్రేష్ఠో లోకానాం పాతకామ్యయా " (భవిష్య పురాణం)

తిరువాయిమొళిగూర్చి నాథముని యిట్లు చెప్పెను: "సహస్రశాఖోపనిషత్సమాగమం, ద్రావిడ వేదసాగరం ,, తిరువాయిమొళియొక్క ప్రధానవిషయము అర్థపంచక ప్రవచనము (1) పరమాత్మ (2) జీవాత్మ (3) రెంటిసంబంధము (4) అవిద్యానాశనము (5) ఇష్టసిద్ధి

క్తులు, నారాయణీయ ప్రకరణముతోఁ గూడిన మహాభారత భాగము భగవద్గీత, విష్ణుపురాణము, వైష్ణవాగమములు, ఆళ్వారులయు ఆ ర్యులయురచనములు నని చెప్పవచ్చును. ఉపనిషద్గీతా బ్రహ్మసూత్ర ముతో వైష్ణవభక్తుల భావములకు సమన్వయమునుగూర్చినవే రా మానుని ముఖ్య రచనలు. ఆతని స్వతంత్ర ప్రతిభ కెంత స్థానమున్న నిర్ణయించి చెప్పుట సులభముకాదుకాని, యతనిచే రచింపఁబ శ్రీభాష్యము, "బ్రహ్మసూత్రములలో నీశ్వర తత్త్వమున కాధార లను గమఁగొను యత్నము లన్నిటిలో నాతనియత్నమే విశేష సంపూర్ణత్వములచే నిరుపమానమై ప్రకాశించుచున్నది."[1] రామానుజ భక్తి, తత్పూర్వుల కంటెను, తదనంతరకాలికులకంటెను నధికము దా త్త్వికము నియమనిబద్ధమునై నది, వేదవిధి కర్మ విధానముల సించ నాతఁ డుద్యమించలేదు, పౌరాణికగాథల కధికప్రాముఖ్యము నా డియ్యలేదు భక్తి వలన మోక్షము లభించునని ప్రకటించి, యది ప్రస్థానత్రయ ప్రధాన సందేశమని నిరూపించుటకే యాతఁడు యత్ని చెను. రామానుజ భాష్యమునకు సుదర్శనభట్టు విరచిత శ్రుతప్రకాశిక గణ్యమైన టీకయై యున్నది.

ఇంచుమించుగా 13-వ శతాబ్దమునసే దక్షిణోత్తరములగు తెం వడగలె శాఖలకు భేదములు ప్రబలెను. తెంగలె శాఖ తమిళ ప్రబంధ మతగ్రంథమని నమ్మి, సంస్కృతగ్రంథములయెడ నౌదాసీన్య చూపెను. వడగలెశాఖకు రెండును సమాన ప్రమాణములే. తెంగల దోషభోగ్య మను ప్రమాదకర సిద్ధాంతము నంగీకరించిరి. అనఁ భగవానుఁడు పాపము ననుభవించును, ఏలన దానివలన నాతని య గ్రహముచూపుట కెక్కు డవకాశమున్నది.[2] వడగలు తమిళముక

1) ఈ, ఆర్, ఇ, వాల్యూము 10, పు 542.

2) డా ఓస్కార్ వైద్య డిగ్రొవందివ్: "క్రీస్తు శకరారి యే దైవలక్ష ణలనవో, మానవునిలోఁ బరిపూర్ణం తత్వంతసన్నిహిత సంబంధప్రాప్తికిఁ దావని ప్రే మకే మార్గమని యట్లుచెప్పెను దాని యర్థమింకను తెలియనివారికి వారఁడు పాపస ముఖమునా స్వయముగా సుందరములగు విషయము లనియు, నవి పవిత్రములైన పూర్ణ కాంక్షలనియు నాతఁడు చూపినాఁడు."

నధికముగా సంస్కృతము నుపయోగించి, లక్ష్మీభావమునకు శాస్త్రీయ మతాంశములను గొన్నిటిని స్వీకరించిరి.[1]

పిళ్ళై లోకాచార్యుఁడు తెంగలశాఖకు ముఖ్యప్రతినిధి. ఈశ్వరానుగ్రహ మమోఘమైనదనియు దానినిఁ గేవల భక్తిచేతనేగాక, ప్రపత్తిచేఁ గూడ సాధింపవలెననియు నాతఁడు బోధించెను, గురువునకు సంపూర్ణాత్మసమర్పణమే చేయవలెనని యీ శాఖవారి మతము. ఇది రామానుజుఁడు చెప్పిన వివేకసహిత గురుశుశ్రూషాపద్ధతిగాదు. రహస్యము లనఁబడు నష్టాదశ గ్రంథములను లోకాచార్యుఁడు రచించెను. అర్థపంచక తత్త్వత్రయములందు ముఖ్యములు తెంగలశాఖలో మనవాళమహాముని ప్రధానభక్తుఁడు.

రామానుజానుయాయులలో నగ్రగణ్యుఁడగు వేదాంతదేశికుఁడు లేక వేంకటనాథుఁడు (14-వ శతాబ్దము) వడగలై శాఖాస్థాపకుఁడు. కాంచీపురము జన్మస్థానమయ్యు నధికజీవితకాలము నాతఁడు శ్రీరంగమునఁ గడపెను. అతఁ డనేక విషయములను గూర్చి విపులరచనలను జేసెను గాని యాతని ముఖ్యగ్రంథము లాతనిచే తమిళభాషలో రచింపఁబడిన పరమతభంగ రహస్యత్రయసారములై యున్నవి. అతని పంచరాత్ర రక్ష, సచ్చరిత్రరక్ష పంచరాత్ర శాఖానియమాచారములను వివరించును. శ్రీభాష్యమునకు తత్త్వటీకను, గీతాభాష్యమునకు తాత్పర్యచంద్రికను నాతఁడు రచించెను. పూర్వోత్తర మీమాంస లొకేతత్త్వభాగము లనియు, దైవ యాజమాన్యమునఁగాక, కర్మ ఫలము నీయఁజాలదనియు నాతఁడువాదించి సేశ్వరమీమాంస యను గ్రంథమును రచించెను. అతఁ డింకను రచించిన న్యాయసిద్ధాంజనము, తత్త్వముక్తాకలాపము, తద్వ్యాఖ్యయగు సర్వార్థసిద్ధియు నుపయుక్తరచనములు. అతని ఖండన గ్రంథము శతదూషణి అద్వైతమును నిరసించినది;

---

1) విష్ణుపత్నియగు లక్ష్మియు విష్ణువువలెనే జన్మరహితయనియును, విష్ణువుతో సమముగాఁ గృపఁ జూపునదనియు నర్చింపవలెనని వారు నమ్ముదురు. ఆమెకు జన్మ మున్నదనియు, దైవకృప జూపు సాధనశక్తియనియు తెంగలశాఖవారు తలఁచిరి చూ అష్టా దశభేదములు గోవిందాచార్యస్వామి జె ఆర్ ఎ యస్ 19-10.

దానికి భాష్య మొకటి చండమారుత మనునది (17-వ శతాబ్దమ
పై దానితో సమానమైన ఖండన గ్రంథమే. శ్రీనివాసాచార్య కృ
యతీంద్ర మతదీపిక పదునేడవ శతాబ్దములోఁ బ్రధాన గ్రంథము. శై
మతావలంబి యయ్యు నప్పయ్యదీక్షితుఁడు పెక్కు వైష్ణవ గ్రం
ములకు వ్యాఖ్యలు వ్రాసెను.[1] రామానుజ మతమును సమర్థించుట
రంగరామానుజుఁ (18-వ శతాబ్దము) డుపనిషత్తులకు భాష్యము
వ్రాసెను. రామానుజుని ప్రభావ మనంతర హిందూమత చరిత్రమం
నేటికిని దృశ్యమాన మగుచున్నది. మధ్వ, వల్లభ, చైతన్య, రా
నంద, కబీరు, నానక్ నడపిన యుద్యమములందు వారును, సంస్కృ
మతమగు బ్రహ్మసమాజమును, రామానుజ ప్రోక్తమగు నేకేశ్వరత_
మున కెంతయు ఋణపడియున్నారు.

## 6 – భాస్కరుఁడు

క్రీ. శ. 900 ప్రాంతమున, భాస్కరుఁడు భాస్కరభాష్య మ
నొక బ్రహ్మసూత్ర భాష్యమును రచించెను.[2] ఇది యొక మతశాఖ
కెందిన గ్రంథముకాదు. శంకరుని వాదమునుగాని, పంచరాత్ర వై
వాదమునుగాని యిది సమర్థించుటకుఁ బూనుకొనలేదు. భాస్కరుఁ
భేదాభేదవాదమును సమర్థించెను.[3] బ్రహ్మమనఁగా సర్వభేద విరహి
మగు శుద్ధ చైతన్యరాశికాదు. సర్వసంపూర్ణగుణసంపన్నమైన
బ్రహ్మముయొక్క కారణరూప మేకత్వమును, కార్యరూపము నానా
మునుగా భావింపఁ బడెను,[4] కారణ మూల రూపములలో వస్తు

1) ఒక కాంచీపుర పండితసభలో శివ విష్ణువులకు భేదములేదనియు పండి
వాడు శివు నర్చింపుచుండి పనియుఁ జెప్పెను "మాహేశ్వరే వా జగతా మధీశ్వ
జనార్దనే వా జగదంత రాత్మని, న వస్తుభేదప్రతిపత్తిరస్తు మే తథాపి భక్తిస్తరుణేందుశే

2) ఇతని భావముల నుదయనుఁడు తన కుసుమాంజలిలో ఖండించెను
(క్రీ॥ శ॥ 980)

3) దీనిపై విమర్శనమునకు చూ॥ రా॥ భా॥ 1,1,4

4) కార్యరూపేణ నానాత్వం, అభేదః కారణాత్మనా (భాస్కరుఁడు 1,1,4.)

భేదములు, కార్యపృథగ్రూపములలో భిన్నములు, నిప్పుగడ్డిని హరించి నట్లు భేదము భేదమును హరించునది కాదు. రెండును సమానముగా సత్యములే. పరిణామము నిజమేయని భాస్కరుఁడు నమ్మెను.[1] మాయావాదము ప్రామాణ్య విరహిత మనియు బౌద్ధసంపర్క సంభూత మనియు భాస్కరుని మతము, జడజగత్తు నిజముగా నున్నదనియు, నది బ్రహ్మలక్షణ యుక్తమేయనియు నాతనివాదము. జడపదార్థము బ్రహ్మముపై వర్తించినపుడు దేహేంద్రియ రూపమగు నుపాధిగామారి, జీవోత్పత్తికారణ మగును. ఈ పాధులు మాయా కల్పితములు గావనియు, యథార్థములేయనియు నాతనివిశ్వాసము. సహజముగ జీవాత్మ బ్రహ్మముతో నేకమే కాని యుపాధివశమున వేఱై యున్నది.[2] జీవబ్రహ్మ సంబంధమున కగ్ని విస్ఫులింగ సంబంధ ముపమానముగాఁ జెప్పఁ బడెను. బ్రహ్మమునకు నుపాధులకుఁగల సంబంధజ్ఞాన లోపముచే సంసార మేర్పడినది, తద్ధర్మములచే, వానిభేదము నెఱిఁగినచో మనము తరింతుము. జీవాత్మల పునర్జన్మము తన్మూలమునఁ గలుగు దుఃఖమును బ్రహ్మము నిజముగా ననుభవించు నని భాస్కరుఁడు తలఁచినాఁడు. కర్మ మోక్షసాధనమగు జ్ఞానాంగ మని యాతఁడు చెప్పెను. ఆతఁడు రామానుజుని వాదమునకు లేక జ్ఞానకర్మ సముచ్చయ వాదము నంగీకరించునని చెప్పవచ్చును

## 7 – యాదవప్రకాశుఁడు

కొంతకాలము రామానుజుని గురువైన యాదవప్రకాశుఁడు క్రీ. శ. 11-వ శతాబ్దములోఁ గాంచీపురమున జీవించి, అద్వైతార్థప్రతిపాదకమగు నొక స్వతంత్రభాష్యమును రచించెను. బ్రహ్మపరిణామ వాదమునాతఁడు

1) భాస్కరీయమ్తు చిదచిదంశ యుక్తం బ్రహ్మ ద్రవ్యం, అచిదంశేన విక్రియతే॥ (సర్వార్థసిద్ధి 3,27)

2) జీవపరయోశ్చ స్వాభావికోఽభేదః। ఔపాధిక స్తు భేదః॥ భాస్కరః 4,4,4; 2,4,18

ప్రతిపాదించెను. బ్రహ్మము చిత్తుగాను, అచిత్తుగాను, నీశ్వరుఁడుగాఁ
మార్పు నిజముగాఁ బొందెనని యాతని మతము. ఈశ్వరుఁడు చిద్రూ
మన్నదోఁ జీతనాచేతనరూపములన్నియు నాకేవస్తువుయొక్క అవస్థ
భేదములనిచెప్పవలెను. దీనినే భేదాభేదవాదమందురు బ్రహ్మమ
పరివర్తన మందినను దన స్వచ్ఛతను గోల్పోవదు ఒకేవస్తు వేకకా
మున నేకత్వభిన్నత్వములుగల దగుటలో యాదవునికి విరోధమేమియు
గాన్పింపలేదు. సర్వవస్తువులు సర్వకాలములలో గోచరించుచున్నవ
యాతఁడు చెప్పును కారణ జాతి ద్రవ్యరూపమున వాని కభేదమనియు
కార్యవ్యక్తిరూపమున వానికి భేదముగల దనియుఁ జెప్పఁబడెన
బ్రహ్మ జగత్తులు రెండు నీరీతిగా భేదాభేదములై యున్నవి.[1] పరిచ్ఛిన్న
ములగు జీవాత్మల పొట్లన్నియు బ్రహ్మమునందునని భాస్కరుఁ
చెప్పఁగా బ్రహ్మము సహజ స్వచ్ఛతతో నెప్పుడును ప్రకాశించు న
యాదవుఁడు చెప్పును.[2] జీవేశ్వర జడపదార్థములు బ్రహ్మ వికారము
గాక, మూలరూపములే యున్నచో, మనము భ్రమావశులమని తెలియ
గలదు బ్రహ్మ మొక్కటే యథార్థద్రవ్యము. మిగిలిన వన్నియు
నందుండి జనించినవే. యాదవుని దృష్టిలో భిన్నత్వమేకత్వము
సమానముగా యథార్థమైనది, భాస్కరుని భావములో భేదము ఉపా
మూలములు; ఉపాధులు యథార్థములే; ఏకత్వము మూలసత్యమ
చిదచిదీశ్వరులు పారమార్థికముగా యథార్థము అని భావించుటచే సంసి
భ్రమణ ముత్పన్నమగుచున్నది. ఈ యజ్ఞానమును బోఁగొట్టుటకు జ్ఞ
కర్మలు రెండు నవసరములే.

బ్రహ్మమునకు నీశ్వరునకు భేదము ప్రమాణ విరుద్ధమని రా
మనుజుఁడు విమర్శించును. ఈశ్వరున కతీతుఁ డెవ్వఁడును లేఁ
ఈశ్వరుఁడు బ్రహ్మమునకు వికారరూపమగుట యుక్తము. జీవేశ
పదార్థ శక్తులకు, శక్త్యాశ్రయమైన బ్రహ్మమునకును గల సంబంధ
విస్పష్టముగాఁ జెప్పఁబడలేదు.[3]

1) సర్వార్థసిద్ధి 3 అ 27

2) భాస్కరుఁడు 1,1,17

3) తత్త్వముక్తా కలాపము, 3 అ. 28

## 8 – జ్ఞానప్రమాణములు

రామానుజుఁడు ప్రత్యక్షానుమాన శబ్ద ప్రమాణముల నంగీకరించి, తక్కినవాని యెడ నుదాసీనత వహించెను. వాని యనుచరులొకటి రెం డధికముగాఁ జేర్చిరి. భేదమువలన వ్యక్తీకరింపఁబడినది ప్రత్యక్ష విషయము. దాని కొక రూపమును నిర్ణయించు జాతిలక్షణము గలదు.[1]

ప్రత్యక్షమున సవికల్పక నిర్వికల్పక భేద మున్నదని రామానుజుఁ డంగీకరించును. నిర్వికల్పక ప్రత్యక్ష మనఁగాఁ గేవలభేదరహిత విషయగ్రహణమును గాదు. గుణములతో నన్యోన్య సంబంధము లేని సగుణ విషయగ్రహణమును గాదు. అది నిర్గుణ విషయ గ్రహణముగా దేలన, గుణభిన్నత్వ లక్షణ విరహితవస్తుదర్శనము దుస్సాధ్యము. పై లక్షణ్యమే చిత్త ముఖ్య లక్షణ మగుటచేఁ, గొన్ని విశిష్ట లక్షణములు లేనిది వస్తువును మనము తెలియఁజాలము. ఒక విశిష్ట లక్షణ సహిత వస్తుగ్రహణమే జ్ఞానలక్షణమై యున్నది.[2] ఏలన సవికల్పక ప్రత్యక్ష మందును, నిర్వికల్పక ప్రత్యక్షమందుఁ జూడఁబడిన లక్షణము లనే తిరిగి స్మరించి గుర్తింతుము. రెంటికిభేద మే మనఁగా, నిర్వికల్పక ప్రత్యక్షమం దొక వస్తువును మొదటిసారియే చూచి, దాని జాతిలక్షణ మును గ్రహింతుము కాని యా జాతికిఁ జెందిన సర్వవస్తు లక్షణ మిదే యని తెలిసికొనఁ జాలము.[3] అట్టి వస్తువునే రెండవదానినో, మూఁడవ దానినో మనముచూచుట తటస్థించినపుడది యాజాతి వస్తువుల కన్నిటికి గల సామాన్యధర్మమని గుర్తింతుము.

రామానుజునికి వ్యక్తులే యథార్థములు. వానియందు జాతిత్వ లక్షణమనున దొకటిలేదు. అంశావస్థాన విషయములో సాదృశ్య

---

1) వస్తు బాహ్యలక్షణములు ప్రత్యక్షవిషయములు మన మొక ధ్వనిని వినునపుడు శ్రోత్రేంద్రియవృత్తి బహిర్గత మగును వాయు వింద్రియవిషయము గంధరూపవ్య యయ్యు, రూప స్పర్శలకు విషయము.

2) సవిశేషవస్తు విషయత్వాత్ సర్వ ప్రమాణానామ్. (1,1,1)

3) తత్త్వముక్తా కలాపము. 4,3,2.

మున్నది. సాదృశ్యమును బట్టియే వస్తుభావమును గల్పించుకొందుము. సాదృశ్యమే సమానపద ప్రయోగమున కాధారము.[1] భేదము కూడ వివరించు విషయసంబంధి కాదని వేదాంతదేశికునివాదము. అందుచే ప్రత్యక్షము మనకు విషయజ్ఞానమును దద్భేదమును గూడ నీయఁగలదు.[2] ఇవి అన్యోన్యాశ్రయములు కావు. రెంటి కేకత్వమును మనము గూర్ప యత్నించినపు డవి పరస్పరాధారభూతములుగాఁదోఁచును. కాని దీని నంతయు మన మిట్లింతఁగా గ్రహించినను, విషయసంబంధములేని భేద మెట్లుండఁగలదో దురవగాహమై యున్నది.[3]

యోగదృష్టి స్వతంత్ర జ్ఞానప్రమాణము కాదని రామానుజాను యాయులు తలపోసిరి. ప్రతి ఇంద్రియము నొక విశిష్టవస్తువర్గమునే చూచుటకు నిర్మింపఁబడినది; ఎంత యభ్యాసబలమున్నను నది యిత రేంద్రియవిషయములను గ్రహింపఁజాలదు; చెవి చూచుటకాని, కన్ను వినుటకాని జరుగదు. యోగదృష్టి యీ యింద్రియముల మూలము ననే పనిచేసినచో నది యింద్రియదృష్టి యింద్రియాతీతమైన దైనచో నది యనుభవదూర మగుటచేఁ బ్రమాణము కాఁజాలదు.

స్మృతి ప్రమాణ మంగీకరింపఁబడి ప్రత్యేక స్థాన మీయఁబడినది. అది ప్రత్యక్షములోఁ జేరదు. ఏలన, స్మృతి జ్ఞానములోఁ బ్రత్యక్ష మిమిడియున్నది. కాకున్నచోఁ బ్రత్యక్ష పూర్వకమగుటచే నమమాన మును ప్రత్యక్షముక్రిందకే రావలెను.

ఒక సామాన్య నియమమువలన లభించు జ్ఞాన మనుమానము. నిజమున కొక్కవిషయమే సామాన్య నియామమును సూచింపనగును. అనేక విషయములు మన సందేహముఁ దొలఁగించును. తర్కమువల నను, భావాత్మకాభావాత్మకోదాహరణముల వలననను, మన మప్రస్తుత

1) పోల్చు: జైన భావముతో

2) సర్వార్థసిద్ధి. 5-14.

3) అభావము ప్రత్యక్ష విషయముగాఁ జెప్పఁబడెను; ఏలన. నొక వస్తువు లేదన్నచో వింకొకచోట నున్నదని భావము, అనుపలబ్ధిమూలమునఁ జిత్తమున కెల్లప్పుడు తచనకు సంబంధించు విషయములుండ నవసరములేదని తెలియఁగలదు. (1,1,1)

విషయములను పరిహరించి, సామాన్య ధర్మస్థాపనము చేయుడుము.[1] తర్కవాక్యమునకు మూఁడంగము లున్నవి. న్యాయ పంచాంగ వాక్యములోని మొదటిమూఁడుమగాని చివరిమూఁడునుగాని స్వీకరింపఁ బడినవి. బౌల్చుట స్మృత్యనుమానములపై నాధారపడుటచే స్వతంత్ర ప్రమాణముగాదు. అర్థాపత్తియు; ననంభవము ననుమాన గర్భితములే.

రామానుజుఁడు శ్రుతిప్రమాణము నంగీకరించెను. సర్వసృష్టి కాధారభూతమగు పరమార్థమే యితర ప్రమాణములకును గ్రాహ్యము కానిదగుటచే శాస్త్రైకవేద్యము.[2] బ్రహ్మము ప్రత్యక్షవిషయము గాదు.[3] మన యనుభవములోని సామాన్య సూత్రములు బ్రహ్మముయొక్క యాథార్థ్యమును స్థాపించుటగాని, నిరసించుటకాని చేయఁజాలవు.[4] మన బుద్ధి సూచించు బ్రహ్మాస్తిత్వము మన ప్రజ్ఞాసీమ కతీతమైయున్నది. ఇంద్రియాతీత విషయ జ్ఞానమునకు శ్రుతియే సాధనము: తర్కము శ్రుత్యర్థ సమర్థనమునకే పనికివచ్చును.[5] వేదములు శాశ్వతములైనవి; ప్రతి సృష్ట్యారంభమున నీశ్వరుఁడు వానినుచ్చరించుచుండును. స్మృతీతిహాసములు వేదార్థప్రతిపాదకములే కావునఁ బ్రామాణికములే. భగవానుఁడగు వాసుదేవుఁడే కర్త యగుటచే పాంచరాత్రాగమములును ప్రమాణములే.[6] యథార్థమైనచో నైతిహ్యము లేక సంప్రదాయము నాగమ జ్ఞాన తుల్యమైనదగును.[7]

విజ్ఞానము స్వయముగాఁ బరమార్థ సాక్షాత్కారము నొసఁగఁజాలదని రామానుజుని నిశ్చయము. వేదములుకూడ మనకుఁ బరోక్ష జ్ఞాన

1) సర్వార్థసిద్ధి: 4,47 (2) 1,2,1

3) 1,1,3. (4) 1,2,23.

5) 2,1,12. అన్యమతఖండన వాద విమర్శనము నందు యామునాచార్యుఁడు స్వచ్ఛమగు హేతువాదమునే యుపయోగించును. తన ప్రతికక్షి వాదమును దిరస్కరించి యిట్లు నుడువును: "ఆస్తికుల కీ యుపదేశములో నమ్మక ముండవచ్చును. మనము నమ్మకము లేనివార మగుటచే వాదము సహేతుకముగా నున్నచో తృప్తి నిచ్చును.

(సిద్ధిత్రయము పు. 88)

6) తత్త్వముక్తా కలాపము॥ 4,121.

7) అది అసత్యమైనచో నాగమాభాస యగును॥

మునే యిచ్చును. శ్రుతివాక్యార్థ జ్ఞానముకంటె విలక్షణమైన దిం
నేదియో కావలసియున్నది. తర్కజ్ఞానముగాక సాక్షాత్కారము
సంభరిత మైన ధ్యానమువలన లభించును.[1] చేతనాచేతనరూప య
మైన యేకబ్రహ్మ సాక్షాత్కారము వామదేవాదులకు సిద్ధించెను
మహోన్నతమగు దివ్యజ్ఞాన మాత్మయొక్క విజ్ఞానేతరలక్షణ బలః
సాధ్య మగును. పరమార్థ స్వభావము నెఱుంగుటకు మనస్సున
శక్తులున్నవి. సత్యసాక్షాత్కారసిద్ధికి వలయు నొక మహా సంకల్పవ
నీ శక్తులన్నియుఁ గేంద్రీకృతము లగును. అప్పుడు మనస్సు వ
చ్ఛసీమలోఁ బనిచేయఁగలదు. అట్టి మహోచ్ఛస్థాయిలో మనస్సు
దార్శనికశక్తియు నూహాశక్తియుఁ గూడనుండును. దోషతరా
ముల కవకాశము లేకపోలేదు. కాని మనస్సుయొక్క నీచస్థాం
రసభావములు సమన్వయ శూన్యములై యుండును. కాని క్రమః
భావములెట్లు నియమబద్ధము లగుచుండునో యట్లే, రసములు సు
ములై హేతుబద్ధము లగును. అంతర్దృష్టికి గోచరించు విషయము
క్షముకాదు కావున దానిని పరోక్షజ్ఞానమనిరి; కాని దాని స్వః
సామీప్యత్వములను బట్టి ప్రత్యక్షజ్ఞానమున కది తీసి పోవునదా
నిత్యదైవార్చన, ప్రార్థనాదికములవలన దైవానుగ్రహము
జ్ఞానము లభించునని మనము ముందుఁ జూడఁగలము. ఇది భ
భూతి లేక యీశ్వరసాక్షాత్కారసిద్ధి; జీవాత్మ పరమాత్మాలింగనః
విలీన మగును.

సర్వవిజ్ఞానము యథార్థరూపమే[4] యైనచో మనజ్ఞానము క
వేళల నయథార్థ మేలయగుచున్నది? అన్యతదృష్టికిగోచరించ
వయథార్థము కాదు; ఏలనఁ బంచీకరణ సిద్ధాంతము ననుసరించి ప్ర
లోఁగల సర్వవస్తువులును పంచభూతాంశములేదో యొకనిష్పత్తిలో

---

1) రామానుజ భాష్యము. 3,2,23.

2) 3, 2, 24.

3) రామానుజభాష్యము 3,4,26.

4) సర్వం విజ్ఞానజాతం యథార్థమ్, (1,1,1)

వించిన సంయుక్త ద్రవ్యములే. ఒకదానిని "రజత" మనియు నింకొక దానిని "శుక్తి" యనియుఁ బేర్కొనుటకుఁ గారణము రెంటిలోఁ దద్వస్తు లక్షణ మతిశయమైయుండుటే. ముత్తెపుచిప్పలు వెండి శలాకలవలె నుండుటను మనము చూచియుంటిమి. అందుచే వెండి లక్షణములు గొన్ని ముత్తెపుచిప్పలోఁ గలవని ప్రత్యక్ష ప్రమాణమే చూపును." కొన్ని విషయములలో సమానత్వము వస్తుసాదృశ్యమును సూచించును. మన మెండమావులలో నీటినిఁ జూతుము. ఏలన, సూర్యకాంతియందును, మృద్దేశముల యందును నీరు గలదు. పచ్చకామెరలు గలవాని కంటికి ధవళశంఖము పచ్చగాఁగాన్పించును; కంటి పచ్చదనము నేత్రేంద్రియ కిరణ ప్రసారముతో శంఖమునుగప్పి, యందలి ధావళ్యము వాచ్ఛా దించును. ఈ వాద మెంత యశాస్త్రీయముగాఁ గన్పట్టినను, సర్వ జ్ఞానమును యథార్థసంబంధియను విశ్వాసమును విడిచిపెట్టుటకు రామానుజుని కిష్టములేదని విశదమగును. స్వప్నములందుఁగూడ జీవుల పుణ్యపాపముల ననుసరించియే, సుఖదుఃఖానుభవమునకై యీశ్వ రుఁడు వస్తురూపములను గల్పించును.[1] "జీవుల పుణ్యపాపఫలిత రూపముగా నీ జగత్తును సృజించి, గొన్నిటినిఁ గొలఁదిమందికిమాత్రమే గోచరింపఁ జేసి, కొలఁదికాలమే యుండులాగునఁగూడ సృజించును; ఈ భేదమువలననే, వస్తువుల ఉచ్చత్వ నీచత్వ భేదకారణ మైనది.[2] కొన్ని జ్ఞానవిషయము లసత్యములు, కొన్ని సత్యములనని భేదము చెప్పుట యుక్తము.

రామానుజుఁడు విపర్యయా స్తిత్వమును నిరాకరింపఁ జూచినాఁడు. అతఁడు జ్ఞానమంతయు సత్యసంబంధియేయనునుగాని, అన్నిరకముల జ్ఞానమును సంపూర్ణ సత్యసంబంధి యని చెప్పఁడు. మన జ్ఞానము సామాన్యముగా నపరిపూర్ణము; పాక్షికమునై యున్నది. మనము ముత్తెపుచిప్పను వెండియని భ్రమించినపుడు, మనము దానిలోని కొన్ని లక్షణములనే చూచి, కొన్నిటిని విడిచిపెట్టినాము. పచ్చని శంఖ

1) చూ, రామానుజ భాష్యము 3.2,5,6,

2) 1,1,1

మును జూచుటలో దాని భావశ్యమును విడిచిపెట్టితిమి. స్వప్నానుభవ ములలో విషయములు స్వప్నగతవ్యక్తికే సంబంధించినవి కాని యిత రులకు సంబంధించవను విషయమును మనసు మఱచిపోవుదుము. నిజ మైన జ్ఞాన మనుదానిలోఁ గూడ వ్యవహార ప్రయోజనముల కవసరము లగు నంశములను మనము గమనింపము. నిజమైన జ్ఞానమును, కాని జ్ఞానమును రెండును పరిచ్ఛిన్నములే యయ్యును, నిజమైనది మన యాశయముల కనుగుణము లగు నంశములను గ్రహించి, కార్యసిద్ధి నిచ్చును. నిజముకాని దీ పని చేయఁజాలదు నిజమైన స్థానము జీవి తోఁపయోగి; ఎండమావులలో దోష మేమనఁగా వందు జలాంశము లేక పోలేదు; అందలి నీరు మన దాహమును దీర్పనంతలేదు. నిజమైన జ్ఞానము యథార్థవస్తు సంబంధియు వ్యవహారాను గుణమునై యుండును.[1]

అన్నిరకములైన జ్ఞానమును యథార్థవస్తు లక్షణములను గొన్ని టిని దెలుపును గాని యథార్థ వస్తువును సమగ్రముగా గ్రహింపనిదే యది పరిచ్ఛిన్నజ్ఞాన మనియే చెప్పవలెను. మన జ్ఞానము సర్వతోముఖ సంపూర్ణతనందువఱకు, దోషావకాశము తొలఁగదు. అనఁగా, జ్ఞానాభి లాషికి సర్వలోపములు పోవలెను, ఆశయ ముందుకుగాని సంసార మగ్నుల కది సాధ్యము కాదు.

జ్ఞానము స్వభావముచేతనే అవిలంఘ్యమైన దని రామానుజుని భావము; ఈ లక్షణము ననుసరించియే నిర్వికల్పకజ్ఞానము సవికల్ప ముగా మాఱిపోవును. ఎల్లప్పుడు మన నిర్ణయములు విషయముల నుత్త రోత్తర పరిపూర్ణతకుఁ దోడ్కొనిపోవును. జ్ఞాన మత్యున్నతమైనపు డనఁగాఁ దనగమ్యస్థానమును జేరినపుడు, సముచితవ్యాపారములతోఁ గూడిన భిన్నాంశముల సమన్వయము గాంచిన యేకైకానుభూతి సిద్ధించును. అట్టి పరిపూర్ణానుభూతిలో ప్రత్యంశము, సముచితస్థాన వృత్తిని గలిగి, బరిచ్ఛిన్నమయ్యు, విశిష్టవ్యక్తిత్వమును గలిగియుం డును. జీవాత్మకు మోక్షసిద్ధితో పూర్ణజ్ఞాన ప్రాప్తియుఁ గలుగును.

---

1) యతీంద్ర మతదీపిక.

